# కథకుడులో కథ



రచన

" ఆంధ్రా వర్డ్సువర్తు "

శ్రీ కవికొండల వెంకటరావు B. A., B. L.

ప్రకాశకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్

సంస్కృతాంధ్ర బుక్‌డిపో [స్థా. 1882] రాజమండ్రి.

# కథకుడులో కథ

కథకుడు శబ్దము అనాది ప్రసిద్ధము. ప్రతి పురాణగాధకు మును ముందు అక్కధకుండిట్లనియె అనే సూచన మన క్కనిపిస్తుంది. మఱిన్నీ ఎవరైనా పొడుగ్గా నిజంచెప్పినా "ఆలా కధగా చెప్పకపోతే టూకీగా రెండు ముక్కల్లో చెప్పరాదూ" అని నివారిస్తాం. వీటిని బట్టి చూస్తే తొల్త కథ అన్నది పెద్ద అఖాత కల్పనగా చలామణీ అయినట్టు కనిపిస్తుంది. మఱిన్నీ, వాస్తవికంగా ఉన్నది ఉన్నట్టు చెప్పడం కథకుని లక్షణం కాదేమో కూడాను. కథ అన్నది కేవలం వచనంగా మున్ను చెప్పబడ్డట్టు కానరాదు. అది గద్యపద్యాత్మకంగా పండితుల మధ్యవుండేది. జన బాహుళ్యంమీద తఱుచు పదరూపం దాల్చేది. మనం వింటూ వచ్చే "అనగనగా"లకు సారస్వత ప్రపంచంలో స్థానం పూర్వకాలమందు లేదనే చెప్పొచ్చు. ముసిలమ్మలు తమ ముని మనుమలకు మునిమనుమరాళ్ళకు కాలక్షేపంగా చెబుతూవచ్చే టర్రాయి బుర్రాయి కబుర్లై ఏపూట కాపూటే హరించి పోయీవి. కథ కంచికి వెళ్ళిపోయేది. మన మధ్యనే ఉండేది కాదు.

అయితే ఇప్పుడు అధునిక సారస్వత ప్రపంచంలో కథ యొక్క రూపం ఏలాగ్గా పరిణమించింది? "ఊఁ" అంటే కథ. "ఆఁ" అంటే కథ........చుక్కలు పెడితే కథ. అసలు నిశ్శబ్దంలో కథ పలుకుతూ ఉందా అన్నంత ఇదికి వచ్చేసింది.

ఆమె........ ........

అతడు..............

అని సంభాషణ సూచిస్తూ కథ కేవలం........వీటితో ముగింప బడుతూవుంది. పాఠకుడు యోచించు కోవాలి. విను వాడు వినిపించేవాని ముఖం కేసి చూస్తూ గుండెలోతు ఆక లించాలి. వినిపించేవాడు " ఇది నా కల్పన కాదుసుమా. అంతా నిజంగా జరిగింది. " అని విన్నవాణ్ణి సమాధాన పరచాలి.

ఈ పరిణామం కథా సారస్వతానికి ఏలా వచ్చిందీ అంటే అన్నిటికీ ఏలా వచ్చిందో దీనికీ అలాగ్గానే వచ్చింది అని జవాబు చెప్పాలిసిందే. మరో పంథా కానరాదు. సిసింద్రీ బాంబులో సింహనాదంలా, హాట్టిరైకలో కనుకట్టులా కుదించి, కుదించి, కుదించి రచించి కథలో ఊహాదార్ఢ్యం చొప్పించాలని ప్రస్తుత కాలపు గధకుల విశ్వప్రయత్నము అని. నా నమ్మకం. చదివే ఆతడో తనకు మిక్కిలి తీరికవున్నా కథ అంతా అయిదు నిమిషాల్లో ఒక్కొక్కప్పుడు అరనిమిషంలో ముగియాలి :

వీరి ప్రయత్నాలకు సాయపడే పరికరాలు నాకు తెలిసి నంతలో మీ ముందు ఉంచడమనేదే యీ వ్యాసంయొక్క ముఖ్యోద్దేశ్యం.

పరికరాలు పలురకాలుగావున్నా మెట్టు విభజనచేసి చూస్తే స్థానం, జనం, సంఘటనం, ఈ మూడింటి మీదా సర్వ సాధారణంగా కథ అన్నది ఆధారపడి ఉంటుంది. శ్రీమద్రామా యణగాధ అయోధ్యలో పుట్టి, దండకారణ్యం అంతా చుట్టబెట్టి, లంక కగ్గిముట్టించింది కాబట్టే అంతరమ్యంగా వుంది. వానరులు సేతువుకట్టడానికీ సముద్రం తరించడానికీ అవకాశం ఇచ్చింది. ఇది స్థాన విశిష్టత. తద్వతుగానే జన విశిష్టత, సంఘటన విశిష్టత ప్రతీగాధకూ ఉంటాయని మనం తెలుసుకోవాలి. గాధకేలాగో

కథకూ ఆలాగే : అయితే కథ యొక్క పరిమాణం చిన్నదిగా ఉండి మన చుట్టూవున్న పరిస్థితుల్ని గూర్చి మన సాంఘిక వ్యవస్థల్ని గూర్చి ముచ్చటిస్తుంది. యజ్ఞ యాగాదుల ఫలితంగా పుట్టడం ఇల్లాంటివి కథలో ఉద్రేకం కలిగించవు. ఉండవు. తిన్నగా నరలోకంలోని ఒక తావు చూపిస్తాం. రోడ్డుమీద పైనందినం పోల్చగలిగేటంత వివరంగా మనుష్యుల్నే అవతరింపజేస్తాం. వాళ్ళను ఆనంద సముద్రంలోనో దుఃఖ సముద్రంలోనో ముంచెత్తుతాం.

కథద్వారా ఆనందమో దుఃఖమో చూరగొంటాం. ముక్తిని మూచూడం. చదువుతూ విశాలతర లోకంలో పడుతూ ఇహలోక సౌందర్యం ఇహలోక నిరాశ మన హృదయాన్ని పెనేసుకు పోతూవున్నట్టు దిక్కులు చూపిస్తాం. ఇది ఉత్తమ కథ లక్షణం.

ఉదాహరణ కొక చిన్న కథవ్రాసి చూపిస్తాను. దాని సల్లక్షణం పాఠకులు ! పరిశీలించండి.

" రోడ్డుమీద ఎండా చెట్లనీడా ఉండుండి మారుతూవున్న జాడనే పల్లెటూరిది, రెండెడ్ల మోటబండి పట్నం వెంపున నడుస్తూవుంది. బండినంటి వోరసిలగా పాంథురాలు, వస్తూ వాహనంలేని పల్లెటూరి పడుచొకర్తె అదే, పట్నానకు కాలినడకను ముందుచూపున గబగబా పోతూవుంది. బండివాడు తొట్టిలో నిదరోతూ ఉన్నాడు. ఎడ్లుతమంతనే సాగుతూ వున్నాయి. వలప ఎద్దు బెదిరింది, ఏదో కార్ సందడికి. బండి యొక్క కాడి పాంథురాలి బుజాన్ని రాసుకుపోయింది. బండివాడలా నిదరోతూనే ఉన్నాడు. లోతు తొట్టిలో అలా

నిదరోతూనే ఉన్నాడు. పైకి కాపడ్డంలేదు. ఎవర్ని తిడుతుంది పాంధురాలు ?

"బండివా డేమైపోయినాడో వీడిజిమ్మడ ! బండి నామీద కెక్కేశాడు నామీద కెక్కేశాడు. చచ్చిపోయీ దాన్నికందా కాడి కాక సెక్రం తగిల్తే, బండివా డేమైపోయినాడో వీడి జిమ్మడ !" అని తిట్టిపోసికొంటూ తన జబ్బ తడుముకుంటూ బండికి వెనుకయి తడికట్టుకుంది. బండీనడక అరికట్టాలనో లేక బండీ నమాంతంగా బోల్తాకొట్టిద్దామనో ? బండివాడా చేష్ట కులిక్కిపడి లేస్తూ వెనక్కుచూచి "ఎద్దును బెదరగొట్టింది ఎవురమ్మీ ! నువ్వా ?" యని అడిగాడు పాంధురాల్ని.

"ఆ : నేనే :—నా చేతుల్ని గాజులు మెఱసి పోతున్నాయి. నా కాళ్ళకు మట్టెలున్నాయి ! నా మొలకు బంగారు మువ్వలున్నాయి ! నా సీరకు రంగుంది ! నా నడకలో పొంగుంది. ఆ ! నేనే !—నీ జిమ్మడ ! సెక్రంతప్పి కాడే తగలమట్టి బ్రతికిపోయావు, కాకపోతే ఏకాడుందువో యీపాటికి ? ఉరిస్తంభం అరుగెక్కి యుందువు. మేలు కూ్కుని తోలుకోబండి ! మేలుకూ్కుని తోలుకోబండి !" అని హెచ్చరించింది ఆమె.

"నా నురిస్తంభం అరుగెక్కి ఈ ప్రాణం పోతూవుంటే నీ సచ్చిన కళ్లూరుకుంటాయా ? ఏడ్చెయ్యవు ? ఆ పొద్దేడ్చెయ్యవు? ఏ పొద్దూ ఏడ్చెయ్యవు ?" అన్నాడు బండన్న చిరునవ్వు నవ్వుతూ. వానివయస్సు పాతిక మీద రెండేండ్లు. వాని చెవులకు తెల్లపొళ్ళకమలా లున్నాయి. వాని బండి చిరతలకు ఇత్తడి కట్లున్నాయి !

పడుచుపిల్ల కళ్ళల్లో కమలాలూ కష్టేకాకుండా ఆ కోడెకాని పాతికమీద రెండేండ్లూకూడా సూటిగా ప్రతిబింబాలానాయి!"

.... .... .... .... ....

# పేకమేడనుండి 'టార్పెడో' దాకా

ఇప్పుడేమైనా ఆటలు ఆడి, వినోదరాయళ్ళతో కూడిమాడి, ఘంటలు ఘటికలు వెళ్ళబుచ్చానా, అది కాలహత్య. కాని ఆ రోజుల్లో ఆటలు పాటలు, వినోదాలు వేడుకలు, కాలంలోంచే ఉదయించి, కాలాన్ని బలపరచి, కాలాన్ని చిరాయువుగా జేసే సాధనాలు యని అనుకోండి.

1905 లో నేను నా మొట్టమొదటి పేకమేడ కట్టాను. మా ఊరిలో మా అరుగుమీద, ఆ యేడు అష్టాదశ పురాణ పఠనంతో పాటు చతుర్ముఖ పురాణ కర్మకాండ కూడా విరివిగా సాగుతూ ఉండేది. పదహారు పేకల్తో, ముప్పై ఏయిద్దరు కూడా,- వొక్కొక్కప్పుడు అరుగు క్రింద ప్రాంగణంలో బండి బావలు పరిపించుకొని, ఊళ్ళోని యోధానాం యోధులంతా, తలుచు అడ్డాట ఆడుతూ వుండేవారు. చిత్తు ముక్కలు తీసివేత ఉంటే, దూరంగా పడేసి నన్ను మేడలూ మిద్దెలూ కట్టుకు ఆడుకోమనే వారు. ఆడుకుంటూ కట్టుకుంటూ, ఉండుండి ఆ పెద్దవాళ్ల పట్టిన పట్లవంక, చేతిలో పెట్టుకున్న ముక్కలవంక, చూసేవాణ్ణి. "ఎందుకురా అలా చూస్తావు?" అని వాళ్ళల్లో ఎవళ్ళన్నా గద్దించారా, "మీ ఆట అయ్యాక పదహారు పేకలతోటి ఎత్తైన మేడ కట్టాలని, మీరు ఆట ఎప్పుడు మానేస్తారా అని" అనేవాణ్ణి.

ఇలా కొన్నాళ్ళదాకా నా వెఱ్ఱివాక్కు విని విని ఆ ముప్పై ఏయిద్దరూ ఒక రోజున "ఏది! కట్టు! పదహారు పేకల్తోటి నీవొక్క మేడ, ఎంత ఎత్తు కడతావో? ఎంత సేపట్లో కడతావో!" అన్నారు పందెం చరచినట్టు.

"మీరు పడగొట్టకుండా ఉంటే ఎంత ఎత్తైనా కట్టానన్న మాటే!"

అని వాళ్ళనందర్నీ దూరంగావుండమని, పదహారు పేకలతో పెద్ద ఎత్తైన మేడ కట్టసాగేవాణ్ణి: అయితే దాన్ని పూర్తిగా లేవనివ్వకుండానే, ఆ పెద్ద వాళ్ళల్లో ఎవరో వొకరు వూది, పడగొట్టి వెళ్ళిపోయేవారు. నే నేడుస్తూ అతగాణ్ణి వెను దఱిమేలో, బండిచాపలు తీసేసేవారు; పేకముక్కలన్నీ ఎత్తి పేర్చి నా కందకుండా దాచేసేవారు.

ఈలా వుంటూ వుండగా 1905 వేసంగిలో కానోపు, నాకు వడుగైంది. అప్పటికి మా తండ్రిగారు తిరిగి వివాహం చేసి కొన్నారు. భార్యా భర్త లిరువురున్నూ పీటలమీద కూర్చునే నాకు సవ్యంగా వడుగుచేశారు! ఆ రోజుల్లో వడుగంటే అదో బ్రహ్మాండమైన ఉత్సవంగా చేస్తూవుండేవారు. ఆ ప్రకారంగానే నాకూ జరిగింది. రాజమహేంద్రవర పాఠశాలకు పంపిన నా సెలవు చీటీలో బహుశా నేను ఆమ్మహోత్సవాన్ని మహా హేతువుగా నిరూపించి "On account of my thread marriage" అని పేర్కొని ఉండివుంటాను. తెనుగు సంస్కృతములను బట్టి ఉపనయనంలో ఉద్వాహమన్న సూచన లేకపోయినా ఇంగ్లీషు వాడుక పదంలో "థ్రేడ్ మారియేజ్" అని వ్రాసి అంతో ఇంతో వివాహ సూచన చిన్నప్పుడే కావింపబడేది. అదే హైందవ సంఘము నందలి అతిబాల్య వివాహాలకు కారణమేమో కూడాను. ఆ వాదం ప్రస్తుతం పక్కకు నెట్టినా వడుగులోని క్రమభావం చిక్కబట్టి చూదాం.

మా తండ్రిగారు నాకు యథాప్రకారంగా నా చెవిలో అతి రహస్యంగా బ్రహ్మోపదేశం గావించారు. బ్రహ్మోపదేశం

అయి బ్రాహ్మాశీర్వాదం పొంది మంగళహారతి అంది, ఇలా యివతల బడ్డాను ! అలా ఒకవడుగు కాని కుఱ్ఱకుంక "బ్రహ్మోప దేశం ఎలాగుంది ఏమిటి ? అని అతిహేళనగా అడిగాడు.

"పేకమేడలోకి గాలి వూదినట్టుగావుంది" అన్నాను. ఆ జవాబు విని వూరుకోవచ్చునా వాడు ? వూరుకోక అడిగాడు "గాలి వూదగానే పేకమేడ కూలిపోయింది. నీవు అలాగే వున్నావు పడిపోకుండా !" అని.

నేను అంతకు ముందు నందిమోహనం వంట అదుదుం బొడుదుం అయినా ఆకలి తీరా తిని, మఱీ పొందాను బ్రహ్మోప దేశం ! ఆ పేక గూళ్ళల్లో కూడా మిఠాయి ఉండలు, జిలేబీలు, అవీ యివీ పెట్టి వుంచి వూత్తే పడిపోదను కుంటాను. ఆ మేడ" అని సమాధానం చెప్పాను.

అప్పటినుంచీ వాడూ నేను పేకమేడలు కట్టి, వాడు తిను బండారాలు తేవడం, నేను పెట్టడం చేసేవాళ్ళం. పెడుతూ ఉంటేనే పడిపోయావి ఆ ముక్కలు ! ఇక ఊదేదేమిటి ఆ గూళ్ళ ల్లోకి ? ఇద్దరం కూర్చుని ఆ తిను బండారాలన్నీ ఊదేశేవాళ్ళం మా బొజ్జల్లోకి !

అయితే సెలవు లయిపోయి రాజమండ్రి రావడంలో ఆ మహాపట్నంలో చీట్లాటకు తావుండేది కాదు. అక్కడన్నీ నిజం మేడలే కనబడేవి. మఱి తినుబండారాలన్నీ బాదం ఆకుల్లో పెట్టుకు తినేవాళ్ళం మేం కుఱ్ఱవాళ్ళం.

మేము అద్దెకున్న యింట్లో ఒకమూల ఒక పెద్ద బాదం చెట్టు ఉండేది ! ఆ చెట్టు ఆకులు అన్నీ వొకేసారి పండి, ఒకే సారి ఎఱ్ఱబారి ఉంటూ, చెట్టంతా పూత పూసిందా అనే వెలుగు

గొల్పేది. ఆ ఆకులన్నీ రాలేసరికి, అమ్మల పొదిలోంచి పుంఖాను పుంఖంగా పొడ సూపినట్టు చిగురాకు బయలుదేరేది. ఒక్కొక్క బాదంకాయ కొట్టీ కొట్టీ, పప్పు ఇవలకు దొలిచి లాగే సరికి జబ్బలడి పోయేవి. అయినా అదో తినుబండారంగా మాకు లెక్క కాబట్టి కిందపడ్డ కాయనల్లా పగలగొట్టేవాళ్ళం. లోపటి తెల్లటి పప్పు ఆకుల్లో పెట్టుకు తినేవాళ్ళం. ఒక్కొక్కప్పుడు బజార్లో కొనుక్కున్న పసుప్పచ్చటి కారప్పూసా, కారబ్బూందీ కూడా పెట్టుకు తినేవాళ్ళం. ఏమైనా తినే వస్తువు రంగు వేరుగాను, ఉంచుకునే వస్తువు రంగు వేరుగాను కనిపించేది. మటీన్నీ తినే వస్తువు అంతలో ముక్కుక్రింది గోతిలో పడి మాయమయ్యేది. ఉంచుకునే వస్తువు ఆలా గిరాటు వేయబడి, ఎండిపోయి చెత్తగా తుడిచివేయ బడేది. "ఆకుల్లో ప్రాణం లేదు. ఆకులు చచ్చి పోయాయి" అని కూడా అనుకునేవాళ్ళం, ఒక్కొక్కప్పుడు అతి జాలిగా !

ఇలా రాలిపోయిన బాదం ఆకుల మీద నాకు జాలి పారిన ఆ రోజుల్లో దసరా సెలవులొచ్చాయి. తిరిగి మా వూరు వెళ్ళటం తటస్థించింది. అప్పుడు దసరాకు ఊరిలోని పెత్తందార్లు అంతా కూడి అమ్మవారి గుడివద్ద తోలుబొమ్మలాట ఆడించారు. అదే మొదటిసారి నేను అలాంటి ఆట చూడ మొదలు పెట్టింది. ఆ బొమ్మలరంగులు, వొంగులు, తెరనుండి అట్టే ఎడపరచి ఇట్టే గ్రుచ్చేలో చూపించే చెంగులు, వెలుగు దిగ్రమింగులు అన్నీ ప్రత్యక్ష ప్రత్యక్షర సత్య పురాణమై నేత్రపర్వం గావించేవి. ఆడించే మనుష్యుల ప్రాణాలకంటె పెద్ద పెద్ద ప్రాణాలు ఆ బొమ్మల్లో రాత్రివేళ రహించేవా, రాముడై, రావణాసురుడై,

వాళ్లై, కాలనేమై, అని విస్తుపోసాగాను. ఆ విస్మయం విస్మయం దసరా సెలవుల అనంతరం తిరిగి రాజమహేంద్రం చేరుకున్నా నాలో నశించి పోలేదు. బొమ్మలాటవాళ్ళు బొమ్మలకు ప్రాణాలోసినట్టు నేను మాత్రం రాలి పోయిన బాదం ఆకులకు ప్రాణం పోయలేనా అనే ఊహావేశం జనించింది. చెట్టునుండి రాలే ఆకుల్ని చూచినప్పుడల్లా! మఱినీ్న తోలు బొమ్మల రంగునందు, పండబారిన బాదం ఆకుల రంగునందు ఒకేవిధమైన రమ్యత, సౌమ్యత నాకు గోచరించాయి.

వెంటనే ఈ చేతిలో ఒక పండుబాదం ఆకు, ఆ చేతిలో పదిపండు బాదం ఆకులు నిలువునా నిలబెట్టి ఒక ఆకును రాముడు అంటూ, పది ఆకుల్ని పది తలకాయల రావణాసురుడు అంటూ, రాముని చేత దెబ్బలు కొట్టించి, దెబ్బ దెబ్బకు ఆకు ఆకుగా పెడచేత నున్న పదాకుల్ని జారవిడిచి "చచ్చాడు రావణాసురుడు" యని రామునికి జేజే సమర్పించాను.

"ఒరేవ్! రాలిపడ్డ బాదం ఆకులకు ప్రాణ ప్రతిష్ఠ చేశానురోయి!" అని తోటి కుఱ్ఱణ్ణి హెచ్చరించాను. వాడు తోడ్తో చెట్టెక్కి రాలిపోని ఆకుల్ని కూడా "కపి సైన్యం లంక మీదకు దిగుతోంది చూడు" అని ఒక వంద ఆకుల్ని రాలేశాడు. లోపట్నుంచి మా అమ్మమ్మ వచ్చి మమ్మల్నిద్దర్ని మోది ఆ ఆకు లన్నింటినీ తుడిచి, పెంటపోగుకు చేర్పించింది. "మరి ఆకులుతో తోలుబొమ్మలాడారా మీ వొంటి తోలూడిపోగలదు" యని భయపెట్టింది. చేతిలోని చీపిరూపుతూ!

ఆమెకు లొంగుతామా మేం? మర్నాడామె ఆ బాదం చెట్టు కొట్టేయింపించింది ఇంటివాళ్ళ చేతనే. "ఇంటి పెంకులన్నీ

చితికిపోతున్నాయి. వెధవచెట్టు పనికిమాలినచెట్టు" యని చెట్టు మీద చాడీ చెప్పింది మా ముసిలవ్వ.

చెట్టు కొట్టివేసి నప్పట్నుంచి ఆ స్థలం "సువిశాల మిదం విశ్వం" అన్నట్టు మిక్కిలి పఱపై, బట్టబయలై కనబడ సాగింది మాకు! "ఆ స్థలం అంతా ఊరికే పోనివ్వడమేనా?" అనే యిది లోలో రేకెత్తింది. ఆ మా నూతనోత్సాహం పెద్ద వాళ్ళకు తెలియజేయ నివ్వకూడదనుకున్నాం! ఈ కొత్తగా పుట్టిన ఉత్సాహం, లోలోతుల్లోంచి ఉప్పతిల్లింది గాని, పైపైని రేగింది కాదు. ఒకింత "సీరియస్" మొహాలు వేసి యప్పుడప్పుడు ఆలోచనా నిమగ్నులమై అన్యోన్యం అతిదీర్ఘ సంభాషణలు గావించుకునే వాళ్ళం కూడాను, నేనూ నా తోడి ఆటగాండ్రును. వీళ్ళేదో కొంప ముంచేటట్టున్నారు. అని పెద్దవాళ్ళు వాక్కొ క్కప్పుడనుకునేవారు.

చెట్టు కొట్టివేయ బడ్డ మొదటనే ఒక చిన్న ఆటగుడారం వేశాము. అందులో, మాలో కొందఱం సింహాలమై, కొందఱం ఏనుగులమై, కొందఱం గుఱ్ఱాలమై, కొందఱం మల్లులమై, కొందఱం అల్లరిగాండ్లమై, వాలుమొగ్గలు, తల్లక్రిందు నడకలు కొమ్మ నిలుపులు, కుస్తీ చఱపులు, ఎన్నెన్నో కోటి ఫీట్లుగా ఆడేవాళ్ళం, ఎక్కడ నేర్చారర్రా ఇవన్నీ యని పెద్దవాళ్ళు అడిగితే, "మీరు అప్పుడే చూడకూడదు. టిక్కెట్లు పెట్టి ముందు ముందు ఆడతాం! అప్పుడు రావాలి" యని వెంట వెంటనే వాళ్లు చూచేలాగు మల్లుమొగ్గలు పిల్లిమొగ్గలు వేసేసే వాళ్ళం. వాళ్లు "భడవల్లారా! పెద్ద సర్కస్‌కంపెనీ లేవ తీశారే!" యని మా రహస్యం కనిపెట్టేసి కట్టుకట్టేసి వెళ్ళి పోయేవారు.

పెద్దవాళ్ళనుకొన్న దానిలో నిజం లేకపోలేదు. ఆసంవత్స రం దీపావళీ ప్రాంతమందు వచ్చి వెళ్ళిపోయాయి కొన్ని కొన్ని పెద్ద పెద్ద సర్కసు కంపెనీలు. వీనుమిగిలిన " మేనా జరీలతో " మేనేజర్ల'తో " ఛత్రిస్ " యని " కోడిస్ " యని ఏవేవో. అయితే వాటిని చూచి మేమీ ఆటలు ఆడేము యని వొప్పుకునేవాళ్ళం కాము. అదంతా మా సొంత నేర్పు, మా వింత సృష్టి, మా శరీర సౌష్ఠవం యని విఱ్ఱవీగబడి పొయ్యేవాళ్ళం. ఎంత వెలుగ బడినీ్న, ఒకానొక ఎఱుకలేకపోవడంవల్ల, చివరకా ఉద్యమం విరమించేశాం! ఏమిటి అంటారా ఆ ఎరుక?- పెద్ద పెద్ద కొరడాలుచ్చుకు టప టపా పేలించడం మాకు సాధ్య మయ్యేది కాదు మఱీన్ని " ఎడ్వర్టయిజుమెంటు పోస్టర్లు " అంటే, ప్రచురణ లేక ప్రచార పత్రాలు, పటాలు, ఏనాడు వీధి గోడలకు గతుక్కుని మమ్మల్ని లోకానికి వెల్లడి చేస్తాయో బోధపడేది కాదు. అది దానంతటదే దేవతల వల్లనో మహాత్ముల వల్లనో జరుగవలసింది కాని, మానవుల వల్ల జరుగ గలిగేది కాదని మా నిశ్చితాభిప్రాయం. ఏమా అంటే ఆ రోజుల్లో రెండో కంటివాడు చూడకుండా అంత రహస్యంగా ప్రకటించబడేవి వీధి గోడల మీద బొమ్మలూ, బొద్దక్షరాలూ, సమస్త ప్రకటనలూను.

అయితే యోజించగా, యోజించగామాలో లోపం కూడా కొంత కనిపించేది. పెద్దపెద్ద కొరడాలు టప్‌టప్ మనిపించాలంటే, మిక్కిలి పొడుగ్గా ఉండాలి. వొకానొక మనిషి, ఎత్తుగా గోడల మీద ఇతరులు చింపెయ్యకుండా చీటీ లంటించాలీ యంటే, అంతకంటె ప్రాంశులై ఉండాలి ఒకానొక వ్యక్తి. మేం చూదొస్తే భూమి? జానెదెత్తైనా కనిపించే వాళ్ళం కాం.

అందులోనూ నేను 1905 లో నేలములగచెట్టుకు నిచ్చెన వేసే సామెత కొలతకు వచ్చేవాణ్ణి! కాని నడుము పేలవం కావడం వల్ల నిలువునా వెనక్కు వాలి, వాలుమొగ్గ వేసేసేవాణ్ణి! ఎంత ఘనుణ్ణి అయితేం ఏతదుద్యమవిరమణంతో పాటు నా వాలు మొగ్గలకున్నూ నేను స్వస్తి చెప్పెసెయ్యవలసి వచ్చింది!

అప్పటినుంచి పొడుగుపాటి మనుష్యులను చూస్తే నాకదో విధమైన కసి, కావేషీ ఎత్తేది. "వాళ్ళను నేలకు పడగొట్టి నేను నింగి చూతును గాక!" యని నిత్యం భగవంతుణ్ణి ప్రార్థన చేసేవాణ్ణి. ముఖ్యంగా ఆర్య సాంప్రదాయంగా తూర్పుకు తిరిగి "ప్రత్యూష పవనాంకురములకు" నా జునపాలాడేలా సూర్యోపాసన గావించే వాణ్ణి. అప్పట్లో నాకు జునపాలు, జుత్తుముడీ అవీ ఉండేవి. నాకేకాదు. ఆంధ్రులలో పెక్కురకుండేది. ఈలా, సూర్యోపాసన చేయగా చేయగా నాకు కనిపించింది నరుడు గాదు, అమరుడూ కాదు. ఒకానొక దేశం ఒకానొకనాడు కన పడింది. ఇంగ్లీషులో దాన్ని "Land of the Rising sun" అన్నాను. ఆ దేశం పుస్తకాలలో వుందా యని వెతికితే "జపాన్" గా తేలింది. దాని విషయమై ఇంకా తర్జన భర్జనం చేయగా "జపానీయులు మిక్కిలి పొట్టివాళ్లు యని, పొడుగు వాళ్ళయిన రష్యా వాళ్ళను ఓడించి బుద్ధి చెప్పారు యని, ఆ జరిగింది ఆ యేడేనని అనగా 1905 లో నేనని గమనించ గలిగాను.

"అంత పొట్టివాళ్లు అంత పొడుగువాళ్ళను, జయించారా?" అని వాళ్ళ సాధనాలు, ప్రక్రియలు పరామర్శింప దొడకొన్నాను. ఒకటి "జుయిజుట్సు" రెండు "టార్పెడోస్" అని తేలింది.

" జుయిజుట్సు " లో ఎదరమనిషి కాల్లోకాలెట్టి పడగొట్టాలిట. అదోకుస్తీ పట్టులోని కిటుకు, మెళుకవానట! ఎంత పొడగరైనా ఈ పొట్టివాడలా మెటకరించే సరికి, అమాంతంగా తలదేఖీలతో పాటు భూతలం అంటి చిత్తుగాపడమేనట! ఎదర ఎత్తరి! అది నావల్ల కాదని వెంటనే తేల్చేసుకున్నాను. రెండు మూడు తడవలు పొడుగ్గానడిచే మా మాతామహుని కాళ్ళ కడ్డద్దాలకి చూచాను పడతాదేమో యని, కాని ఆయన ముందు నేనే ఎప్పుడూ పడిపోయేవాణ్ణి. ఏమిట్రా అది అంటే సాష్టాంగమనే వాణ్ణి. నా ముందు ఆయనెప్పుడూ పడ్డడితేడు. ఇంటిలోనే గెలవ లేప్పుడు వీధిలోనా గెల్చేది యని జుయిజుట్సు గొడవ వదిలేసి టార్పెడో నిర్మాణానికి సంకల్పించాను.

ఇది చాటుగా నీళ్ళ మాటుగా సముద్రంలోకి పోయి శత్రువులయొక్క పెద్ద ఓడక్రింద " ఢాం " మని పేలి ఓడ నంతనూ పేడుగా పొడుగా చేసివేసి ఉగ్రరంగరించినట్టు సముద్రం బొంగరించి పారేయగలదట! కాబట్టి టార్పెడో ఢాం మనిపించానా నేను జపాన్ వీరుణ్ణి అయ్యానన్నమాట. ఇదీ ఆ సంవత్సరపు కడసారి సంకల్పం నాలో విజృంభించినటువంటిది. కాని సముద్రం సృష్టించటం ఎట్లా? అవతల ఓ పెద్ద వోడ ఎవరిదని ఎదరనిల్పను? నేను ఆ టార్పెడో పేత్తే బ్రతుకు తానా? నాకే మోసం వస్తుందేమో? " ఇవో కొన్ని కొత్త సమస్యలు చిత్తం కలవరపర్చసాగాయి. కాబట్టి అవివేరంగా ప్రయోగముకు వెంటనే బొలుబడకుండా నిదానం వహించి " టార్పెడో " ని గురించి విజ్ఞానం ఇంకా సంపాదించసాగాను. టార్పెడో ప్రయోగముకు కావలసింది సాహసం గుటి యని

ద్విభాగాలుగా తేల్చాను. రెండింటినీ సమీకరణం చేయడం కూడా ఎట్టకేలకు జరిగింది, గుటీవుంటే సాహసం అదే జతపడు తుంది యనే నావూహ.

ఈ ప్రకారంగా గుటీ, సాహసం రెండింటినీ సమన్వయం గావించుకుని, ఓనాడు పంచేసాను ?—కాలి బొటనవ్రేలికీ, దాని పక్కవేలికీ మధ్యను ఒక చిన్న రాయినెత్తిపట్టి యతి సూటిగా, అపరసంజవేళ, మటీ మటీ యిరులప్పుడు టపీ మని దేన్నో పొడుగైనదాన్ని తగలాలి ఇది యని ఆరాతి కెక్కడ లేని "మొమెంటమ్" ఇచ్చాను. వెంటనే అది వెళ్ళి ఎత్తైన మునిసిపల్ లాంతరు స్తంభం చివరనున్న లాంతరు అద్దాన్ని పగులగొట్టింది.

"ఏలాగయ్యా! దీపం వుండేది?" వెనుకనుంచి ఎవడో కేక! ఎవడేమిటి? పెద్ద నిచ్చెన. నిషూ గుడ్డపాగావాడూ మునిసిపల్ దీపాలు వెలిగించే ముసలి చాకలి! నా ప్రాణాలు నాలో లేవు! నేను గానట్టుగా గభీమని, పక్కనేవుండేమో మేం కాపురం వున్న యిల్లు, ఆ యింటిలోకిదూరి తలుపు గెడ పెట్టే శాను. ఇప్పుడా వీధిని రాయి విసిరానా ఆ రాయివెళ్ళి పెద్ద పెద్ద షాహుకార్లు కట్టుకున్న ఆకాశపు టెత్తు అద్దాల మేడల తలుపుల్ని తగుల గలదు. ఆ రోజులలో కాబట్టి సరిపోయింది. ఆ కుటుచ వసారాల యిల్లు కాబట్టి నాకు దాక్కో తలుపు తెఱచి, తలుపు వేసుకుంది. నన్ను తన సందుగుండా ఎంతో బుద్ధిమంతునిగా లోకానికి చూపింది!

.... .... .... .... ....

# ప్ర యా ణ పు టి ది

ఇదంతా చదవగా చదవగా చదువరి ఏమన్నా అనుకోవచ్చు. ఇది నిజంగా జరిగిందనీ యనుకోవచ్చు, జరుగలేదనీ యనుకోవచ్చు. అటువంటి ఫాక్టు అండ్ ఫిక్షన్ మిక్స్చర్ ! ప్రత్యక్ష పురాణం !

నేత్రానందరావు పాతికేళ్ళ యువకమహాశయుడు. కొత్తగా న్యాయవాదివృత్తి అవలంభిస్తూ జిల్లాలోవున్న క్రిమినల్ కోర్టులకు తరుచు కమానుమీద వెడుతూండేవాడు. ఎడ్వొకేట్ ! తెల్లని బాండులూ నల్లనిగౌనూ చర్మపు పెట్టెలో పెట్టుకొని పెట్టె చేతపట్టుకొని స్టీములాంచీ ఎక్కాడు. రెడ్డిపోలవరాన్నివున్న ఏజెన్సీ కోర్టు ఆతగాని నాటి గమ్యస్థానం.

లోపలి నిజం సాక్షి ఏలా మొహం చిమ్మేలా చెప్పాలో ఆలా తనలోనున్న సరుకు అందఱకూ తెలియాలని ఆ లాయర్ వూహ ! అంచేత హెడ్‌లోని లా అంతా లెటర్ హెడ్ ద్వారా క్లయింట్లకు తెలియపరుస్తూండడం చాలక అనగా—ఎమ్. ఎల్. అని—వాళ్ళచేత మోయించే పెట్టెమీద "గౌనుకేసు" అని చిత్రింపించుకున్నాడు.

ఆ స్టీమ్ లాంచిమీదనే ఓ యువతీరత్నం, పేరు, సక్రందనమ్మ ఎక్స్‌కర్షన్ బయల్దేరుతూ ఆతడెక్కిన మరో కాస్సేపటికి ఆమె ఎక్కింది. ఆమెతోనూ ఓ చర్మపు పెట్టెవుంది. ఆ పెట్టెమీదకూడా లాయర్ పెట్టె మీదలాంటి సమాచారంగానే "గౌనుకేసు" అని వ్రాయబడివుంది. కాని ఈమె పెట్టెమీద ఈలా వ్రాయబడివుండడానికి కారణం వేఱు. ఆడవాళ్ళవద్దనున్న చర్మపు పెట్టెల్ని సూట్‌కేస్ లనడం ఎంతమాత్రం సరియైన

లింగ నిర్వచనం గాదనీ వాటిని గౌనుకేసులనాలని, స్యూట్ మగవాడు వేసేదని, గౌను ఆడది వేసేదని, సమాలోచించుకొని తనతోవుండే చర్మపు పెట్టెమీద ఇతరులు తన్నెంతమాత్రం మగాడని అనుకోకుండా " గౌనుకేసు " అని వ్రాయించుకుంది.

లాంచి దిగడంలో ఇద్దరి పెట్టెయీ ఒకరిదొకరికి తారు మారైనాయి. అయినప్పటికిన్నీ రెండింటిమీదా గౌనుకేసు అనే వ్రాయబడివుండడంచేత ఎవరి పేటెంటు వారివద్దనే ఉన్నట్టు టిక్‌టాక్‌గా దిగి చక్కాపోయినారు.

సంక్రందనమ్మ ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరిన యువతీ రత్నం కాబట్టి తిన్నగా పరిసర ప్రాంతాన్ని వున్న ఓ చిట్టడవిలో ప్రవేశించింది. అడవిమధ్యను ఓ చెరువు చూచుకుంది. చెరువు గట్టుమీద కూర్చుంది. చెరువు అంతటా నీళ్ళూ నీడా కలిసిపోయి యుంది. చెరువుచుట్టూ చెట్లూ తీగెలూ అలుముకుపోయి పువ్వులు పూసి కాయలుగాసి ముచ్చటగావున్నాయి. చెర్లోకి చెట్లనీడతో పాటు ఆమె నీడ కూడా పడుతూంది.

తన నీడ నీళ్ళల్లో చూచుకొంటూ అలా, తనతోనున్న చర్మపు పెట్టె మీట నొక్కి అందులోంచి ఏదో పరధ్యానంగా తీసికోబోయింది. ఏదో చేతికి కొత్తగా తగిలింది. పెట్టెకేసి చూచింది. పెటెలో నల్లని గౌను! తెల్లని బాండులు! అది లాయరుగౌనని, అవి ఎడ్వొకేట్ బాండులని ఆమెకు తెలియదు.

పెట్టెమీద పేరు చూచింది. గౌనుకేసు అని వుంది. తన పెట్టెమీద తప్ప మరోపెట్టెమీద ఆలాంటి పేరు వుండడానికి వీల్లేదని అనుకుంది. అది తన పెట్టేనని నిర్ధారించుకుంది. అయితే తన పెట్టెలోకి అలాంటి గౌనూ అలాంటి బాండులూ

ఎలావచ్చివుంటాయి తాను పెట్టినవికావే? తాను కుట్టించుకున్నవి కావే? ఇలా వితర్కించుకో దొడగింది. అంతా బలే మ్యాజిక్‌గా వుంది. అడవిలో కొండవాళ్లుగాని కోయవాళ్ళుగాని తనమీదే మన్నా మత్తుమందు జల్లారేమోనని తలపోసికుంది. తానెవర్నీ ఎదురైంది లేదే ఎల్లా జల్లివుంటారు యని అనుకొంది. అదేదో మ్యాజిక్కే నిజంగా మ్యాజిక్కే అని తలపోసికుంటూ తొడు క్కుంటే ఎలావుంటుందో యని లాయర్‌గౌను నిలువునా వేసు కుంది. వేసికుంటూ నీళ్ళ నీడలో తనందం చూచుకోసాగింది. "ఓహో" అనుకుంటూ తెల్లని బాండ్సు తీసింది. ఎక్కడ అవి కట్టుకోడం? అది వెంటనే ఆమెకు పెద్ద ప్రాబ్లెమ్ అయి పోయింది. అవి ఆడవాళ్ళకు అమిరేవి కావేమో ఆ పెట్టె తనది కాదేమోయని మళ్ళీ వోమారు పెట్టిమీది పేరు గమనించింది. పెట్టిమీద "గౌనుకేసు" అనే వుంది. ఆ బాండు మంగళ సూత్రాలు గుచ్చి పట్టుకున్నట్టు పట్టుకుంది మొట్టమొదట్లో. మంగళసూత్రాలు అయితే కొంచమైనా పసుపు రాయబడివుండదా? ఇంత శుద్ధ సీమ సుద్ధలా తెల్లగా వుండిపోతాయా కావు—అని నడుముకు ఆనించుకు చూచుకుంది. నడుముచుట్టుకూ తాడు అందిందికాదు. కానైతే నడుం ఆమెది సన్నని నడుమే అయి నప్పటికీ ఎంత సన్నని నడుమైనా పీకెకంటె సన్నంగా వుంటుందా?

ఆలోచించి ఆలోచించి, నాలుగుసార్లు చెర్లో ఈదే నాలుగు చేపల్తో సంప్రతించి, ఆరుసార్లు తల్లో చెదర తిరిగే తలపుల్ని మంత్రించి, ఆఖరుకు పదకొండోసారి ఆ తెల్లని బాండుల్ని మల్లెమొగ్గలసరంగా సిగకు చుట్టుకుంది. సిగనుండి మూపుల మీద కాదేలాగు ఇటూ అటూ చూచుకుంది యతివొయ్యారంగా!

ఆ సమయాన్ని సంక్రందనమ్మ అందం ఇనుమడించిందని చెప్పక తప్పడంలేదు నా కలానికి; పాఠకుల మతానికి ఎలావున్నా!

అంతట్లో ఆమె సమీపంలోకి పోలీసు ఇన్స్పెక్టర్ జరీ జిట్టల తలపాగా, పటకాలోంచి వ్రేలాడే కత్తీ. ఆయనా, తయారై "అలా రావచ్చునండి!" యని అడిగాడు. ఆమె స్త్రీకి సహజమైన మధుర భాషణంగా "ఉండండి: కాస్సేపు! మ్యాజిక్కులో వున్నాను" అంది. ఇన్స్పెక్టర్ "మీరు మ్యాజిక్కులో లేరు. మేజస్ట్రేట్ కోర్టులో ముద్దాయీగా నిలబడ్డ దగ్గ ప్రూఫ్‌తో దొరికారు. అలాగ్గానే ఆ దిరీసుతోనే నాతో కూడా తమరు దయచేయాలి. స్త్రీలు గదా యని మర్యాదపూర్వకంగా మనవి చేస్తూ వున్నాను. ఇదే పని పురుషులు చేసివుంటే ఈపాటికి మీద చెయ్యివేసి ఎరెస్టు యని అరదండాలు తగిలించి వుందును. దయచెయ్యండి! మీమీదవున్న దుస్తులు సాయంగా మెజెస్ట్రేటుగారు చిత్తగిస్తే వేరేసాక్ష్యం సాధనం అనవసరం దయచెయ్యండి! బాగున్నారు! దయచెయ్యండి!" అన్నాడు.

సంక్రందనమ్మ నిర్ఘాంతపోయి చూస్తూవుంది తనయొక్క వినోద ప్రయాణ ప్రాంతపు పదిదెసలూ! "అలా మటి జాగు సెయ్యడానికి వీల్లేదు. దొంగ రెడ్ హెండెడ్‌గా దొరికినప్పుడు అసలే ఆలస్యం పనికిరాదు. తక్షణం రికార్డులో కెక్కాలి ఎలా వున్న దాలా! వస్తారా? రారా? రాకపోతే మీ ఫోటో తీసి కొంటూ, జవాన్లకొలుకు ఈలవేసి పకడ్‌బందీ చేయిస్తాను." అంటూ తన జేబులోంచి మిరియాల బుడుతడ్ కెమేరా పైకి తీసేడు.

సంక్రందనమ్మ కేమీ పాలుపోవడంలేదు. ఆ పోలీసు ఇన్స్పెక్టరు చర్య మరీ మ్యాజిక్కుగావుంది ఆమెకు.

"మీరిక్కడకు ఏలా వచ్చారు? ఎందుకు వచ్చారు?" అంది, సంక్రందమ్మ కొంచెం ధైర్యం తెచ్చుకుని ఇన్స్పెక్టరుతో. ఇన్స్పెక్టర్—"తప్పెక్కడుంటే అక్కడకు మేం గద్దల్లా వ్రాలి తీరతాం. ఎందుకని మమ్మల్ని అడగడానికి ఎవ్వరికీ హక్కు లేదు. దయచేయాలి, నాతో తక్షణం తమరు దయచేయాలి! తమపేరు? "నాపేరు సంక్రందనమ్మ కావలిస్తే పేరు వ్రాసుకు వెళ్ళిపోండి." "అలా పనికిరాదు. తమరిమీద ఎర్రెస్టు!" అని చేయి వేయబోయినాడు ఇన్స్పెక్టర్. "ఆఁ! ఆఁ" అని ఆమె తొలగిపోయింది కాని లేకుంటే కార్యరూపంగాకూడా ఎర్రెస్టు జరిగివుండేది. కార్యరూపంగా ఎరెస్టు జరిగివుంటే మరి రిమాండు.

నేత్రానందరావు ఆ విషమావస్థకు సరిగ్గా రంగస్థలమెక్కి "ఇన్స్పెక్టర్‌సాబ్! ఆమె నేమీ అనబోక! ఆమె నేమీ చేయబోక!" యని కూకేశాడు. ఇన్స్పెక్టర్ "మిస్టర్! కేసు పెట్టడమే మీ పనిగాని కేసు తీసివెయ్యడం మీ పనిగాదు. పొరబాటున స్యూట్‌కేసులు మారవచ్చు. కాని మీ దిరాను ఆమె ధరించడం పొసగదుగా! మెస్మెరియా లేకుంటే? మనస్సా కాకుంటే! చూడండి ఏలా ధరించుకువున్నారో మీ లాయర్ గౌను ఆమె! మీ బాండుతో ఏలా ముస్తాబైవున్నాదో!"

నేత్రానందరావు సంక్రందనమ్మకేసి చూస్తూ "ఏమండీ! ఆడవారైయుండీ యిట్లాంటి పనిచేశారు" యని అడిగేడు తన చేతిలోనున్న చర్మపు పెట్టె ఉంచుకుంటూ; సంక్రందనమ్మ

ఆ చేతి మూపులో ఆ చర్మపు పెట్టెమీద "గౌనుకేసు" యని వ్రాయబడి వుండడం గమనించింది.

వెంటనే ఎలుగెత్తింది. "లోకంలో నాదొక్కటే పేటెంటు అనుకొన్నాను. రెండు గౌనుకేసు లున్నాయా? లోకంలో రెండున్నాయీ?" అంటూ. ఇన్‌స్పెక్టరు రెండు గౌనుకేసులూ ఒకదగ్గఱకు తీసి, కొలిచి, మూతలెత్తి, చాయలు గీటురాచినట్టు విమర్శించి, "గరుగూ, నునుపూ, మెరుగూ, తళుకూ" అన్నీ తూచా తప్పకుండా సరిపోతూంటే ఆ రెండు పెట్టెల్ని కేటా యించలేక ఆమెకు క్షమార్పణ చెప్పి ఆమె మోముస నిర్దోషిత్వం కంటూ నిష్క్రమించేడు.

నేత్రానందరావు Women are always distinguished! ఆడవాళ్లెప్పుడూ జగత్తునకెరుకే. మీరుకూడా గౌనుకేసులని వ్రాసుకోవడం ఎందుకు?" అన్నాడు ఆమెతో. సక్రందనమ్మ "ఎక్స్‌కర్షన్ ఎక్సైట్‌మెంట్! ప్రయాణపుటేది!" అని జవాబుచెప్పింది.

.... .... .... .... ....

## విజయ మెవరిది

బండిగూడుకంటె ఎత్తుగా లేని—గొప్పదికాని ఒకానొక గుడిసె. ఆ గుడిసె ముంగిటి అపర కల్పవృక్షంలా లేచిపోయిన ఒకానొక తాళసాలం.

లోని పడుచుకు గుండె కుదుపుకూడా లేనంత నిశ్శబ్దం గుడిసెలో—ఈవల ఏటంబాంబు లూరికే పడుతూవున్నంత విప్లవ సూచనగా తభీతభీమని తాళఫల పతనం.

ఆ పల్లెలో వి. జె. ఉత్సవాలు నాడు జరుగుతూవున్నాయి. ఊరేగింపులో పాడుతూన్నారు ప్రజలు.

" మనరాజు నెగ్గాడు - మనకు భయమేల ?
మిత్రమండలివాండ్లు - మేటి విలుకాండ్లు "

అని పాడుతూ ఆడుతూ యున్నారు. ఒక ఫాదరీదొర ఆ గుంపుమధ్య నించోని " హిప్, హిప్ హుర్రా " యని హెచ్చరిస్తూ వున్నాడు.

చెంగలమ్మ గుడిసెముందుగా రహదారీనే వెడుతూవుంది వూరేగింపు, చెంగలమ్మ గుడిసెఅంటే పైనవివరించిన గుడిసె. ఆ గుడిసెలోని పడుచుపేరు చెంగలమ్మ.

మనరాజు నెగ్గాడ ? - నామగడు నెగ్గాడ ?

అన్నట్లు ప్రశ్నార్థకంగా నిలుచుంది తలుపోరగా తీసుకు వూరేగింపు చూస్తూ—" నీ మగడు నెగ్గితే నీ యింటికి తిరిగి జయజయ ధ్వానాల్తో నీ మగడు యీ పాటికి తిరిగిరాడూ ? " అనేది ఆమె ప్రశ్నకు జవాబై ఆమెకళ్ళల్లోకి నీళ్లుదించింది ; ఊరేగింపు ఆ గుమ్మం గడచి పోవడంలో వీధి ఆమెకు సర్వ శూన్యంగా కనబడింది. చెంగలమ్మకు—వీధేకాదు విశాల విశ్వ మంతా విఱిచి పొయిలో పెట్టునట్టు అయిపోయింది.

చెంగలమ్మ ముంగిట్లోకి వచ్చి నిలుచుంది ఎవరికోసమో అన్నట్లు. " ధరకల్వాటుండు " అనే పద్యంలోలాగు ఒక తాటి పండు ఆమె నెత్తిమీద పడింది. " తచ్ఛిరమున్ తత్ఫల పాత వేగమున వచ్చెన్ శబ్దయుక్తముగా. "

చెంగలమ్మ ఆ అపదకోపలేక నేలకొఱిగేటంతలో ఒక యోధుడు వుజయోద్ధతి జోళ్ళ చప్పుడుచేసికొంటూ వచ్చి వచ్చి

చెంగలమ్మ నేలకు, తల పగిలి పడిపోవడంలో ఆమెను పట్టు కున్నవాడై తనమొడిలో పెట్టుకుని తనసంచిలోని నీళ్లు ఆమె ముఖాన క్రొడుతూ రిచ్చపోసాగాడు. రిచ్చపాటులో నా ప్రేమకు పరమావధి ఇదియేనా ? నా విజయానికి తుదిఫలితమిదేనా ? బ్రతుకవూ ? చెంగలమ్మ ! బ్రతిమలాడినట్టి ఆమె గెడ్డం పట్టుకు ముఖము కనుగోసాగాడు.

చెంగలమ్మ అలాతన కనుదోయి తెరచి "వచ్చేవా ? నీదేనా విజయం ?" యని అడిగింది కడాపటి యుసురు విడుస్తూ !

యోధుడు మనదే—నాదే అంటూ తన మొలనున్న బాకుతో రొమ్మున గుచ్చుకు రుధిరమార్గాన్నే వైకుంఠ సదనము చూరగొన్నాడు.

గుడిసె ముంగిట తాళఫల పతన మెప్పటివలెనే తఫీ తఫీ మని విప్లవపు ప్రేలుడు గుండుల్లా ధ్వనిచేస్తూనేయుంది కాని గుడిసెపైన నరమానవుల గుండెలు రెండు మాత్రం తిరిగి ధ్వనించలేదు.

.... .... .... .... ....

# కవిత్వా వ్యుత్పత్తి డు

సర్వసాధారణంగా తల్లులులేని పిల్లలు, మేనత్తలదగ్గతో మేన మామ దగ్గతో పెరుగుతూ ఉంటారు. అలాపెరిగే వాళ్ళలో వొకడు "విశ్వంభరుడు."

విశ్వంభరున కన్నీపోగుచేస్తే ఆరేళ్లు. కాని ఆరోనెల్లోనే "అత్తమాంవ" అనడం వచ్చింది. "ఉంగ" తోటే ఊసులాడ్డం

అలవడింది ఆ పిల్లాడికి. మఱి ఆరోఏట కవిత్వం కట్టాడూ అంటే ఆశ్చర్యం ఏముంది ?

ఓనాడు వాని మేనత్త మీనాక్షమ్మ, మంచి బాగా తోడెట్టిన గడ్డపెరుగు, గేదెపెరుగు, కోసివేసినట్టు, గరిటెతోతీసి వేస్తూవుంది. వీడికి చూడొస్తే అయిదోఏడు. ఆమెకు చూడొస్తే పెళ్ళి అయింది. అప్పుడే ఆయేడే అత్తింటికి కాపరానికొస్తూ తల్లి లేని పిల్లడు కదా యని కూడా ఈ విశ్వంభరాన్ని వెంటబెట్టు కొచ్చింది. వచ్చినప్పటినుంచి అతిగారాబంగా పెంచుతూ వుండేది. మీగడ పెరుగోనాడు, గడ్డపెరుగోనాడు, తియ్యటి పెరుగోనాడు, కమ్మటి పెరుగోనాడు ఈలా పోస్తూ !

మనం అనుకునేనాడు, అంటేవోనాడు, తనకు మేనత్త గడ్డపెరుగు పోసేటప్పుడు యప్పటి కారేళ్లూ వచ్చాయేమో ; మేనత్త కళ్ళల్లోకంటా చూస్తూ పోస్తె

" అత్త గడ్డపెరుగు - అంతులేని ఆకలి : "

అంటూ ఇంకా పొయ్యమన్నాడు. " ఓరి భడవా ! కవిత్వం కడుతున్నావా నామీద " యని పెరుగు కంచంనిండాపోస్తు ప్రశ్నించింది ఇలా.

" మామ పెరుగుబుడ్డీ మోస్తె ? " యని విశ్వంభరుడు తడుముకోకుండా వెంటనే,

" గొప్పగూని చాకలి " యని సమస్య పూరించినట్టు పదం పూర్తిచేశాడు.

వెంటనే ఆ మేనత్త ఆ మేనల్లుని రెండు బుగ్గలూ, నాని మూతిని పెరుగు తుడువకుండానే ముద్దెట్టుకుంటూ,

" రాధవంటి మేనత్త లోకంలో లేదోయీ !
చిన్నికృష్ణుపోలికన్ను గీటు మగుని లేదోయీ "

అంటూ విశాలతర ప్రేమ భరితఅయి మూర్కొంది మూర్ధం.

"అయితే నీ పేరు ?"

"నా పేరు మీనాక్షి"

"నా పేరు ?" "నీ పేరు విశ్వంభరుడు"

"మఱి మామ పేరు ?" ఆయన్నే అడుగు వస్తున్నారు.

అంతలో మీనాక్షి భర్త పొలంలోంచి ఇంటికి వస్తూ—
"ఏమిటా ముద్దు పెట్టుకోవడం కుఱ్ఱవెధవని ? యని అన్నాడు యత్కించిత్ అసూయతతో—విశ్వంభరుడు వెంటనే, మఱో యభిప్రాయం వానిలో ఉంటేగా ; పొలంవేషంలో ఉన్న మామ మీద కవిత్వం కట్టిపారేశాడు.

"ఫఫఫ ఛాఛాఛా - వలప పెద్దు వొంగుంది,
అడి అడి అడి టిరి టిరి టిరి - దాపపెద్దు కుంగింది."

అని.

"వాడికి మఱి పెరుగు పొయ్యొద్దు" అని మామకు కోపంవచ్చి ఆర్డర్ వేశాడు. మామ కోపం విశ్వంభరుడు లెక్క చేయకుండా.

"స స స రి రి రి గ గ గ మ మ మ
ప ప ప ద ద ద ని ని ని స స స"

అని స్వరం వేశాడు. మామకు కోపంపోయి నవ్వు వచ్చింది.

మగని నవ్వుకు హెచ్చరిల్లి మీనాక్షి

"వరస వావి లేనప్పుడె - వయ్యారం పెరిగింది ;
'పెరుగుబుడ్డి' ముదిమామిడి - కంచె మీది కొరిగింది."

అని నాట్యమాడ నారంభించింది. ఆమె నాట్యంతో అల్లుడు గిర్రున తిరుగుతూ

"స స స ని ని ని ద ద ద ప ప ప
మ మ మ గ గ గ రి రి రి స స స"

అని పాడాడు కూడాను.

మాఁవ మఱి చేసేదిలేక

"సంగీతం పొంగింది - సంసారం తొంగుంది"

అన్నాడు.

అంతేకాదు మాఁవయ్యా ఇంకావుంది అంటూ విశ్వం భరుడు

"అత్తకంటె బాగుంది - మాఁవ మొదటి బోగంది"

అని చంకలు కొట్టుకొన్నాడు.

భార్యా భర్త లిద్దఱూ "ఈ కుంకకే కవిత్వం కట్టడం ఎక్కణ్ణించి వచ్చిందా" అని ఆశ్చర్య పోసాగారు. ఇద్దఱూ కలిసి చిరంజీవి విశ్వంభరుని ఇంటికప్పు అందుకునేలా, పైకెత్తేశారు.

విశ్వంభరుని ఆనందానికి మఱి మేరలేక పోయింది.

అత్త గడ్డపెరుగు పోస్తె అంతులేని ఆకలి,
మాఁవ పెరుగుబుడ్డి మోస్తె గొప్పగూని చాకలి
రాధమించిన మేనత్త లోకంలో లేదోయీ
చిన్ని కృష్ణు పోలికన్న గీటు సుగుని లేదోయి!
ఫ ఫ ఫ ఛా ఛా ఛా వలపపెద్దు వొంగుంది,
అడి అడి అడి టిరి టిరి టిరి దాపపెద్దు కుంగుంది
స స స రి రి రి గ గ గ మ మ మ
ద ద ద ప ప ప ని ని ని స స స
వరస వావిలేనపుడే వయ్యారం పెరిగింది,
పెరుగుబుడ్డి ముదిమామిడి కంచెమీది కొరిగింది

స స స ని ని ని ప స స ని ని ని
ప స స ద ద ద మ మ మ గ గ గ
రి రి రి స స స
సంగీతం పొంగింది సంసారం క్రుంగుంది
అత్తకంటె బాగుంది మాచవ మొదటి బోగంది. ”

.... .... .... .... ....

## మగాడే చూశాడనడమేమిటి ?

కథ వ్రాయకుండా కథకు పేరెట్టడం ఆ పేరెట్టిన వాక్యం మిక్కిలి విసురుగా యుండడంచూస్తే దానికి పూర్వమేదో సంగతి జరిగివుండాలి. ఆ విసురంతటితో ఆగకుండా ఇంకా ఏదో కసరులోకి మాటివుండాలి.

మనకు మన పూర్వజన్మంలో జరిగిన సంగతులు ఏమాత్రం జ్ఞాపకమో ఆ మాత్రమే జ్ఞాపకం, ఈ జన్మలో జరిగినప్పటికి కొన్ని సంగతులు కాంతారావుకు, కాని తరువాతి కసరు మాత్రం కాంతారావుని దారిపొడుగుతా విడిచిపెట్టలే. “ ఆడ వాళ్ళకుమాత్రం కళ్లులేవు ? వాళ్ళకుమాత్రం చూపులు లేవు ? వాళ్ళకుమాత్రం సహజంగా కొత్తో వింతగాచూడాలని వుండదూ? వాళ్ళకుమాత్రం ఆశ్చర్యభావం యనే యొకానొక భావంలేదూ ? వాళ్ళకుమాత్రం తెలిసికొందాం ఎవరా ఏమా అనే యొకానొక మహదాశయం ఎదకూపంలోంచి పైకుబికిరాదూ ? ” యని అట్టహాసంగా వీధంట నడుస్తూనే తోడి విద్యార్థితో హుషారీగా అనేస్తున్నాడు.

తోడివిద్యార్ధి అదో గమ్మత్తుమనిషి. అతడంటాడు "మగాడు చూసినప్పుడు చూశాడూఅంటే వానికంత కార్పణ్యం అనవసరం. ఎదరవాళ్లు చెడ్డపనిచేస్తే మనమూ చెయ్యాలా ? కాని ఒక్కొక్కప్పుడు మగాడూచూడడు. ఆడదీచూడదు. ఇద్దఱూచూడకుండా అంత చూసుకోకుండా మీదపడతావేం ? నీకేంవచ్చింది పొయ్యికాలం" యంటే అంత చూసుకోకుండా మీదపడతావేం ? నీకేంవచ్చింది పొయ్యికాలం" యనేటప్పటికి చూపులుమాట ఏమిటంటావు ?" అన్నాడు.

కాంతారావు ఆపాళంగా బ్రహ్మాండమైన దివ్యజ్యోతి ఏదో తన కళ్ళమ్మట పళ్ళమ్మటకూడా వెల్లివిరిసినట్లు పాలి చూచి పక్కుననవ్వి "ఏలాతిప్పి తీసుకువచ్చినా Sex అనేది ఒకటివుందిచూడు. అది ఇప్పుడు పాతకొత్త Complexity ల్లో పడిపోయి అయ్యా అంటే "అమ్మా !" "పొయ్యికాలం" అంటే "పొయ్యికాలం" ఇలా మాటకు మాట తెగుల్లా విజృంభించేస్తూవుంది. కొంచెం Politeness ఉన్నవాళ్లు అయితే ఎప్పుడూ ఆడదీ మగాడూ "నీ పొయ్యికాలం" నీ పొయ్యికాలం" యని వాదులాడుకోరు" అన్నాడు కాంతారావు.

"ఇద్దరూ అందమైనవాళ్లై వయస్సులోవుండి ఉంటే Polite గానే ఉంటార్రా ? ఎప్పుడూను" అన్నాడు తోడివిద్యార్థి. "ఏదో స్వానుభవం నాకేసి పారేస్తున్నావు" అన్నాడు కాంతారావు. తోడివిద్యార్ధి యదోవిలాసవాలా అంటాడూ "కాంతారావు! నీమాట కాదనడమెందుకు City లో స్వానుభవానికి Chances అపరిమితం అందులోనూ Crooked lanes అమ్మట Crooked minds వాళ్ళు పోతూవుంటే గోడపక్కనే చటక్కున మలుపు

తిరుగుతూ ఉంటారు. ఆ మలుపుకాడే తటస్థిస్తుంది తెలీకుండా ఓ మహిళ. ఏమిటిచేస్తాడు ? " Please excuse మీ " అనాలిసి వస్తుందిచూడు ! " అన్నాడు.

" రైతో ! నా Point నీవు Catch చేసినావు అన్నమాటే" అన్నాడు కాంతారావు. " కాని నీ చూపులు నాకురావురా ? కాంతారావు ! నీవు ప్రతీ ఆడదానికేసి అదేచూపు అదేయిది. It's detrimental to society. It's poison to yourself " ఏమనుకున్నావో " అన్నాడు తోడిస్నేహితుడు. "How ? as others see we see " అన్నాడు కాంతారావు. " There must be some sort of a brake " అన్నాడు స్నేహితుడు.

" లేదుమతీ ? భగవంతుడు ఇచ్చిన తెప్పపాట్లు ఏమిటను కొంటున్నావు. అవే Brakes. " అన్నాడు కాంతారావు. " కాని నీ చూపులకా Brakeలు ఉన్నట్టు కూడా లేదు " అన్నాడు స్నేహితుడు. " అయితే నేను దేవలోకపువాణ్ణి అన్నమాటే నీ యూహలో " అన్నాడు కాంతారావు ! " దేవతలేం ? మనుష్యులకంటె మహాఎక్కువ యనుకుంటున్నావా ? " అన్నాడు తోడివిద్యార్థి. " నా యూహలో వాళ్లు ఈ విధంగా ఎక్కువవాళ్ళు యని అనుకుంటున్నాను. వాళ్లు ఊరికే ఎడతెగ కుండా చూస్తువుంటే వాళ్ళను రంభ ఊర్వశి ఇత్యాదులువున్నారే వాళ్ళు ఊరికే ఎడతెగకుండా చూస్తువుంటారు. అని యనుకుం టాను. ఆ ఎడతెగకుండా Opposite Sex చేత చూడబడ్డం అనేది దేవాంశసంభూతులకే గాని మానవులకు లేదుచూడు. " అన్నాడు కాంతారావు.

" కాని వాళ్లుచావరు, మనం చచ్చిపోతాం " అన్నాడు స్నేహితుడు. " మనం చచ్చిపోవడమేమిటి మనం అలా అంద

మైనవాళ్ళచేత అంటే రంభ, ఊర్వశి, ఇత్యాదులుచేత అనగా అటువంటి వాళ్ళచేత ఎడతెగకుండా చూడబడితిమా Murder" అన్నాడు కాంతారావు.

తోడివిద్యార్థి అన్నాడు. "నీవు Murder అంటే జ్ఞాపకం వచ్చింది. Behind every murder there will be a woman." కాంతారావు "Amend! before every murder! అలా చూస్తూ ఉంటుంది. ఇలా చస్తూ ఉంటాను. మగాదేచూశాడనడమేమిటి?" అని పూర్వపు సంగతి స్ఫురణకువచ్చి అగ్గి అయిపొయ్యేడు. మనకెందు కావెధవగొడవ.

.... .... .... .... ....

## 'రొ మా న్సు' పె ళ్ళి!

మెడికల్‌కాలేజీ చమక్. టిప్‌టోగా యువకులు యువతులుకూడి కళాశాలా విద్యాభ్యాసం చేయడం, ఎక్సుఛేంజి అఫ్ ప్యాన్ వూయింగ్స్,—అందులో ఎప్పుడైనా ఓ సాయంకాలం ఓపడుచు ఓ యీడూ జోడూ సహాధ్యాయుణ్ణి టీకి తనగదికి పిలవడం, లేకపోతే ఏక్సిడెంటల్‌గా షాపింగు ఆ సందర్భంలో "హల్లో" యని రికగ్నైజు చేసుకొంటూ తమకు తెలియకుండా యెవరి గదిలోకో వాకరిగదిలోకి చేరుకోవడం,—

అట్టిమాదిరి చనువూ మనువూ కలిసివచ్చే సమాగమం గలవారై ఓముని మాపువేళ ఎలెక్ట్రిక్ దీపాలముందు, చిన్న మేజాబల్లమీద స్టైతస్కోపులు రెండుపడి మొత్తలుకొట్టుకొంటూ వుంటే గమనించకుండా, వసారాషెడ్డులో రెండు పేపకుర్చీల

మీద కూర్చుని, కుమారి మధురమాణిక్యం, కుమార విధు శీతలుడు మాట్లాడుకుంటూ వున్నారు.

లోలోపలి యూహాలేవో అణచుకొని ప్రసంగించుకొందామని వారి సంకల్పం : అణచుకుందామని అనుకొన్నకొద్దీ కంగు కంగు కంఠధ్వనులు అవకాశం అంతా ఆవరించుకు పోవడం ఫలితం.

మధురమాణిక్యం : మనపెళ్ళి ఎంత అనుకోనిదిగా, ఎంత—expression తోచకుండావుంది—ఎంతమైమఅపు గాలిపేదిగా—అదే romantic గా ఉండాలీ యంటే—దుష్యంతుడూ శకుంతలా పెళ్ళిలాగుండాలి.

విధుశీతలుడు : నీకలాంటిపెళ్ళి యిష్టమే ?

మధుర : ఏం ? అందులో తప్పేముంది ? గాంధర్వ వివాహం !

విధుశీ : నీవో ఆశ్రమంలోయుండడం, నీళ్లుమోయడం, అక్కడకు నేను వేటాడ్డానికి రావడం, నీవు ముళ్ళతీగ త్రొక్కకోవడం—అదంతా నీ కిష్టమే ?

మధుర : అదెప్పుడూ నాకిష్టంలేదు. మొక్కలకు నీళ్ళు పోయమనేదానంత పాడుపని అదేకాని మతొక్కటిలేదు. మటీన్నీ వేటనుమించే హింసలేదు. అందుమీద ముళ్ళతీగ పెనచుకొని అడుగువేయడం యనే దానంత ఆపత్తు వేతొకటియుండబోదు—మా కిల్లులేదోయి ? క్రిందటి సెలవులుకి చూచేయుంటావు. బ్రహ్మాండమయిన mansion. చుట్టూ తోట, యెక్కడచూచినా కుళాయిలు, ఓ మాత్రపు ప్రహరీగోడ !—గోడపక్క లోతట్టుగా గులాబిరేకులు వెదజల్లేస్తాను ఒత్తుగా. ఓ వెన్నెలరాత్రి నీవు

హుషారీగా ఈలేసుకొంటూ హర్డిల్సు గెంతినట్టు ఆ గోడ గెంతి సరిగ్గా నా భుజపంజరంలో ఉండొచ్చు. మనమేం ఎఱగని వాళ్ళమా యీ వఱకు ? దుష్యంతుడికీ శకుంతలకీ ఉన్నంత సిగ్గు అక్కఱలేదోయి. తిన్నగా వచ్చెయి.

విధుశీ : నన్ను పట్టుకోగలవో పట్టుకోలేవో ?

మధుర : అందుకేగా గులాబిరేకులు వెదజల్లేది.

విధుశీ : ఫస్టు ఎయిడ్ అవసరంలేని గాంధర్వం కావా లన్నమాట.

మధుర : (సన్నగా) ఊఀ.

విధుశీ : ఘట్టిగా ఊఀ అనడంలేదు. మళ్ళీ ఆలో చిస్తున్నావు ?

మధుర : శకుంతలా దుష్యంతుల మోస్తరిపెళ్ళి అంటే ఓచిక్కు కనిపిస్తోందోయి. వాళ్ళకోపిల్లా డుట్టాడనుకొంటాను.

విధుశీ : వాణ్ణి వెంటవేసుకుపోతేనే తనింటికి రావద్ద న్నాడు మొగుడు.

మధుర : కాబట్టి నీవు గోడదాటి వచ్చేముందే కొన్ని కొన్ని పరికరాలతోటికూడా రావాలి.

విధుశీ : You mean contraceptives ?

మధుర : కాదుమఱీ ! దుష్యంతుడు బాణాలు గీణాలు వేసికొని వెళ్ళకుండా, సంతాన నిరోధ సాధనసామగ్రి వేసుకు పోయివుంటే శకుంతలకి పిల్లడుపుట్టక పోయియుండేది. ఆ trouble యంతా అందునించి వచ్చిందని నా నమ్మకం.

విధుశీ : నిజమే. పెద్ద రొమాంటిక్ లేడీ శకుంతల యని అంటారు. అయినప్పటికి రొమాన్సు యంతా మఱచిపోయి, పిల్ల

పుడితే, ఆ పిల్ల మగపిల్లడైతే, మగపిల్లడికి రాజ్యం, మళ్ళీ ఎవ్వళ్ళతోనూ పంచుకోనటువంటి రాజ్యం కావాలనడం, ఈ prosaic notions ఆ సమయంలో శకుంతలకి కలిగాయీ యంటే నాకు నమ్మశక్యంగాలేదు సుమా! శకుంతలది romantic love కాకపోయి యుండాలి. లేదా కాళిదాసు రసాభాసం చేసి ఉండాలి.—వింటున్నావా నన్ను ?

మధుర : వినకేంగాని—ఈ డిస్కషన్ యిప్పుడే పెళ్ళి రొమాన్సును చాలామట్టుకు పాడుచేసిందోయి. దుష్యంతుడీ శకుంతలాకంటె better instance లేదు మఱోటి ?

విధుశీ : Thousands and tens of thousands! వేలు లక్షలు : For instance take that fellow ప్రవర.

మధుర : You mean మాయాప్రవర ?

విధుశీ : వాడే! యువకుల కభిమానమిత్రుడు !

మధుర : అప్పుడు నీకు counterfeit- శరీరమంతా నీలాగుండి, మనస్సుమాత్రం నీ మనస్సులాంటిది కానివాడు మఱొకడుండొద్దూ ?

విధుశీ : నేనే ఓమాటు వద్దని, ఓమాటు నేనే కద్దంటే సరిపోదూ ?

మధుర : అసలు వాళ్ళది పెళ్లేకాదేమో ?

విధుశీ : But romance of the highest order అనుకుంటా,

మధుర : Romance of the highest ఆర్డరే చాలదు. పెళ్ళి కూడా కావాలి.

విధుశీ : ఉషాకన్యనుగుఱించి యోజించుపోనీ.

మధుర : ఆ కన్యను తల్చుకొన్నప్పుడల్లా నాకు దోమ తెర, పందిరిపట్టిమంచం, గలీబుపరుపు, లోడ్డు, అత్తరుదాన్,

పన్నీరుబుడ్డి, ప్రియుణ్ణి అక్కడకు పిలిపించుకోవడం—మొద్దు గర్భాదానంలాగూరుకుంటుంది ఎంచేతో ?

విధుశీ : కాని తరువాత మహాయుద్ధం అయింది. అనిరుద్ధుడు గొప్పవీరు డనిపించుకున్నాడు. ఉషాకన్య యందఱి హృదయకుహరాల్లోనూ వెలిసిపోయింది.

మధుర : ఉషాకన్యతండ్రి రాక్షసు డనుకుంటాను. దైత్యునికూతురికి రొమాన్సు ఏమిటి ?

విధుశీ : మీతండ్రి మంచివాడేగా ?

మధుర : అదే ఆలోచిస్తున్నాను. ఈ మనపెళ్ళికి ఒప్పుకొంటాడో వప్పుకోడో ?

విధుశీ : అయితే ఓపనిచేదాం.

మధుర : ఏమిటది ?

విధుశీ : నేనో మందుత్రాగే రోగిగా ఉంటాను. నీవు నాకు వైద్యంచేసే దానివిగావుండు.

మధుర : నేనే రోగిగాయుంటాను. నీవే నాకు డాక్టరివిగావుండు.

విధుశీ : ఎందుచేత ?

మధుర : నీవు రోగివికావడం నాకు ఇష్టంలేదు.

విధుశీ : నీవు రోగివికావడం నాకు అంతకన్నా ఇష్టం లేదు.

మధుర : Alas ! నిత్యజీవనాన్ని విడిచిపెట్టి రొమాన్సు ఆలోచించడానికే పోసిబిలిటీ లేదనుకుంటానోయి ! విధుశీతలా !

విధుశీ : అంటే ?

మధుర : రొమాన్సుకు ముందో వెనకో రోగం, రొచ్చు, పిల్లామేకా, ఇల్లూవాకిలీ, ఇదంతా ఉండితీరుతుందేమోనని భయమేస్తోందోయి ! నాకు.

విధుశీ : Soul force వుంటే అల్లాంటి భయమే వుండదు.

మధుర : అదెలాంటిదో ?

విధుశీ : Soul ! నీ వెప్పుడూ జీవాత్మనుగుఱించి థింక్ చేయలేదన్నమాట.

మధుర : Think ఏం ? తపస్సేచేశాను.

విధుశీ : అయితే చెప్పు దాని romance.

మధుర : సావిత్రికథలే ? సావిత్రి, సత్యవంతుడు, యముడు, దున్నపోతు.

విధుశీ : తిరిగి పురాణగాథల్లోకి పోతున్నావు. rigmarole !

మధుర : మఱి నేను చనిపోతేనేగాని realistic present-day నా Soul యొక్క romance నాకు తెలియదాయె ?

విధుశీ : నీవు చనిపోవడమే ? చనిపోవడమే ?—— పాపము శమించుగాక-హతోస్మి హతోస్మి- [అని మూర్ఛిల్లును]

మధుర : (గుండెరొాద కొాలగొట్టంతెచ్చి, పెట్టి, వింటూ) హా ! హా ! హా ! విధుశీతలా ! విధుశీతలా ! పలుకవేం ! హతవిధీ ! ఎంతపని చేసితివి ? విధుశీతలా ! పలుకరించినా పలుకవేం? నేను జీవించియున్నాను. నేను ప్రాణముతో నున్నాను. ఇటు చూడు. లేలే. నాకు భయమువేయుచున్నది !

విధుశీ : (కళ్లుతెఱచి) ఎందుకు భయం ?

మధుర : ఎంచేతనోబాబూ ! నన్నొక్కసారి బిగియారకావలించుకో ! నన్నొక్కసారి తనివార ముద్దుపెట్టుకో ! నన్నువెంటనే పెళ్లాడు.

విధుశీ : ( మొదటి రెండూచేసి ) పెళ్ళాడ్డానికీరొమ్మాన్ను చాలునా ?

మధుర : ఎక్కువ ! ఈమాటు నిజంగా మృత్యుదేవత వచ్చినా జయించి పాఱవెయ్యగలనన్న మాట.

విధుశీ : తథాస్తు.

.... .... .... .... ....

## సిగరెట్ పడిపోయింది !

బెజవాడ వద్దకు బి(ట్రగుంటనుంచి వచ్చే ప్యాసింజరు వచ్చి ఒకగంట ఆగుతుంది. కాని జనం ఆ బండివచ్చి వేళకాక గంట ముందుగాను వస్తారు. ఒకగంట అయ్యాక వస్తారు. అంతచేటు " ఇర్రెగ్యులర్ " అది సర్వసాధారణంగా అన్నిరైళ్లు అంతే అనుకోండి ! వాటియొక్క నడక శీతోష్ణస్థితిని మారేటట్లు కన బడుతుంది, రైల్వేగైడ్‌లో ఏ టైము ఇచ్చినా ?

అందరలోనూ ముందుగా వస్తారు రెండవ తరగతి గాడీ ఎక్కేవాళ్ళు ! ఎంచేతా అంటే ఆ తరగతి బండి ఒకటే తగిలిస్తారు ఆ ప్రయాణికి. అందులోనే ఇరుక్కు ఇరుక్కు కూర్చోవాలి ! అందువల్ల ప్రయాణీకులు గంట గంటన్నరముందుగానే వచ్చి ఆలా బండిలో పరుపులబల్ల అంతా వ్యాపించుకొని మరొకళ్ళు ఎక్కకుండా తామే కూర్చుంటారు. సాగనంపడానికి వచ్చిన వాళ్ళుకూడా చివరకంట ఆ బల్లమీద ప్రయాణీకుల్లా కూర్చుండి కూర్చుండి చివరకుగాని దిగరు. ఇది నిత్యము చూచే సంఘటనే కాని ఆ ప్రొద్దుగన్నాది మరీ విడ్డూరమైంది ! ఎందుకు చదువు తారుగా పాఠకులు నేనడం ఎందుకు విడ్డూరమని ?

ఒక్కొక్క విషయం ఒక్కొక్కనాడు జ్ఞాపకం వస్తుంది. ఈ నే వ్రాయబోయే సందర్భం ఒకానొక నాగులచవితినాడు జరిగింది. మళ్ళీ నాకు జ్ఞాపకం వచ్చింది నాగులచవితినాడే. నాగులచవితి తెనుగువాళ్ళకు బహుపవిత్రమైన పర్వదినం. ఆరోజు చరిత్రాత్మకంగా "నాగుల" చరిత్ర ఉద్ఘోషిస్తుంది. మరిన్ని హిందూమత సిద్ధాంతంగా మన కపకారం చేసేవాళ్ళకుక్కూడా ఉపకారం చేయాలి కనుక పాములకు పాలుపోస్తారు. ఇంకా ఏమైనా ఉండవచ్చు కారణాలు. అందుకే ఆరోజు ఆడవాళ్ళకు బహుప్రీతి. ఆడవాళ్ళతోబాటు పిల్లలకు, పిల్లలతోబాటు పెద్దలకు అందరకూ ఇష్టమైనరోజు అనే చెప్పాలి. ప్రసాదం, చిమ్మిలి, చలిమిడి, అరటిపళ్ళు ఇత్యాదులు మిక్కిలి తియ్యగా ఉండేవి అయియుంటాయి. మరిస్వేచ్ఛేగా పొలాలంట ఊరిబయటకు వెళ్ళి పాము బొరియలు కనిపెట్టి మరీపోస్తారు, పాలు పాముల్లేకుండా చూచి; పాముంటే అమ్మయ్యో మరిబుస్సే!

దిబ్బు దిబ్బు దీపావళి అమావాస్య
మళ్ళీ వచ్చేది నాగుల చవితి."

అని కుఱ్ఱవాళ్ళు దీపావళినాడే ఈ పర్వదినానికూడా కొన్ని టపాకాయలు, మతాబులు కేటాయించి యుంచుకుంటారేమో ఆ రోజున పట్టపగలే అవన్నీ వినోదవంతంగా కాలుస్తారు.

అయితే, నాగులచవితి అన్నరోజు చవితి కావడంచేత ప్రయాణానికి మంచిరోజా అనే మీమాంసలో పడ్డారు ఇంటిల్లపాదీని "సుఫాలరావు" ఇంట్లో; ఉపవాసాలుండే వాళ్ళుంటున్నారు. ఫలహారాలు చేసేవాళ్లు చేస్తున్నారు. భోజనాలు కావించేవాళ్లు కానిస్తువున్నారు. గడియారంకేసి తిథివార నక్షత్రాలు తెలిపే కేలండరుకేసి ముసలమ్మలకేసి చూసేవాళ్లు చూస్తున్నారు.

అప్పుడు వారందరిలోనా ముసిలావిడ పణుక్కుంటూ వచ్చి, రేపు "సుఫాలరావు" "జాయిన్" అవవలసిన రోజు అనుకుంటాను. ఇవన్నీ చూస్తే ఉద్యోగాలుంటాయటర్రా! నిర్ణయం నిన్నే పెట్టించాను కోడలిచేత. కోడల్ని పిల్లల్ని వాణ్ణి మరి ఆపక ఈ ప్రయాణానికి పంపించండి. నేనున్నూ "కారు" మీద రైలుదాకా వెళ్ళి వాళ్ళను సాగనంపి వస్తాను. అంది పాపమ్మ. పాపమ్మ అంటే పైని వివరించిన ముసిలావిడే! పాపమ్మ ఈ మాట ఎప్పుడంటుందా అని కూర్చుంది కోడలు. భార్య అడ్డుచెప్పక పోవడమెప్పుడా అని వున్నాడు సుఫాలరావు. మరి సుఫాలరావు సుఫాలరావు కుటుంబం. ఈ పాపమ్మ అనే ముసిలి తల్లి, కలగట్టుకు పడ్డట్టు వెంటనే "కారుతో" పడి స్టేషనుకు చేరుకు రైలందుకు రైల్లోసలక్షణంగా ఆసీనులయ్యారు.

ముసిలావిడ వితంతువు. ఏ రష్యాలోనో వుంటే నూట ఇరవై యేళ్ళక్రితపు ఆవిడలని ఛాయాపటము తీసివుందురు. మనదేశంలో ఆ పద్ధతిలేదు. ఆవిడ తీయించుకోను తీయించుకోదు. ఆవిడ తీయించుకొన్నదల్లా తలమీద జుట్టు. ఆ జుట్టే కనుక వుండివుంటే తెల్లని ముగ్గుబుట్ట అని అనుకోవాలి. లేని దాన్ని గురించి వర్ణించి ప్రయోజనంలేదు. కాని ఆవిడ వర్చస్సు చూస్తే అపురూపము. ముదుసలివడ్డా శరీరపటుత్వం చెడలేదు. ఆవేళ నాగులచవితి కావడంచేత ఉపోష్యమేమో కూడాను! అయినా రావడం మానలేదు. ఆమె చరిత్ర కొంతచెబితే ప్రస్తుత తరం వారికి వింతే! అసలు ఆవిడ ధరించిన పంచే సన్నని ఎఱ్ఱంచు పట్టుపంచె. అదే చెబుతుంది నిరంతరం మడిగట్టుకు ఆవిడ వుంటుందని. మరిన్ని అగ్రవర్ణంలో జన్మించిన

కులాభిమానం కులగౌరవం ఆవిడను విడిచిపెట్టలేదు. ఆవిడకు పవిటవేసుకునే ఈడునే పెళ్ళయింది. పెళ్ళయిన సంవత్సరమే ఆమె పెద్దమనిషి అయింది. పెద్దమనిషి అయిన సంవత్సరమే కార్యం అయింది. కార్యం అయిన ఒక ఏడాదినుంచి ఏటేటా కానుపే. ఆవిడ ఈ కథాకాలానికి ఏ అరవై యేళ్ళ క్రితమో ఒక ముప్ఫైమందినయినా కని వుంటుంది అని నా తాత్పర్యము. పెళ్ళికెన్నో బంగారపు వస్తువులు, వెండివస్తువులు పాతరకానివి పెట్టుకుందిటకాని రానురాను మగడు ఈస్టు ఇండియా కంపెనీ పనిలో దుబాష్ అయిన తరువాత అవన్నీ చాలవరకు చెరిపించి, మార్పించి వజ్రాల తమ్మెట్లు, ముక్కుపుడకలు అవీ పెట్టుకోసాగిందిట ! తరువాత తరువాత వితంతువు అయినాక పైవన్నీ మానేసి, బిగువుసళ్ళిన వేషం ధరిస్తూ ఒక బంగారపు గొలుసు మెళ్లో మెలవేసేటట్టు వేసికొన్నది. మరీన్నీ మగడు కార్యానికే రాత్రో గదిలో పెట్టి, ఆవిడకు తెలియకుండా తొడిగిన ఒక పొళ్ళఉంగరం కూడా వేలినే ఉంచుకొన్నది. ఇదంతా వ్రాయడంలో నా సబబేమి అని పాఠకులడిగేరేమో ? కారణం తెలియజెప్పడానికే. ఆమె అంతచేటు ముసిలివ్యక్తి అయినా జీవితవాంఛ వాసన ఇంకా వదల్లేదనడానికే ? విన్నారా ?

ఒకటేసొద కోడలితోనూ, కొడుకుతోను, కూడా మరి వెళుతూవున్న మనుమలతోను, మనుమరాళ్ళతోను, అసలు సుఫాలరావును మరెవరూ అడగడానికి వీల్లేకపోయింది. "తమకు ఏవూరు అండీ బదిలీ అవుతా ?" అని.

సుఫాలరావు పాపమ్మకెన్నో కొడుకో గాని, మంచి "టిప్‌టో" గా స్యూటువేసి టైగియ్ తగిలించుకొన్నాడు.

అందాకా తొడుక్కున్న కోటు ఊడదీసి "బెర్తు" ప్రక్కన వున్న చిలక్కొయ్యకు తగిలించాడు. ఒక సిగరెట్టు అగ్గిపెట్టె మీద కొట్టి అంటించుక్కులాసాగా కబుర్లు చెబుతూవున్నాడు. ఆ కబుర్లలో అతగాడు కాలం మరచిపోయాడు. గమ్యస్థానం మరచిపోయాడు.

చటుక్కున రయిలు కదలింది. చట్టున ఆవిరి విడిచి బుస బుస మంటూ చక్రాల్ని ప్లాట్‌ఫారమ్ దాటిపోయేలా బండి అంతకూ వేగం ఇచ్చింది.

"అమ్మా? నీవు దిగవే వెనక్కు వెళ్ళాలిలాగుంది. బండిలోనే వున్నావు! అంటూ ఆమె రెక్కుచ్చురుని తానుకూడా ఆమెతోపాటు "ఫుట్‌బోర్డు" మీద నిలబడ్డాడు. ఆమెను సరిగ్గానే పట్టుకున్నాడు. దిగు దిగు అంటూనే వున్నాడు. కాని తాను రెండో చేతిలోవున్న సిగరెట్టు వదలలేకుండా వున్నాడు. ఆ సందిగ్ధావస్తను చూచి, బండిలోవున్న మూడో ఆయన ఎవరో గొలుసులాగారు. ఇంజిన్ బ్రేకడి గల్లంతు అయింది బండిఅంతా. ఆగిన ప్రయాణిని మునీలి ఆమె దిగి దాటిపోయి కటకటాల ఆవల మోటారుకారులో పడింది. సుఫాలరావు ఆమెను చూస్తూ వుంటే సిగరెట్టు క్రింద పడిపోయింది.

మరి డ్రైవరు, గార్డు, గాడి గాడి చూస్తూ అందులో గొలుసు లాగడం కనిపెట్టి, ఏమి పడిపోయింది? అని అడిగారు సుఫాలరావుని? సుఫాలరావు ఫుట్‌బోర్డుమీద నిలబడివుండే "నా సిగరెట్టు పడిపోయింది" అన్నాడు. అసలు గొలుసు లాగిన ఆయన "నీ తల్లి పడిపోతూంటే బండిలో ఎవరోగాని లాగా రనక యిల్లాంటి జవాబు ఎందుకు చెప్తావయ్యా!" అన్నాడు.

డ్రైవరు గార్డుకూడా ఏక కంఠతో ఆ బండిలో వాళ్ళందరకూ వార్నింగు ఇస్తూ వెళ్ళిపోయారు.

సుఫాలరావు భార్య ఊరికే ఇదైయింది మగడు సిగరెట్టు కాలుస్తూ తల్లిని కూడా మఱచినాడని!

అయితే సిగరెట్! సిగరెట్! అది లోకమంతటా అందు లోను మగవాళ్ళకు విశేషంగా ఏలా అలవాటు అయిందో అని ఆశ్చర్యమే!

.... .... .... .... ....

## వంతెన మతం

వంతెన ఆవల క్రిష్టియన్ పేట. అక్కడక్కడ కుటీరాలు కొబ్బరిచెట్లల్లో కులాయాల్లాగుండి చిన్న చిన్న దారులు కలిగి, కలిసి, మెలసి వుండే కొద్దిపాటి జనంతో విరాజిల్లుతూ వున్న పేట అది. ఆ వంతెనదాటి అడుగుపెడితిమా ఆ పేట అంత అతి నిర్మలమైనది నీడయిచ్చేది మఱొకటి కానం. ఎండప్పుడే కాకుండా, వెన్నెలప్పుడుకూడా ఆ పేటలో కాపురంవున్నవాళ్ళు నీడనే ఆపేక్షిస్తారు. ఎంచేతా అంటే, నీడఅన్నది ఆ తావున అంత అందంగా వుంటుంది కాబట్టి. మఱీన్నీ ఆ నీడ ఆకాశం నుంచి పడే వెలుగుజాడల్తో ఆ వూరు మనిషిలో అదోవింత, వివేకము, వినోదమూ కూడా కలిగిస్తూవుంటుంది కాబట్టి.

వంతెన దాటకుండావుంటే అంతా దుమ్ముమయమైన రోడ్డు. రోడ్డుప్రక్కనే మహాపట్నం. ఆ పట్నాన్ని తలపోస్తిమా హిందూమతసంబంధమైన బాంధవ్యంబంధనం మదికొస్తుంది.

ఈ మహాపట్నంయొక్క జనసంఖ్యలో శతశతాంశమై యుంటారు ఆ క్రిష్టియన్ ప్రజ. చాలాకాలమై వారందరూ క్రిష్టియన్లు అయినారని ప్రతీతి. అడిగితే ఒక్కొక్క ముసలతను ఆపేటలో కాపురంవుండే అతడు, తన తాతముత్తాతల్లో ఎవరో ఒకరైనా క్రైస్తును చూచివుండాలి అని అంటాడు. కొబ్బరిచెట్లూ ఆలాంటి పూర్వోత్రపు మహిమగల గాలే వీస్తూవుంటాయి కాని అరటిచెట్లు మాత్రం నిరుడో, మొంగపేడో నాటబడి వంతెన కట్టబడ్డ తరువాతను గెలేస్తూవున్న వానిగా తోచేని.

ఆ అరటిచెట్లతోపాటు క్రొంగ్రొత్తదనం నెఱపుతూ ఏటేటా మారుతూ అధునాతనంగా నచ్చే మతగురువు—అతణ్ణే "పాస్టర్" అంటారు ఆ భాషలో — అతగాడొకడున్నాడు. తతిమ్మా ప్రజ ఎంతపాతకాపులం అని చెప్పుకున్నా అతగాడు మాత్రం క్రిష్టియన్ మతమన్నది ఎప్పటికప్పుడు తనద్వారా క్రొత్త ప్రదేశం ఆ ప్రజలకు పంపుతూవుంటుందనక మానడు. ఈ వంతెన ఎల్లా నిర్మాణమైయున్నదో, క్రొత్తగా తమ క్రిష్టియన్ పేట నిమిత్తమై, ఆ ప్రకారం క్రొత్తరక్తం ప్రతీ క్రిష్టియన్ యింటా నాటినుండీ ప్రవహించా లనేనాడు. ఏనాటి కానాడే ఒనక్క !

అయితే ఆ "పాస్టర్" తో వాదించేవాళ్లు లేకపోలేదు. "వంతెన అన్నదానికి ఒకవైపునే క్రిష్టియన్ పేట అన్నదుంది కాని రెండోవైపు అంతా హిందువుల నగరమేగా ! అనివాకరు ; మఱిన్ని వంతెన అనేక స్తంభాలమీద నిలిచివున్నదికాని ఒక స్తంభాన్ని అనుకుని వున్నదికాదు, అలానే పరాత్పరుడు అన్ని మతాలకు సంబంధించి ఒకపెద్ద వంతెనగావుండి మనలను దాటి

స్తున్నాడని మరొకరు, ఇలా ఎవరికి తోచినట్టు వారు ఆ "పాస్టరు" తో వాదించడం కద్దు. "పాస్టర్" కూడా కొన్నాళ్ళకు ఆ ప్రాంతానికి పాతబడిపోయి "వంతెన" ఉపమానం తన ఆలోచన పథంలో మానేసి, దైనందిన వాతావరణం లోంచే ఏవేవో ఉదాహరణమును చెప్పేవాడు. వంతెనమీదున్నంతసేపు మతమన్నదాన్ని మఱచిపోయేవాడు. వంతెన క్రింద ప్రవహించే నీటిని, ఆ వంతెన పొడుగుని, వంతెనక్రింద నుంచి తెరచాపలను దించుకుని తేలిపోయే పడవల్ని. ఇటూఅటూ గట్టునున్న చెట్లను, చెట్లు నీటిలో ప్రతిఫలించే వైఖరిని, సూర్యోదయ సూర్యాస్తమానరాగాన్ని. చంద్రకాంతిని, చుక్కపొడుపుని, ఇలా నిత్యం జరిగే ప్రకృతివ్యాపారాన్ని తిలకించేవాడు. ఎంతసేపు ? ఆ వంతెనమీద నిలబడి వున్నంతసేపు. క్రమంగా ఆ వంతెనమీద తాను నిలబడివుండి చూచేవ్యవధిని పొడిగించాడు. గంటనుండి రెండుగంటలదాక కొనసాగించి, క్రమంగా ఝామఝామున్నర ఆ వంతెనమీదనే జాగుచేసేవాడు.

ఇలా జాగుచేసినకొద్దీ తాను వచ్చిపోయే జనానికావంతెన మీద అడ్డమయ్యేవాడు. మొదట్లో కొంతకొంతమంది, తప్పించుకుని వెళ్ళేవారు గాని. క్రమంగా కొంద రీసడించుకో ప్రారంభించారు. "ఉన్నది కాస్తవంతెన, దానిమీద నిలబడి విడ్డూరంగా చూడటమేమిటి ? ఆ గట్టునో ఈ గట్టునో నిలబడి చూడరాదూ ఆ పాస్టర్" అని ఒకడా యిద్దరా ? వేయిమంది అనసాగారు. అప్పుడు పాస్టర్ తాను తప్పుకుంటూ, తప్పుకుంటున్నాగా అనేవాడు అతిశాంతంగా.

ఇలావుంటూవుండగా ఒకసాయంసంధ్యను పచ్చగడ్డిమోపు మోసుకెడుతూ ఆవంతెన ఎక్కలేక ఎక్కి ఒక వృద్ధురాలు,

ఆ నెత్తిమోపును ఆలాపాస్టరు తగులగా, గంగలోకి విడిచి పెట్టింది, "అదేమిటమ్మా! అలా నిడిచిపెట్టేశావు!" అని పాస్టర్ అడిగితే "నీవు పడగొట్టేశావు!" అంది. నిజంగా పాస్టర్‌కు తగిలే ఆ పచ్చగడ్డిమోపు గంగలోపడింది. ఆ ముసిల్దే నిజమాడినదంటే నిజమాడిందని ప్రజ అంతా నివ్వెరపోతూ కనుగోసాగారు. పచ్చగడ్డిమోపు పడీపడటంలో కట్లుతెగి ఏపరక కాపరక విడవడి, నీటిలో తేలిపోసాగాయి. "అయ్యో! వృధాగా పోతూవుందే మోపుమోపూ" అని మఱీ మోహంతో జనం అంతా చూస్తూవుంటే ఒక పెద్ద తెల్లఆవు ఆతట్టుగట్టుదూకి నీటబడి యీ పరకల్ని మేస్తూ కాలవకడ్డుగా రెండోతట్టు గట్టు ఎక్కిపోయింది.

"చూడు! నీ పచ్చగడ్డి ఏటిపాలుకాలే! ఎంచక్కా ఆవు మేసింది!" అన్నాడు పాస్టర్. "అలా మేసేఆవులు ఎన్నైనా ఉన్నాయి! నాకు డబ్బులిచ్చే మహారాజుల్లేరు గాని" అంది ముసిల్ది.

"నీకు డబ్బులుకావాలా? మోక్షంకావాలా?" అని ప్రశ్నించాడు పాస్టర్. మహాతాను ఏదిపడితే అది ఒలికించేవాడికి మల్లే. పాస్టర్ ముఖంకేసి వెంటనేచూస్తూ ఆ వృద్ధురాలు "నాకు మోక్షమూవద్దు! డబ్బులూవద్దు! వంతెనమీద దారికావాలి! నా పచ్చగడ్డి మోపు పడిపోకుండా వుంటేశాన!" అంది. "అవును పాపం!" అంటే "అవును పాపం!" అనిఅంతా అన్నారు. పాస్టర్ అప్పుడు గ్రహించాడు. "వంతెన అన్నది ఈ గట్టునుండి ఆ గట్టుకు నడవడానికి గాని మధ్యనిలబడ్డానికి కాదు" అని.

కాని ముసిల్ది మఱి పచ్చగడ్డి మోపెత్తుకొన్నదీ లేదు. ఆ దారిని నడిచిందీలేదు. అనడంమాత్రం ఒకమాట అనేది తనపని

కిరస్తానీ పాస్టర్ వల్ల నాడే కనులపండుగ అయిందని. ఆ మాట పలువురు పలువిధాలుగా అర్థం చేసుకొనేవారు. కొందరేమన్నా ఆమెయొక్క పచ్చగడ్డిమోపును కనుం పండుగకు ఊరికేఏమీ డబ్బులివ్వకుండా తిన్నట్టు పెద్దావునాడే తినేసింది అని. కొందరు నాడే ఆమెకు దేవుడుకనబడి ఆమె నెత్తిమీద పాపాల బరువు రూపంలోనున్న పచ్చగడ్డీమోపును జీవన ప్రవాహంలో పడేసి మాయంచేశాడని. ఇలా ఎవరికితోచిన అర్థంవారు చెప్పి చెప్పి తుదకు దాన్నో క్రొత్తమతంక్రింద జమవేసి ఆ ముసలిదాని మతం "వంతెనమతం" అన్నారు-అందులో అన్ని పండుగలు, అన్ని పరమార్థాలు, ఉన్నాయి అన్నారు. ఆమె మనకంటికి మళ్ళీ కనబడకపోయినా ఆ వంతెన నేటికీ నిలిచిపుండి ఆమె అనుభవాన్ని సూచించేని.

.... .... .... .... ....

## ఆర్థిక స్వాతంత్ర్యం

పొలతి పోలమ్మ—దొరపొగాకు దాన్నే కుంఫినీ పొగాకు, దాన్నే బార్న్ పొగాకు, దాన్నే వర్జీనియా పొగాకు అనిన్నీ ఎన్నో పేర్ల ప్రజలు పిలుస్తున్నారు, కొత్త వ్యాపారంగా తెలుగునాట నేడు వ్యాపిస్తూవున్న దనకం చేతను—కాదు మరీ! చిన్నపిల్ల వాణ్ణి పద్నాలుగు ముద్దుపేళ్ళ పిలవం? కాసులు అనీ కన్నులు అనీ, గుమ్మడు అనీ, అమ్మడుఅనీ అలాగే అదీని—పొలతి పోలమ్మ అని కామాసుకథ ప్రారంభించాను.

పొలతి పోలమ్మ దొరపొగాకు ఫ్యాక్టరీపనిలో కూలీగా కుదిరింది. పసుప్పచ్చని బీరపువ్వురంగున మెఱసిపోతూ వుండె

కారియర్, తెల్లని నువ్వు పువ్వుమంపు గొల్పే సొంపైనచీర. ఆ రెండున్నూ ఆమె వొంటిచాయను ఏర్పాటుగా కాపరుస్తూ వుంటే, చూచేజనం ఆమెను నిలువెత్తునా గంటూ, కొత్తరక పొగాకు మొక్కను, రేవడిమీద ఏపుగాపెరిగి నీలంగా పూత పూసినదాన్ని మెచ్చుకున్నట్టు మెచ్చుకో సాగేరు.

చకచకా నడుస్తుంది. పకపకా నవ్వుతుంది. పదిమంది మధ్య వొక్కర్తెగా గోచరిస్తుంది. ఒక్కర్తే వున్నప్పుడు పది మందిలా అభినయిస్తుంది ఎప్పుడు కలుసుకు చూడండి! ఎన్నాళ్ళకు పలకరించి చూడండి, వెనకటిమచ్చే! అదే ఎల ప్రాయం! అదే కొలపాత్ర!

* * * * *

ఫ్యాక్టరీపనికి వ్యవసాయపు పనికీ సహస్రం వార. ఆ సంగతి వేరే నేను వ్రాయనక్కర్లేదు. మొదటి పనిలో అంతా అవర్! రేక్కవర్! ఎటికెట్; అప్పో!—రెండోపనిలో అంతా షవర్! సైక్కోవర్; ఏమీ బిలిటీ: అరోరా! ఉప యోగించినవన్నీ విదేశీ మాటలని తోసెయ్య బోకండి! ఆలో చించండి! ఆలోచించిన కొద్దీ నాయకి క్లోసుఅప్—లోలాపెరు గుద్ది. పత్రికల ముఖచిత్రంగా విజృంభిస్తుంది. చట్టం కట్టించుకు విజ్ఞానధనులందరూ తమ కచ్చేరీబల్లలమీద పెట్టుకుంటే కృషికి హుంషారిస్తుంది.

* * * * *

ఉదయాన్ని వెళ్ళినప్పుడు లేంది సాయంకాలం ఫ్యాక్టరీ పనినుంచి తిరిగి రావడంలో డబుల్ పైగర్ డోరియా జాకెట్టు

తొడిగింది. బహుశా దారిలో టైలర్ ఆపొద్దుగ్గాని తయారుచేసి యివ్వలేక పోయివుంటాడు. పొద్దున్న వెళ్ళినప్పుడు కానరాంది, సాయంతరం తిరిగి వచ్చేలో ఆమె బర్మా ముడిచుట్టూ గుల్లబ్ పూ ఘుమ ఘుమ! ఎక్కడిదని వ్రాయను? రోడ్డుదారిని గాక అడ్డదారినివస్తే, కూలిపోయిన ఒకానొక పురాతనపు బంగాళా ముందు ఉమ్మెత్తల్లో వెదికితే ఒక్కచోట ఉంది, ఒక గుల్లబ్ మోక! ఇఖమరి ప్రాతఃకాలాన్ని వినరాని మట్టెలచప్పుడు ప్రభాతకాలాన్ని కనరాని గాజుల త్రిప్పుడు, అలాంటివన్నీ సాయంకాలం ఊతం గొన్నాయి అంటే దేన్నిబట్టి? నాటి సాయంకాలం ఆమె చేతికి వచ్చిన అస్సలైన సిల్వర్ రూపాయను బట్టి అని అనుకోకతప్పదు. ఆ వరబడిని నెలకు ముప్పై రూపాయలు! ఓహో!

క్రమంగా ఆమెతోటి వాండ్రంతా పక్కతెన్నులబడి యెవరి యిళ్ళకు వాళ్ళు పోతూవున్నట్టు వెళ్ళిపోయినారు. ఆమె వొక్కర్తే యింకా పట్నం వెంపుకు గట్టే నడుస్తూవుంది. లేత వెన్నెల! కూతగాలి! మఱొక్క అడుగు వేసింది. బాటకు పడమటివైపు "పార్పెట్" సిమెంటు కడ్డీలు!

ఆకడ్డీలట్టుకు నిలబడింది. నిలబడి నదికేసి చూస్తూవుంది. చక్కటి లాంచి, లాంచిమీదో దొరగారు, దొరగారి చేతికోపల ఒక సిగారు! "గుడ్నైట్! దొరగారూ" అంది పోలమ్మ. దొరగారు వెంటనే "గుడ్నైట్" అంటూ తన సిగార్పొగ నీటిమీదినుంచి నీలాపుటావిరిగా గట్టుకూదేడు. ఆ దొరగారి ఆ హౌసుకు ప్రతి హౌసుగా పోలమ్మ తానేంచేయూలో పాలు పోక వెనక్కు తిరిగిచూచింది.

ఎవరైనా ఇతర్లుంటారేమో వస్తారేమో అనే భయం కూడా లోపల స్వతస్సిద్ధంగా వుంటే వుంది వుంటుంది అంతర్జ్వరంలా !

పోలమ్మయొక్క అత్త అనగా మగని తల్లి, ఎక్కణ్ణుంచి వస్తూవుందో గుండెలు బాదుకొంటూవచ్చి లటక్కన పోలమ్మ గొంతు తన జేనవంపు—అప్పుడే చమక్కున వెలిగిన విద్యుద్దీపపు గాంతి వచ్చుపడేటట్టు—అదిమిపట్టి "నీకిదేం పొయ్యేకాలం వచ్చిందే? ఊళ్లోవున్న నీ యేరళ్ళందయీ దీపాలెట్టుకుండా కొంపలకు జేరుకుంటూంటే నీవిలా పేప్రేగి యిక్కడ నిలుచుండిపోనావు?" అని అడిగింది.

పోలమ్మ—"ఊఁ నోరుచేసుకు గోలచేయకు, ఆవలనే ఫ్యాక్టరీ పనిచేస్తున్న దొరగారి లాంచి వెడుతోంది. పైకిచూడు ! మొన్న వాకటోతేదినుంచి నేను వృత్తిపన్ను కడుతూవున్న మ్యునిసిపాల్టీల పాదరసపు బల్బుబ్బిపోయి కాంతిల్లుతూవుంది" అని తన గొంతు తప్పించుక నిక్కచ్చిగా గ్రుడ్లురిమింది.

ఆలా ఉఅమకముందే నోటపిడుగడిందో ఏమో?— "మదరిన్లా" మొగం మాడిపోయింది. మాడిపోయి మళ్ళిపోయింది.

కోడలు కులాసాగా తన స్వార్జితపు, కష్టార్జితపు, సిల్వర్ రూపాయ పైకి తీసుకు, సిమెంటు ఖద్దీమీద ఖరాగా మోగించి మెర్క్యూరీలైట్ ఛాయను ముద్దెట్టుకుంటూ,

> "సిల్వర్‌దేమాయ ! కల్వాందేరాయ !
> హాల్వాదే తీపి ! అత్తకేం తెల్సు?"

అంటూ పాడుకుంది, చాలాలేటు అవర్‌దాకా !

.... .... .... .... ....

## చెడుగుడి : చెండాట

“ చెడుగుడి ” నే పట్నవాసంలో “ కబాడీ ” అంటారు. చెండాట అంటే కాలిబంతి ఆట అనుకొనేరు గనుక—కాదు—రెండు రాళ్ళమీదనో, ఇటుకలమీదనో, అడ్డంగాపెట్టిన కర్రను ఒక గుడ్డ బంతితో కొట్టడం. ఈ రెండు ఆటలు అంటే నేను చాలా ప్రియపడతాను, ఆ పల్లెటూరులో ఆడాను కాబట్టి, ఆ చెరువు గట్టున ఆడాను కాబట్టి ఒక పదిరోజులు ఆడాను కాబట్టి.

అందఱు బ్రాహ్మణ చిన్నవాళ్ళు. అప్పట్లో ఆడినవాళ్ల నన్నొక గౌరవంతో చూచేవారు. నేను పట్నవాసంలో అప్పటికే బి. ఎ. చదువుతూ వుండేవాణ్ని కావడంచేతకాబోలు. అయితే సరదాకూడాను అంతమంది తోటివాళ్ళచే మెప్పునుగంటూ ఆడ్డం !

దసరాకు మా మామగారు తీసుకువెళ్ళారు నన్ను ఆవూరు, తను వుండేవూరు అదేనని. ఇంటికి వెళ్లేసరికి నా భార్య పండగ ముస్తాబై తన తల్లి చాటున ఒదిగివుంది. చిన్నపిల్ల నా భార్య. అది చిన్నపిల్ల కావడంచేత నేను అత్తవారియింటికి ఏ మధ్యాహ్న భోజనానికో ఏ ఫలాహారానికో వెళ్ళేవాణ్ణి. మిగతాకాలం వీథి లోను చెరువుగట్టున ఆకాశంక్రిందనా గడిపేవాణ్ణి.

చెరువుగట్టున కుఱ్ఱకారు ఆడేవాళ్లు. అంతా బ్రాహ్మణ చిన్నవాళ్ళు. ఆ వూరే అసలు అంతా బ్రాహ్మణ్యం. అందులోను ఆ చెరువుగట్టున ఊరికుత్తరంగావున్న చెరువుగట్టున ఆడేవాళ్ళు అంతా బ్రాహ్మణకుమారులు.

బ్రాహ్మణకుమారులని వాళ్ళేం నీరసంగా వుండేవారు కాదు. ఒక్కొక్కడు మా జట్టీలా గుండేవాడు. ఇంగ్లీషుచదువు రాదుకాని అందఱూ సంస్కృతం పంచకావ్యాలు చదివి

నాగలిపట్టిన వాళ్ళే. ఊదుపులయి వాళ్ళు ఆడారుఅంటే ఇక చెప్పక్కఅలేదు. బల్‌చెల్, చెండాట, కొక్కు, గూటీబిళ్ళ యిలాంటివి. ఊరుచివర చెరువుగట్టున సందడిగా ఆడేవారు. వారు ఆ ఊరికి ఒక భాగ్యము.

ఆ చెరువుగట్టున ఒక శివాలయంవుంది. చెరువులో రెల్లుతో సహా నీరుండేది. శివుడు సాయం సంధ్యా నృత్యము చేసేవాడు మేమంతా కాళ్ళు కడుక్కుని ఆ దేవాలయంలోకి వెళ్ళేసరికి.

రెండురోజులు చూసింది నా భార్య ఆ అడ్డం, ఆ అడ్డం ఆ సొగసూ, ఆ ఇదీ. వాళ్ళగుమ్మంలో కనబడుతుంది ఆ చెరువు గట్టు. ఆ ఊరొక పల్లెటూరుకావడంచేత నా భార్య చిన్నపిల్లయినా ఎదిగిన పిల్లలా మాట్లాడింది నాతో ఆ రెండురోజులకే సిగ్గువిడచి "మీరూ ఈ ఆటలు ఆడతారా ?" అని. "ఏమి ! చెడుగుడి, చెండాట ఆడకూడదా ? ఎవరుపడితే వాళ్ళే ఆడొచ్చు" అంటూ వీధిగుమ్మం మెట్లు ఎక్కాను. "అందుక్కాదు అబ్బాయీ ! అమ్మాయి అంటూపున్నది. ఈ పల్లెటూరి ఆటలు మీరూ ఆడతారా ?" అని దానివూహ అంటూ మా అత్తగారు తన పిల్లను లోపలకు తీసుకువెళ్ళింది. అప్పటికప్పుడే ఒక ఇరవై మంది పిల్లకాయలు నన్ను ముట్టడించి "రాండి ! ఇంకా ఆడదాము" అంటూ కవ్వించారు.

అంతా నా జట్టు పిల్లకాయలు. నాకు అదోవేడుకై మళ్ళీ వెళ్ళాను చెరువుగట్టుకు వాళ్ళతో. మళ్ళీ ఆడాను చెండాట చెడుగుడు. ఆ పండగ పదిరోజులు అదేపని. ఆ ఆటలే సరదా అనిపించాయి అప్పట్లో. మఱుచటిసంవత్సరం మళ్ళీ ఆ ఆటలు

లేవు. ఆ పిల్లకాయలు లేరు. దేవుడుగుడి అలాగేవుంది. చెరువులో తెల్లుగడ్డినీరు అలాగేవుంది. చెరువుగట్టున ఒక నున్నని వరి కళ్ళంవుంది.

నేనూ తిరిగి చూస్తిగదా చిన్నపిల్లలంతా ఎదిగినట్టు గోచరించారు. కాని ఆ ఆటలల్లాగే నిలచివున్నాయి.

.... .... .... .... ....

# గంటల బళ్లు

నే వ్రాస్తూవున్నది ఏ ముప్పయ్యేళ్ళనాటి మాటో! బస్సులులేని రోజులు. కార్లు సకృత. పల్లెటూరుకు పల్లెటూరుకు నడకమీదగాని, బండ్లమీదగాని వెళ్ళేవారు. అందులోను మెరకపూళ్ళు అవి అయితే మోటబళ్ళే మార్గం. రైలుగట్టు ఒక కొన్ని గ్రామాలను కొన్ని పట్నాలను కలిపింది కాని మిగతా గ్రామాలన్ని రైలెఱుగనివే! అలా అని ఆ గ్రామాలు సంస్కృతిలోను, వ్యవసాయంలోను ఏమీ తీసిపోయేవికావు. పట్నవాసపు టుద్యోగస్థులుకూడా సదుపాయంకోసం పల్లెటూళ్ళంటే కమానువెళ్ళేవారు. వారికి మేనాసవారీలు ఏర్పాటుచేసేవారు. ఒక్కొక్కప్పుడు రెండెడ్లబండిలో గడుకొయ్య ఎత్తున వట్టిగడ్డిపఱచి, అందుమీద కంబళీయో పరుపో వేసి రెండుపెక్కాలు పడేసేవారు. ఎడ్ల కొమ్ములకు ఇత్తడి తొడుగులుండేవి. వాటి మెడలలో గంటలో లొడుగులో యుండేవి. కొన్నియెడ్లకు మువ్వలుండేవి. బండి తోలేవాడు సామేదాగా వట్టిగడ్డివేసుకు తొట్టిలో కూర్చునేవాడు. తోలేవాడే కాదు. ఎడ్లబండీ దానంతటదే నడిచేది. అలాంటిబళ్ళే కనపడవు ఇప్పుడెక్కడా!

అయితే ఒకప్పుడు వెళ్ళిన హుషారు మరొకప్పుడు లేదు. ఆ ఒక్కసారి సవారిబళ్ళమీద సరదా అనిపించింది. ఏ ఒక్కసారి అని అంటారేమో పాఠకులు ?—

మేం అంతా మగపెళ్ళివారం. మా పినతండ్రి కొడుకు పెళ్ళిఅయింది విరవాడలో. మేమంతా ఆ పల్లెటూరు తలోవూరు నుంచి పెళ్ళికివచ్చాం కాని వెళ్ళేటప్పుడు అంతా కలిసి మా వూరు శ్రీరంగపట్నం తిరుగవెళ్ళేం. ఆ వెళ్ళేటప్పుడు అయిదురోజులు పెళ్ళికుండి విరవాడలో రెండెడ్లబళ్ళమీద ప్రయాణమైనాం. రెండెడ్లబళ్లు ఎక్కడనుంచి వచ్చాయంటారేమో ? శ్రీరంగపట్నం నుంచి వచ్చేటప్పుడు బండికొకరు చొప్పున వచ్చారు. వెళ్ళే టప్పుడు బండికి పదిమంది చొప్పున కూర్చున్నారు ఆడపెళ్ళి వారు, మగపెళ్ళివారు, వాళ్ళవాళ్ళ బంధుగులు కొందరు యావ న్మందీ ఒక వందమందిదాకా ప్రయాణమైనారు, మీ రెక్కండి అంటే మీరెక్కండి అంటూ వారంతా ఆ రెండెడ్లబళ్ళు ఎక్కే వాళ్ళలాగు కనిపించారు. కనిపించడమేమిటి ? ఎక్కారు !

బళ్ళు నల్లచెరువు సత్రవు చేరుకునేసరికి ఒక జాము పొద్దెక్కింది. ఒక జాము పొద్దెక్కింది అంటే ఏమన్నమాట ! విరవాడలో ఏ రాత్రో బళ్లుకట్టామన్నమాట !

నల్లచెరువు సత్రము పెద్దసత్రము. మేం వంటలవీ చేసు కునేసరికి బళ్ళవాళ్లు తినేసరికి ఏ మూడు జాములో అయింది. అపరాహ్ణం. కాలం వేసవికాలం. నిప్పచ్చరంగా బాటపడి కంటి అయ్యన్న చెరువు అంతా ఎండిపోయింది. ఆ చెరువు అడ్డముడి ఎంతసేపు వెళ్ళడమనుకుంటూ బళ్లు కట్టాము. మువ్వలు గంటలు కట్టి కొన్నిటికి తలవెండ్రుకలతో అల్లిన తాళ్లువేశాము. ఆడపెళ్ళి

వారినుంచి తీసుకున్న గడ్డిలో సగం మేసినా సగంమేయకుండా వుంచిన గడ్డి బళ్ళల్లో సర్ది ఎక్కికూర్చున్నాం.

ఇక కంటి అయ్యన్న చెరువు వచ్చిందయ్యా ! అదో పరువు పరుగెత్తిస్తూ ఎడ్లు బళ్ళను వద్దన్న వేగంగా లాక్కు వెళ్ళాము. కంటిఅయ్యన్న చెర్వు ఆవేళ ఏదో మైదానం అయి యుంది. సవారిబళ్లు బాహాటంగా పరుగుమీద వెళ్ళేనున్నదనంలు ఏర్పడివుంది. రోడ్డుదారిని మారి ఆదారి పుచ్చుకున్నాం. ఒక్క లిప్తలో వెళ్ళినట్టు వెళ్ళిపోయినాం, మా సవారిబళ్ళను గంటలు వాయించుకుంటూ మువ్వలచప్పుడు చేస్తూ శ్రీరంగపట్నం సాయంత్రం చుక్కలు పొడిచేసరికి——

అది వొకసరదా ! అది వొక హుషారు !

.... .... .... .... ....

## మా సందు

" మా సందు " అని ఈ వ్యాసము ఎత్తుకోవడంలో, వెన కెప్పుడో 26-12-12 న రచించిన " కల " అనే నా ఖండకావ్యము నందలి ఒకానొక యుత్పలమాల జ్ఞాపకం వస్తోంది :——

" బందము చేతఁబట్టుకొని పాల్పితుకంగను వెళ్ల గొల్లనిన్
బొందుగ దూడలన్ గదలిపోవక యుండఁగఁ బట్టు పిల్లనిన్
దొందఱతోడ గోవులను దోలఁగ మేల్కొను పాలికాపు మా
సందునఁ బోవుటల్ కనుచు సంతసమెచ్చగఁ బల్కరించితిన్ "

ఆ సందునే మా యూరిలో " కవుకొండలవారి సందు " అంటారు. " సందు " అని ఎప్పుడైతే అన్నామో, దాన్ని వొక దారిగాను, గమ్యస్థానం గలదిగాను, నిరూపించేశాం అన్నమాటే.

దారి బాహాటంగా రాజవీధిలోంచి లోపలకు దక్షిణంగా గజన్నర, రెండుగజాల వెడల్పున ఒక ఇరవై ముప్ఫై గజాల పొడుగున కనబడుతుంది : గమ్యస్థానం మాటే ఎప్పుడు చూచినా నాకు ఆలోచనీయంగా వుండిపోయేది. పేరునుబట్టి " కవుకొండలవారి యిళ్లు " అని అనుకున్నా " ఆ యిళ్ళు మాత్రమేనా ? " అని ప్రశ్నగా వుండిపోయింది.

నేను ఆ సందులోనే పెద్దింటఁ బుట్టాను. ఆ పెద్దింటికి ఎదర ఓ మహత్తరమైన చతురాంగణము, అఖండ గౌతమిలా పరపైంది, వుంది. ఇప్పటికీ వుంది. ఈ పెద్దింటి కెదర మా పిన తాతగారి యిల్లు వుంది. ఆ యింటినిగురించి, ఆ యింటిలోని వారినిగురించి, తెలిసికొనేసరికి, బహుశా నాకు మూడేళ్ళయినా పట్టివుంటుంది. దాని దక్షిణంగా వున్న ఇంటిలోనివారిని తెలిసి కొనేసరికి అయిదారేళ్లైనా పట్టివుంటుంది నాలుగో యిల్లు బాగా మూలకువుండి, " మూలింటివారు " అనేపేరు ఇంటిలోనివారికి కూడా సార్థక నామధేయం గావించింది. ఆ యింటి నెఱుగ గలిగింది ఏ ఎనిమిదో ఏటో, తొమ్మిదో ఏటో కావచ్చు. ఈ నాలుగిళ్ళే ఆ సందులోని ఇళ్లు. మరి ఇళ్లూలేవు. వాకిళ్ళూ లేవు. ఈ నాలుగిళ్ళూ కవుకొండలవారి యిళ్లేను. " ఈ సందు రాజవీధిలోనుంచి మా యిళ్ళకోసమేను. మఱి ఆవలకు దారిలేదు," అనే నమ్మకం గలిగిస్తూ దక్షిణంవైపు ఆ సందును మూసి వేసిందై, ఒక గోడవుండేది. ఆ గోడనుగురించి, ఆ గోడ ఆవలి వారినిగురించి, తెలిసికొనేసరికి బహుశా నేను పన్రెండు పదమూడేండ్ల వాడనై యుండాలి.

చిత్రం ! గోడావలివారి యింటిపేరు " ఎల్లపు " వారు. ఎల్ల=సరిహద్దు. కవుకొండలవారి సందుకు దక్షిణపుటెల్లలో

వుండి ఆ సందును "బ్లైండ్ లేన్" గా గావించినవారు కావడం చేత ఆవలి దిశవారు "ఎల్లపువారు" అయినారేమో అనే ఆశ్చర్యము నాలో అప్పటప్పట రేకెత్తుతూవుంటుంది, ఇప్పటికీని. ఆ రోజుల్లో మఱీని! ఎంచేతా అంటే మా సందు నిజంగా నాకు ఆ రోజుల్లో రెండో వెంపుకు దారిలేనటువంటిన్నీ, రెండోదెస తెలియరానటువంటిన్నీ, ఒక్క రాజవీధిలోనికే, ఉత్తరంవెంపుకు మాత్రమే మార్గమున్నటువంటిన్నీ చిత్రమైన సందుగా తోచేది.

"ఈ కుశలమైన సందు ఎప్పుడు సువిశాలమైంది? అసలు సువిశాలమైనది అయిందా ఏనాడైనా?" అనేదే ఈ వ్యాసము నందలి చర్చనీయాంశము.

నా దాయాదులందఱూ ఈ సందులోనివారే. మా తాత ముత్తాతలు అక్కడివారుగానే నిరూఢింపఁబడుతూ వచ్చారు. మా "బామ్మ" "కక్కబామ్మ" "అన్నయ్య బామ్మ" "వెంకం బామ్మ" ఇలాంటి వృద్ధ ప్రవృద్ధ స్త్రీలు, కాపరానికి వచ్చి, కడుపుపండి, నాలుగు కాయలుగాసి, కాలం మళ్లించుకున్నది ఆ సందులో నేట!—ఇప్పటికీ వుంది "కక్కబామ్మ" అనే ఆబిడ—తొంభై యేళ్లుండొచ్చు.—"కక్కబామ్మ" అంటే ఒకానొక కక్కయ్య, అనగా పినతాతగారి కొడుకు కక్కయ్య, ఆయన తల్లి అన్నమాట; ఇలాగ్గానే "అన్నయ్యగారు" ఏ ముత్తాత సహోదరుల వరసనో అయిన అన్నయ్య, వారి యింట్లోవుండే ముసిలి ఆబిడ "అన్నయ్యబామ్మ" మఱిన్నీ "రాజప్ప! భాపప్ప!" ఇది ఒకవిధమైన ఆ సందులోని పరిభాష. మాబోటి కొత్తకొత్త చిఱుతలకు పెద్దవాళ్ళమీద మమకారం పుట్టించే కొత్తకొత్త పిలుపులూ వావులూను.

మా సందులోని నాలుగిళ్ళకూ అన్నీ సింహద్వారాలే ! రాజవీధిలోనికి దారితీసే పెద్ద గుమ్మాలే ! పెఅటి తోవలు లేనే లేవు, ఒక్క పెద్దింటికి తప్పిస్తే, పెద్దింటికి పడమటివైపు పెద్ద గుమ్మం, "దొడ్డి గుమ్మం" అనేది ఒకటి కద్దు. కాని అక్కడ హడావిడి, సందడి, మగవాళ్ళ రచ్చ అదీ సింహద్వారపువైపు కంటె హెచ్చు. ముప్పొద్దూ గాదెల్లో గింజలపోతో, గుంజల ముందుకు గడ్డిమోతో, జరుపుతూ, చెప్పరానివాళ్ళ దగ్గర్నుంచీ మసిలేదికూడా ఆవైపే. దీన్నిబట్టి ఆడవాళ్ళు వేతే నడిచే మార్గంలేదు అని తెలుసుకోండి పాఠకులు ! అందుకు చేతను, కోనేటినుంచి మంచినీళ్లు మడిగా తెచ్చుకునే తెన్ను తప్పిస్తే మఱో తెన్ను "కవుకొండలవారి కోడంౘ్రడు" ఎఱుగరు అని వ్రాసినా అతిశయోక్తి కానేరదు. కోనేరెండిపోయి మఱోచోట నుంచి వేసంగిలో మంచినీళ్ళు తేవడం అంటూ వచ్చిందా, మా మగవాళ్ళం బళ్లకట్టుకునో, ఈ రేళ్ల పన్నుకునో, గుండిగెల్తో తెచ్చి పోసికోవలసిందే.

అయితే కొన్నాళ్ళగా తెలివీతేటా హెచ్చి, ఇరుగ పొరుగు వారి స్నేహంబలిసి, ఊరివారితో కలిసి మెలగడంలో- పల్లెటూరి స్త్రీలోకం అంత గ్రుడ్డిగా శుద్ధ ఘోషామార్గంగా వుండ నేరదు——అని తెలుసుకొన్నాను. అధమపక్షం నడివీధిలో చూపులు, మాటలు అందుకోవాలని, ఆలకించాలని, ఆబా గోపాలం ప్రతియింటిలోని వారికీ వుంటుందనీ, అందుకు త కంతలో, కలుగులో గావించుకోక మానరని, నాకు బోధపడింది ఈ బోధపఱచుకోవడంలో ఊరిలోని రాజవీధికి "పారలెల్"గా, రైలుపట్టాలకు టెలిగ్రామ్ టెలిఫోన్ తీగెల్లా, లోగిళ్ళ

యేర్పాటుల్లోనే, కావలసిన ఇతర సౌకర్యాలు వుంటూవుంటాయని తేటపడింది. ఇళ్ళ పేర్లు మఱి చెప్పినా పాఠకులకు విసుగు అయినా కొన్ని చెప్పక తప్పదు.

మాయింటికి పడమ పెంపు "కటకం వారు" అనే కోమట్లు ఉన్నారు. వారింటికీ మాయింటికీ మధ్యకంత వొాకటి కద్దు. అది మిక్కిలీ చిన్నది. చిన్నవాళ్ళంమాత్రమే దూరి వెళ్ళ డానికి వీలు. పెద్దవాళ్ళు కబుర్లు చెప్పుకొంటూ నిలబడి వుండ వలసిందే. మఱిన్ని కోమట్లకు సహజంగా బొట్టిలూ బొజ్జలూ వుంటాయి కాబట్టి అవలివాళ్లు ఈవలకు రాలేనంత చిన్నకంత ఏర్పాటు గావించి వుంటారు మావాళ్లు. మఱి ఇటు మా ఎదరింటి వారి యింటిలోనుంచి "వంగలవారింటి" లోనికి దారి ; వంగల వారింటిలోనుంచి "చాడావారి" వాకిట్లోకి—మళ్ళీ చాడావారి దొడ్డిగుమ్మం మా మూడింటివారికి పెరటి దిడ్డి. "వంగలవా" రంటే "చాడావా" రంటే వారందఱూ వైదీకులు.

ఈ దారులన్నీ ఏలాంటి దారులంటే, ఆలా నడిసీధిలో మోళీకట్టేవాడు డోలుమీద దెబ్బకొట్టాడన్నా, మేళ నాయకురాలు తాళం చిప్పలు టిక్కుటిక్కు మనిపించినా, ఊళ్లో స్త్రీలందరూ ఎక్కడెక్కడి వాళ్ళూ నడువీధిలోనికి వున్న గుమ్మాలాంట ఓరవాకిలిగా తొంగిచూడవలసిందే. వీళ్ళంతా ఎక్కణ్ణుంచి వచ్చారా, ఎందున్నారు ఆదాకా? అనేది లాతివాళ్ళ కెల్లకాలం పెద్ద వింత! సింహద్వారాలంట మగాళ్ళకెంత నిదానమో అంత నిదానమూను స్త్రీలకీ చిన్నచిన్న దిడ్డిగంతల గుండా!

అయినప్పటికీ సందు సందే!—గుడ్డిగా ఎల్లపారి గోడ వద్ద ఆగిపోయినట్టు ప్లానులో కనబడుపబడేది.

ఇలావుంటూవుండగా మొన్న మొన్న — మొన్ననే నిజంగా—మా అరుగుమీద నేను, మా యింటి కెదురుగావున్న అరుగుమీద మా పినతాతగారి మనమడు కూర్చునివుండగా ఒక హరిజనుడు సందు మొగకు వచ్చి "ఆలా పోనిస్తారా?" అని దక్షిణముఖం చూపించాడు.

"ఏం అటు దేవాలయం వుందా?" అన్నాను పరిహాసంగా. "చిత్తం" అంటూ వాడు, అతి పరిచయంగా, మేమింకా అరుగులమీద వుండగానే మమ్మల్ని దాటిపోయాడు.

"దేవాలయంలేదు దివ్యలోకంలేదు ఆవలి వీధికి" అన్నాడు మావాడు నాతో. "అవితే, మనసందుకూడా నేడు అందరికీ స్వచ్ఛంద రాజమార్గం అయింది అన్నమాటే" అని అన్నాను. "కాకపోవడమేం? చక్కని రాజమార్గమయింది" అన్నాడు ఆ సోదరుడు.

నూతనదృష్టిని తిరిగి సందర్శించాను మా సందును— సందుకు ఓవైపున అరటిచెట్లెదిగి, గెలలభారంచే వొఱిగి "కళ్యాణమే నిత్యకళ్యాణమే" అని పాడుతున్నాయి. మఱో వైపున ద్రాక్షాలతలు గోడకెగబ్రాకి చలువనీడ నిస్తున్నాయి. మఱొకచో రాధామనోహరపుష్పాలు! సందులోని చిన్న అరుగులమీద కూర్చున్నా, పెద్దరుగుమీద కూర్చున్నా, పెరళ్ళల్లోని ఏనాటి నూదిచెట్లయొక్క ఎత్తుసత్తువలూ, పోయిన ప్రాణాలను లేవదీసుకు వచ్చేవాటిలా కనబడ్డాయి! మార్గగామి హరిజనుడైనా, అగ్రజాతి వాడైనాసరే ఒకేరీతిని చల్లగా దక్షిణపు తెమ్మెరనే పైరుగాలి వీస్తూ చెమ్మటాఱుస్తూ, ఆ వాడకు బ్రహ్మానందం చేగూర్పక మానదు అని అనిపించింది.

.... .... .... .... ....

# షి కా రు

షికారు వెళ్ళడమంటే ఇప్పటికీ సరదావే నాకు. అయితే పూర్వం వెళ్ళినంత దూరానికి గాని, దొడ్డదొడ్డ స్థలాలకు గాని ఇప్పుడు వెళ్ళడంలేదు.

మొన్న మొన్నను అనగా కనుంపండుగకు, ఒకానొక బుద్ధిపుట్టి కొవ్వూరు రైలుమీద వెళ్ళి అక్కడనుంచి తిరుగ వచ్చే టప్పుడు సాయంకాలం నాలుగుగంటలకు "లాంచీ" మీద వచ్చాను. లాంచీకి ఒక బస్తాల "బోటు" కూడా కట్టబడింది. ఆ బస్తాల బోటు మీద కూడా జనం ఎక్కారు. లాంచి కదపఁ బడింది.

నీలనీలంగా కనబడే గోదావరిమీద ఎదరుగా కొట్టే కెరటాలమ్మట నీళ్ళుపడి లాంచిలోకి బోటుమీదకూ తుషారంగా వచ్చి తడుపుతూవుంది. కొవ్వూరుకు రాజమండ్రి ఎదరఎదర వొడ్డుల మధ్య కాస్త దూరం! ఆ కాస్తదూరానికే ఎంతో ప్రకృతి దృశ్యం! ఉత్తరదిశ కొండలు కనిపిస్తూ వుంటాయి, దక్షిణాన్ని ఆనకట్టు కనిపిస్తూ వుంటుంది. మఱీ విడ్డూరంగా లంకలు వంతెన అగపిస్తూ వుంటాయి.

ఆనాడు ఎండకాయడం చేత వెచ్చవెచ్చగా ఆనందంగా వుంది. అయితే నాది షికారు అనిపించుకోలేదు. నాది ప్రయాణం అనిపించుకుంది. కొవ్వూరునుండి రాజమండ్రి తిరుగు ప్రయాణం అది అని అనిపించింది.

కాని వింతగా వెళ్ళి లంకలమీద దిగిన వాళ్ళు లేకపోలేదు. వాళ్ళను వాళ్ల "లాంచీ"లను వాళ్ల పండగ షికార్లను చూచి నప్పుడు అదో మోస్తరుగా బాల్యంలో పడి నా నావ షికార్లు,

నా సాయంకాలం విహారాలు అవీ జ్ఞాపకము వచ్చాయి. ఎన్ని సార్లు నావ షికార్లు వెళ్ళేమో ఎన్నిసార్లు ఉదయం పూట సాయం సంధ్య మేం అదే నడకగా నడిచివెళ్ళామో తట్టసాగింది.

15-1-1957 సాయంకాలము నా తిరుగు ప్రయాణంలో కూర్చుని చూచిన దృశ్యమునే గురించి, అంతక్రితం నా షికారుల్లో చూచిన అందాన్ని గురించి వ్రాయనా యని నాకే తోచే మీమాంస ఏదైనా ఇప్పటి చూపునుండి వెనక్కు వెనక్కు వెళ్లడమే మంచిదనిపిస్తూ వుంది ఆలోచించినకొద్దీ నేడు ఏమా అంటే నే మఱచిపోతానేమో ? మళ్లీ మఱచిపోతానేమో !

వంతెన ఎగువన ఒక పెద్ద లంకమీద వెయ్యిమంది వున్నట్లుగా జనం కనిపించారు. అనతిదూరంలో నాలుగులాంచీలు తెల్లజెండాలతో నిలబడివున్నాయి. వాళ్ళు వాటిల్లోంచి దిగారని ఊహించాం మేం. మా లాంచీ అప్పటి కప్పుడే కొవ్వూరు వైపున నడుస్తూ వంతెన క్రిందనుంచి వెళ్ళింది. వంతెనకు దూరదూర మౌతూ వుంది. వంతెన ఒక సన్ననిత్రాటిలా కనిపిస్తూ వుంది. కాని స్తంభాలు ఏర్పాటుగా లెక్కించడానికి వీలుగా వున్నాయి. వంతెన మీద ఒక గూడ్సుబండికూడా నడుస్తూవుంది. బళ్ళు ఇంజెను వెనకాల గార్డుబండి అన్నీ సన్నంగా చిన్నవయిపోయి ఏకంగా వున్నట్లున్నాయి. నడక మాత్రం తప్పలే. నీరు నీటుగా వుంది. కెరటాలను విసురుతూ వుంది. ఆవలి తీరాన్నీ రాణ్మ హేంద్రవరపు చిహ్నాలు కనిపిస్తున్నాయి.

అప్పుడనుకొన్నాను "నావ షికార్లు మాని ఇప్పటి ప్రజలు తండోపతండాలుగా లాంచీ షికార్లు చేస్తూన్నారని. లంకమీద ఫలాహారం కంపెనీ అదీ బాగానే వుంటుంది. లంకలు కూడా

నూతనంగా ఏర్పడి కొద్దికొద్ది మొలకలతో ఇసుక తళతళతో వుంటాయి. అంటే కొత్తదనమే అనిపిస్తుంది.

లాంచీలమీద వెళ్ళేకన్న అందరూ అన్ని నావలు చేసుకు తెడ్లు వేసుకు వెడితే మంచిదనిపించింది. కాని ఇప్పటి ప్రజలకు తెడ్లు వెయ్యడానికి తగ్గ వోపికేది ?

అయినా పాత సాంప్రదాయము వాళ్లు మఱచిపోలేదని సంతోషించాను సంక్రాంతి పండగ రోజుల్లో ఒకమాౖరెనా గోదావరిమీద షైరు వెళ్ళడం నాకు సరదా ! ఇక భూమిమీద ఆ రోజుల్లో చెప్పడానికి వీలేలేదు. కోడిపందాలా ! సారంగధరుని మెట్ట ఎక్కి దిగడమా ? పేకలాడుకొనడమా ? ఎన్ని ఎన్ని అన్నీ ఆటలే ! అన్నీ పాటలే ! నిజంగా షికార్లు అంటే ఆనాటి షికార్లే షికార్లు !

మఱి ఈ వ్యాసం పూర్తిచేసేముందు ఒక్కసారి దిఙ్మాత్రంగా మా వెనుకటి చర్య కూడా పూరిస్తాను. దాంతో ఈ వ్యాసం సంపూర్ణం.

మేము సర్వసాధారణంగా 1907, 1908, 1909 ప్రాంతాన్ని ఒక పదిమంది విద్యార్థుల ముండేవాళ్లం. మా పని రాజమండ్రి చుట్టూ పర్యటన చేయడమే ! జయిల్ రోడ్డమ్మట సారంగధరుని మెట్ట యెక్కి అక్కడనుంచి ఏమన్నా కంభం చెరువు రోడ్డుకు దిగి యిండ్లకు వచ్చేసేవాళ్లము. లేదా కంభం చెరువు రోడ్డున వెళ్ళి ఆలారింగు రోడ్డమ్మట ఆర్యాపురంమీదుగా వచ్చేసే వాళ్లము. అప్పుడప్పుడు బొమ్మూరు మెట్టెక్కేవాళ్లం. ధవళేశ్వర తీర్థానికి వెళ్లేటప్పుడు డరోథీ స్టీమరో హెలెను స్టీమరో ఎక్కి వచ్చేటప్పుడు సంజవెన్నెల్లో నడిచేసి వచ్చేసే

వాళ్ళము. నడక అంటే బహు సరదాగా వుండేది. నావ ఎక్కడం అంటే ఇప్పట్లాగా లాంచీ ఎక్కేవాళ్ళం కాదు నావ అద్దెకు తీసుకొని దాన్ని మేమే నడిపి తెడ్లువేసుకొంటూ పోయేవాళ్ళం పాడుకొంటూ ఏ లంకమీదకో ? అక్కడదిగి తెచ్చుకొన్న పులిహోరో, బొబ్బట్లో తినేసి ఇన్ని నీళ్లు తాగేసేవాళ్ళం. ఆ రోజుల్లో కాఫీలు లేవు. తేనీళ్ళూ లేవూ.

ఈ షికార్లు వెళ్ళడం, తరువాత తరువాత నర్సాపురం వెళ్ళాకకూడా అలవాటు అయిపోయింది. ఒక్కొక్క షికారు రాకపోక కలిపి ఆరుమైళ్ళకు తక్కువ వుండేది కాదు. అప్పుడప్పుడు లిఖతపూడి, సీతారాంపురం వంతెన అదీ దాటి వెళ్ళినప్పుడు రాకపోకల పొడవు 8 మైళ్లుకూడా వుండేది. మఱి నర్సాపురపు గోదావరి మీద పడవవేసుకు వెళ్ళేవాళ్ళం. బహు ఆందంగా వుండేది. తిరుగ రాజమ్మహేంద్రవరం వచ్చాక కూడా చాలా కాలం ఈ షికార్లు మానలే ! వెడుతునే వుండేవాళ్ళం. మాపూరు అనగా శ్రీరంగపట్నం వెళ్ళినప్పుడు కొండ లెక్కడం పరిపాటే !

ఏవం విధంగా షికారు వెళ్ళడం అంటే ఒక ఆనందం నాకు. అది వ్యాయామం చేకూరుస్తుంది. ఉత్సాహానికి ఉత్సాహం పెంపొందిస్తుంది.

.... .... .... .... ....

## మా న్ సూ న్ స్పీ డ్

“ పుంతలో ముసిలమ్మ ” అంటే సర్వసాధారణంగా అందఱికీ అర్థమైపోతుంది మైలురాయి అని. “ మాన్‌సూన్‌స్పీడ్ ” అంటే

ఎంతమందికి అర్థమైందో? "ఋతుపవనవేగం" అని దాని అర్థం. దానినే "పొడుపుకథల" భాషలో గుర్తించాలిఅంటే ఏమనాలో నాకు తెలియకుండావుంది. ఈ వ్యాసం ముగించేలోగా ఏదైనా కొత్త సంగతి తట్టగలదేమో చూతాం!

"ఆ వారం అంతా నాలో స్పీడ్ కాంగ్రెసుస్పీడ్" అని వెనక ఒక వ్యాసం ముగించాను. అప్పుడు చూచిన మహానగరం కలకత్తా! అలాంటివారమే నేను గడపిన మరొక వారమూ: నేను చూచిన మరొక మహానగరమూ కలవు. ఆ వారము 19-10-1945 మొదలు 25-10-1945 వఱకు గల ఆరున్నొక్క-పూరారోజుల వారమూను ఆ నగరము మదరాసు—దక్షిణ—మహారాష్ట్ర ఇనుపదారికి. ఆదిమూలమైన మదరాసునగరము. నగరవర్ణనంకంటె నగర ప్రవేశవర్ణనం ఇప్పట్లో ఇతివృత్తమునకు సత్తువ ఇచ్చేని. ఆంధ్రుడైనవాడు మదరాసునగరం అంటే చెవి కోసుకుంటాడు. నేను ప్రవేశించిన ఆ రాత్రి మదరాసు పట్నంమీద ఆకాశాన్ని అతి నిర్మలంగా చూడగలుగుతూ పట్నంయొక్క పొడి పొడి తాౖరోద్దంట టకటకా జట్కా-మీద పోగలిగానూ అన్న సంగతి తలుచుకుంటే ఇప్పటికికూడా వింత వినోదం ముప్పిరిగొనిపోతూవుంటాయి, ఆ రాత్రి "డయిరీ" ప్రకారంచూస్తే కనవచ్చేది 18-10-1945 రాత్రి 10 గంటలు. ఆకాశాన్ని చూస్తే చుక్కలూ చూడ చక్కనైన శరత్కాల ప్రప్రథమ ద్వాదశీ తరుణ చంద్రబింబమూను!

కాని 17-10-1945 సాయంకాలం రాజమహేంద్రవరంలో ఇంటివద్ద నేను మంచిచేసుకు, మెయిలు అందుకుందామనే దృష్టిని రిక్షాలో కూర్చున్నప్పటి సంగతి! చలిగాలి

ప్రారంభించింది. అప్పటికప్పుడే చినుకులు పడుతున్నాయి. ఆకాశంఅంతా మహోట్టహాసంగా మేఘావృతమై వలాహకాదులు విచ్చలవిడి విహరిస్తూ వున్నంత విహ్వాలత్వం వెల్లడిగావిస్తూ వుంది. "వెళ్ళనా మాన్నా?" అని ఒక లిప్త ఊగిసలాడి, రిక్షావాణ్ణి "నిలు నిలు లాగకు" అని ఆపి, మళ్ళీ "లాగు" అని ముదలయిచ్చి బయలుదేఱాను. "ఉత్తరాలు తడియకుండా తీసుకుపోయే మెయిలుబండిమీద మనం మాత్రం తడియకుండా పోలేమా?" అని పెద్ద నిబ్బరము తోచింది.—ఇంతకూ మదరాసుకు రాజమండ్రీకి దూరం 361 మైలు మాత్రమే! "ఒక్కరాత్రి కన్నుమూసుకుంటే తెల్లాఱేసరికి మదరాసు!" అనిపించింది. మఱిన్ని "రాజమండ్రీకి—మదరాసుకు మధ్యను తెల్లాఱని రాత్రి అంటూ వుంటుందా?" అని అనిపించింది.

చెమ్మగానున్న రోడ్డంట రిక్షా లాగబడుతూన్న కొద్దీ, తరపచిత్తడి అయినకొద్దీ, నా మనస్సులో అదేమిటో "పెసిమిసమ్" కు బదులు "ఆప్టిమిసమ్" రేకెత్తసాగింది. "గర్జలా ఉఱుముతోంది బాబూ" అని రిక్షావాడంటే "ఉఱమనివ్వరా!" అంటూ ఉఱకవేసినట్టు సాగించాను రిక్షాను రాజమహేంద్రవరం పెద్దస్టేషనుదాకాను సకాలానికి, అనగా మెయిలువేళకు అన్నమాట.

దారిలో ఏ విధమైన విలియ వైపరీత్యము గాని, అకాల మృత్యువు గాని రాలేదు! కాని స్టేషన్ భవనంలో దిగి ఇటూ అటూ తిలకించేలో కూలీవాడు "బాబూ! మెయిలుకా?" అన్నాడు. "ఏం?" అన్నాను. "ఇంకా ప్యాసెంజరే రాంది, మెయిలూసు ఏం చెప్పను బాబూ! కూకుంటే వెయిటింగు

రూములో కూకోండి ! ” అన్నాడు. గడియారం వంక చూచాను. మెయిలు రావలసిన “ టయ ” మయింది....ఆకాశం పిడుగడ్డట్టు మెఱిసింది. కూలివానివంక నేను గ్రుడ్లుఱిమాను. వాడు తిన్నగా సామాను వెయిటింగ్ రూములో జాగ్రత్తపెట్టి “ తమరు ఇక్కడ దయ సేయండి ! నే కనుక్కొస్తాను. తమ రొక్కరే నేటి ప్రయాణీకులు ఈ స్టేషనునుండి వెళ్ళేవారు. బాబులుకు వానా వఱదా ఆటంకాలు లేవు లాగుంది ” అన్నాడు. కూలీవాండ్లలో కొందఱు కొందఱు అతి వాగుడుగాండ్లుంటారు. ఆలాంటివాళ్ళల్లో వీడొకడు అని అనుకొని వాణ్ణి సామాను చూస్తూవుండమని నేనే తిన్నగా స్టేషనుమాస్టరుగారి దగ్గఱకు వెళ్ళిపోయాను.

స్టేషన్‌మాస్టరు, దీపాల నాగమ్మను “ వెలిగించరా హరికేన్ లాంతరు. కర్రెంటు పోయినట్టుంది ” అని అంటున్నాడు. టెలిఫోను కొమ్ము ఎత్తి “ హల్లో ” అని ద్వారపూడి పిలుస్తున్నాడు. అటునుంచి జవాబు లేదు, “ మెయిలు ముందా ? ప్యాసెంజరు ముందా ? ” అని అన్నాను, నిరాశాపూరితుడై అతగాడుంటే. “ ఆ సంగతే కనుక్కుందామని పిలిస్తే పలకడం లేదు ఒక స్టేషనూ. వాల్తేరునుంచి కడియందాకా ఒకే రొద ఒకే గాలీ విసురుతూన్నట్టుంది ” అన్నాడు. అంటే “ తూర్పు గాలా ? ” అన్నాను. “ ఏ దిక్కూ కనబడ్డం లేదు నాకిప్పుడు ” అన్నాడు అతగాడు. మఱి వొంగి వొంగి, ఇద్దఱం కలిసి సన్న చినుకు గుండా లైనమ్మటే చూచేం ! లైను బాగానే వుంది బొమ్మూరు మెట్టదాకా ! “ బహుశా ప్యాసెంజరే ముందొచ్చేటట్టుంది ” అని అంటూ తన గదిలో గణ గణ శబ్దమైతే స్టేషను మాస్టరు పరుగెత్తేడు. మరినాలో వితర్కింపు, “ప్యాసెంజరుమీద

పోతేనో ?" అని. "ఏదో బండిలో ఎక్కి కూర్చుంటేనే మెఱుగు. ఎంత వాన కురిసినా ఎంత గాలివేసినా, ఇంటికంటె గుడిపదిలం అన్నట్లు స్టేషన్‌కంటె రైలే మెఱుగనుకున్నాను. రేపటి క్కాకపోతే ఎల్లుండికైనా మదరాసు చేరకపోతామా ? అని తలపోశాను. పట్టాలు ఇనప్పట్టాలు, ఎంత గాలి వేసినా ఎగిరిపోవు అని నా ధీమా !

ఎప్పుడు రెక్కి వాలిందో, ఎప్పుడు ప్యాసెంజరు వచ్చిందో, ఎప్పుడు టిక్కెట్టు నేను కొన్నానో, అంతా ఒక్కి అరగంటలో జరిగింది. ప్యాసెంజరు ఎక్కిగలిగాను. అది ఆగిన వెంటనే ఆట్టే తడియకుండా, పెట్టెపెట్టి తడుముకుంటూ నున్నగా మెత్తగా ఒక కంపార్టుమెంటు కనిపిస్తే "ఇదిరా! పరుపుల పెట్టి" అని కూలీని కేకేస్తూ.—కూలీని పొమ్మన్నాను డబ్బి లిచ్చేసి. చీకట్లో ఒక్కిణ్ణి కూర్చున్నాను. తూర్పువైపు ఆ అరకు తలుపులు వేసేసి ఉన్నాయి. జల్లు, జడి, చలి, అప్పటిమట్టుకు అనిపించలేదు. కాని "మెయిలు దీన్ని తొక్కియ్యదా ?" అనే సమస్య కాళ్ళా వ్రేళ్ళా సంకెలవేసి, మనస్సును ఊగిసలాడించింది కొంతసేపు.—అంతలో ఎంజిన కూసింది. గంట మోగింది. పచ్చలాంతరు గార్డు చూపాడు. కూర్చున్నబండీ కుదుపిచ్చింది. "అదొస్తుందో రాదో అసలు! దీన్నెక్కిడమే మంచిపని చేశాను" అని అనిపించింది. కునుకుకోసం బిచాణా విప్పాను, మఱి చేసే పని లేక! కిటికీలన్నీ తలుపులన్నీ మూసేశాను.

అయితే కడసారి వీడ్కోలు అదే కావచ్చునేమో అని అనుకుంటూ, రాజమహేంద్రవరం కేసి ఒకసారి చూదామని పడమటెంపు కిటికీ బిక్కి బిక్కి ఎత్తేను. రంయని పడమటి

గాలి తిరిగి అదే జల్లు! అదే జల్లు! రైలు గోదావరి స్టేషనులో నిలిచిపోయింది. నేను తలుపులన్నీ తిరుగ వేసుక బండిలో కూర్చున్నాను. "వంతెనమీద బండి నడువదేమో? నడిస్తే ఆ గాలికి పడిపోతుందేమో? కింద గోదావరి ఎంత లోతుందో?" ఇవీ నాలో నేను వేసికొన్న ప్రశ్నలు ఆపొద్దు! వేసికొని పక్కమీద పొడి జాగా చూసుకుని, ఒక్కణ్ణే క్రిక్కిటిసి కూర్చున్నట్టు ముణిచిపెట్టుకు, ముక్కున కొనయూపిరి పెట్టుకున్న వాడిలా కిక్కురు మనకుండా కూర్చున్నాను. తపస్సు దేన్ని గురించి చేదామన్నా నాకు ఏమీ కనిపించలేదు. దేవుడే లేడనిపించింది. వంతెన ఎక్కేముందు తగిలే "ఆర్చి" మీద వుంది ఇంజన్. ఆర్చి క్రింద రోడ్డు "జి. టి. ఆర్" అనగా గ్రాండు ట్రంకురోడ్డు. తెనుగులో చెప్పాలిసి వస్తే రామేశ్వరంనుండి కలకత్తా మీదుగా కాశీ తీసుకుపోయే మహారస్తా. గ్రాండ్‌ట్రంకు ఎక్స్‌ప్రెస్ పొయ్యే రైలుపట్టాల దారి దగ్గర గాని దక్షిణాదికీ ఉత్తరాదికీ గ్రాండ్‌ట్రంకురోడ్డు ఎలాచూచిన చుట్టే. అది హిందూదేశం మీద మధ్యగా పోదు. కోస్తా అమ్మటే పోయి, కలకత్తాదగ్గఱ పడమటకు మళ్లుతుంది. బహుశా ఆ పోవడం పోవడం ఆ "అటకం" దాకా పోతుందనుకుంటాను. అదే తూర్పువైపు మళ్ళితే బహుశా "చిటకం" దాకా పోవచ్చు. వంగదేశంలో చిటకం, పాంచాలంలో "అటకం" మఱి కటకం అసలు రస్తామీదే వుంది బరంపురానికి—కలకత్తాకు మధ్య మహానదిమీద. ఇదంతా నీ ముక్కేదిరా అంటే "అసావాదిత్యో బ్రహ్మ" అని చూపిన తీరే అని అనుకోకండి పాఠకులు. ఒంటరిగా కూర్చున్న నా ముందు ఆ తుపాను సమయాన్ని

పఢ్నాలుగు భువనాలయొక్క రహదారీ మార్గాలు కనిపించినప్పుడు భారతవర్షంలోని ఈ మహారస్తాను ఏలా విస్మరింపగలను ?— ఉన్న దున్నట్టు మీ యెదుట బెట్టాను. కాని రైలుమాత్రం ఒక అంగుళం కదలలేదు. గంట కొట్టినా ఈలవేసినా, పచ్చజెండా చూపినా, ఎదర రెక్కవాల్చినా ఎన్ని చేసినా తుదకు ఇంజిన్ ఎంత గింజుకున్నా ఎదరగాలి తీవ్రతకు అలా నిలుచుండి పోయింది. తలుపు తీసినా తలుపు వేసినా ఒక్కలాగుంది చీకటి !

అంతకంటే ఎక్కడి మేఘం అక్కడ ఉక్కిరి బిక్కిరై తభీతభీ ఊడిపడ్డట్టు ఓడికగా వర్షింప దొడగింది. నా గుండెల్లో రాయిపడింది. రాయిపడింది అంటే ఉత్తరాయికాదు. అంకెలతో వున్నరాయి. ఆ అంకె ఏమనుకున్నారు ! 361 మూడువందల అరవై ఒకటి. అది గ్రాండ్‌ట్రంకు రోడ్డున అక్కడ పాతిన మైలురాయి. మద్రాసు అక్కడకు అన్ని మైళ్ళుందని చూపిస్తుంది. ఆ రాయివచ్చి నా గుండెల్లో అమాంతంగా పడినట్టయింది. ఎలా లేచివచ్చి పడింది అని అడక్కండి పాఠకులు. గంటకు 100, 150 మైళ్ళ వేగాన్ని విసరే ఝంఝకు ఏది లేచి వచ్చి ఎక్కడ పడదు ?

మర్నాడురాత్రి పదిగంటలకు మదరాసులో నేను దిగిన అనంతరం కూడా నా మనస్సులో నిలిచి "ఆ రాయి ఇంకా అక్కడ రోడ్డుమీద వుంటూ మైళ్ళు సూచిస్తుందా ? లేక అనంతాకాశంలో లీనమైపోతూ మదరాసు రాజమహేంద్రవరం మధ్యనున్న దూరాన్ని హరించివేసి వుంటుందా ?" అనే విచింతనమే! నమ్మండి ! ఋతుపవనానికి అంత వేగం వుంది. అదే నేను ఈ వ్యాసంకు మకుటంగా పేరుపెట్టిన "మాన్‌సూన్‌స్పీడ్"

అన్నా! 361 మదరాసు అని సూచించే గ్రాండ్ ట్రంక్ రోడ్డు మైలురాయి గాలికెగిరి నాగుండెల్లో పడడమే "మాన్‌సూన్‌స్పీడ్!"

పైని వ్రాసిన నా అనుభవం అంతా ప్రత్యక్ష కృత్యం! సత్యం! నిత్యం! కాని కాలమానం తిరుగుతూనే వుంది. దాని గుండెల్లో ఏ రాయీ పడ్డట్టు లేదు. తెల్లాటి 7 గంటలకు నేను తలుపులు తెఱచి చూడ్డంలో చిన గంజాం స్టేషన్ కనిపించింది. బతుకు జీవుడా! ఈ దాకా కొట్టుకొచ్చామా అన్నాను గట్టిగా ఒక్కసారి.

ఆ దాకా నన్నెఱుగని ప్రక్క అరలోని తోడిప్రయాణీకుడు తటాల్న లేచి "ఎందాకా వచ్చాం?" అన్నాడు. "చిన్న గంజాం దాకాను" అన్నాను. అతడి మణికట్టు గడియారంలో ఉదయం ఏడైనా ఆకాశం ఇంకా బూడిదరంగుగానే వుండి సద్యః సూర్యోదయం అవుతూ వున్నట్టు అనిపించింది. గాలి చినుకు ఇంకా గడబిడగానే వుంది. జీలుగు మోకొకటి స్టేషన్ అవల ఆరుబయట ఊగిసలాడుతూ వుంది. శివమెత్తిన దానిలా! కనిపించే ఒక కట్టడము యొక్క గోడ వొకటి నాని నాని అప్పుడే కూలిపోయింది. అయినప్పటికీ ఎంజిన కదిలింది ఏలాగైనా మదరాసు చేరి తీరాలని! మెయిలెక్కడో మా ప్యాసెంజర్ను తప్పుకు వెళ్ళిపోయిందన్నారు. మెయిలు ముందు వెళ్ళడం మంచిదే పైలట్‌బండిలా పని చేస్తుంది అన్నాను. దాని తరువాత ఇది వెళ్ళడమే సేఫ్ అన్నాను. తెల్లాటాక కబుర్లైన్నైనా చెప్పొచ్చు చూడండి. బిట్రగుంట ఆ ప్రాంతానికి వెళ్ళేసరికి మేఘాలు వట్టిపోయి పరుగెడుతూన్నట్టు కాపడింది. పరుగెడుతూన్నవి మేఘాలా సూర్యుడా?

అనే సందేహం కూడా వేసింది—మఱి మధ్యాహ్నానికి కాబోలు గూడూరు చేరాం—అక్కడితో ఆతుపానుభీభత్సం అంతమైనట్టుంది. బండికి కొంచెం వేగం పట్టింది. క్రమక్రమంగా బేసిన్ బ్రిడ్జి చేరేసరికి అసలు వానే కురిసినట్టు లేదు. సంధ్యారాగం గడచి చక్కని చుక్కలు పొడగట్టసాగాయి ; మదరాసు చేరేలో శరత్కాల ప్రప్రథమ ద్వాదశీ తరుణచంద్రుడూ నేనూను ! 18-10-1945 రాత్రి పదిగంటలైంది. ఆ సంగతి తొలుతనే పాఠకులచెవిలో ఊదేశానుగా.

మఱింకా అనుకున్నాను. "అమ్మయ్యా ! తెనుగుజిల్లా లనే శనిగ్రహం వదలిపోయింది. మదరాసులో పడ్డానురా !" అని, అనుకుంటూ సువిశాల శుభ్రమైన ఆకాశాన్ని మదరాసు మీద చూచేను. మౌంట్‌రోడ్డు మాంచి మదమెక్కిన ఏనుగులా కనిపించింది. దానిమీద టకటకా మా జటక్ గుఱ్ఱం పోతూవుంటే ఎలావుంది ? "విస్కీ-వైట్‌హార్స్" లాగుంది.

కాని మర్నాడు తెలుసుకుంటే మేము వచ్చిన రైలే నాటి ఆఖరురైలనీ, మఱి ఎక్కడిరైళ్లు అక్కడే బంద్ అయిపోయాయని పుకారు. ఇంకా లోతుగా పూడిస్తే తేలింది—"ఎమ్. ఎస్. ఎమ్. ఆర్ వాత్తేరు నుండి గూడూరుదాకా అన్నీ గండ్లేనని—మనుష్యులు తిరుగపోయేందుకు వీల్లేదని—" ఇంకా వింటే వెల్లడికావచ్చిన సంగతి—"తుపాను చెలరేగిన పొడుగునా చెట్లు అన్నీ కూలిపోయాయి అని-పక్షు లెన్నో చచ్చిపోయాయి అని ; పశువులన్నీ విహతమైనాయి అని,—పంటలన్నీ వినాశన మైనాయి అని.—

ఇఖ పుంతలో ముసలమ్మలను గురించిన వృత్తాంతం అడిగేదేమిటి అని అనుకున్నాను. రోడ్లకురోడ్లు గండిపడిపోయాక

రోడ్ల పొడుగుచూపే మైలు రాళ్ళుంటాయా అని అనిపించింది. అయితే ఎంతసేపూ, మనస్సులో మదరాసుకు—రాజమండ్రికి మధ్యను వున్న మైలురాళ్ళే జ్ఞాపకం వచ్చేవి. అవి ఎన్ని అని అనుకొన్నప్పుడల్లా నెల ముప్పై రోజులు లెక్కిస్తే 12 నెలల ఏడాదికీ సరిపోయే 360 రాళ్లుగా తోచి పైనొకటి మిగుల్తూ వచ్చేది. ఆ ఒక్కరాయి 17-10-1945 రేయి నా గుండెల్లో పడ్డ 361 నెంబరును మైలురాయిగా వచ్చేది.

అది ముసిలమ్మల్లో ముసిలమ్మల్లా తోచేది. "మూన్ సూన్ స్పీడ్" కు ఎగిరివచ్చి నా గుండెల్లో నిలిచివుండే ఈ మద రాసుదాకా నన్ను వెంటాడించి అని అనిపించేది. తెనుగుజిల్లాల-పు-పురాతనపు రాయిగా-పునాది రాయిగా తట్టేది. ఆ ముసిలమ్మ కాలంచేసినా అనగా దాన్ని మనం మఱచిపోయి నట్టాయినా రాజమండ్రికి మదరాసుకు మధ్య దూరమేలేదు. కాలమే లేదు. ఆ రెండూ లేనప్పుడు మదరాసే రాజమండ్రీ రాజమండ్రీనే మదరాసు.

ఈ దృష్ట్యా ఒకవారం వారం మదరాసే రాజమండ్రి అన్నట్టు తిరిగేశాను. 19-10-45 తేదీని రేడియోస్టేషనులో నా గీతికలు ప్రసారం చేశాను. 20-10-45 న అడయార్ ఆవల కంటాలాటిస్ బ్రిడ్జిరోడ్డే వెళ్ళా. 21-10-45 న మైలపూర్‌లో కొత్తరకం బస్సు ఎక్కాను. 22-10-45 జార్జిటౌన్ హడావిడిని తిరిగాను. 23-10-45 న రాయపేటలో నిలిచాను. 24-10-45 న విజ్ఞానసమితి వీక్షించాను. 25-10-45 న పరసువాకం చేరాను. అక్కడనుంచి ఆ రాత్రికి సెంట్రల్. మర్నాడుదయం రాజమండ్రి. మొత్తం రు 35/లు వెచ్చించాను. ఆ రూ 35/లులోను రు 24/లు రానుపోను ఇంటర్ టికెట్టు ఛార్జికే.

రాజమండ్రీలో టిక్కెట్టు ఇస్తూ అంకె చూస్తినిగదా; దూరం 361 మైళ్లు. పుంతలో మునిలమ్మమీద అంకె 361. తుపాను చెలరేగినా చెడనిదీ అంకె వొక్కటే అని అనుకొన్నాను. కాని మదరాసులో ఆవారం నన్ను విసుగులేని త్రిప్పట త్రిప్పింది ఏ అంకె? ఏ రాయి? అంకెలేని మగరాయి! దానికోసమే నేనాదాకా తఱుముకెళ్ళిన "మాన్‌సూన్‌స్పీడ్" అని అనిపించింది.

.... .... .... .... ....

## ఇంగ్లీషు చదువూ ఫరంగీ వేషం

రాజమహేంద్రవరములో ప్రభుత్వమువారు కట్టించిన కట్టడాల్లో "బోధనాభ్యసన కళాశాలా" భవనం చాలా పెద్దది. అపురూపమైనది అని నా అభిప్రాయం.

1906-న ఉత్తరసర్కారుల్లో అదొక్కటే ఎనిమిదవ తరగతినుండి పదవతరగతి వఱకు "ఆదర్శ పాఠశాల" అనే పేరుతో అంతర్భాగము గలిగివుంటూ వుండిన విద్యాసంస్థ. ఏమా అంటే ఎనిమిదవ తరగతి నాలుగుగదులు, తొమ్మిది మూడు గదులు, పది మూడు గదులు ఆబరించుకొని వుండేవి. అన్ని గదులున్నాయా అని ఆశ్చర్యపోతున్నారు లాగుంది పాఠకులు. ఆశ్చర్య పోనక్కరలేదు. నిజంగా వుండేవి. ఉండడంలోను "పక్కాబిల్డింగు"కు సంబంధించిన గదులవి. రాతిగోడలు, రంపానకు తెగని దూలాలు! అన్నింటికంటే అతివిచిత్రం పెద్ద మేడ! మేడ ఎక్కడానికి దుక్కల్లాంటి మెట్లు! నాటికీ నేటికీ

ఒక్కటాకీగా, పిడుగుపడ్డా చెక్కుచెదరని భవనం ఆ నగరంలో అదొక్కటే అని చెప్పొచ్చు.

దాని ఆకారం, కిరస్తానీ మతస్థులైన ఆంగ్లేయుల పరిపాలనా విధానంలో ఏర్పడ్డ కారణంగా 15-8-1947 అనగా భారతస్వాతంత్ర్య శుభవాసరమువఱకు, "క్రాస్" రూపం ధరించి వుండి ఇప్పుడు "క్రాస్" అనగా "శిలువ" రూపం విసర్జించి, గరుడపక్షి రూపం తీసికొన్నది అని నా వూహ. దక్షిణపు వైపునకు ముక్కు అవితే, ఇటో రెక్క (వింగ్). ఆటో రెక్క (వింగ్). ఉత్తరం వైపునకు తోక—భూమిమీద నుంచి అలా మీదమీదకూ లేచిపోతూవున్నట్టుండి వ్యామోహం గొల్పక మానదు ప్రాతవిద్యార్థుల కాకట్టడం నేడు.

కట్టడానికి చుట్టూ అంతో ఇంతో విశాలమైన ఆటస్థలం వుంది. ఆ స్థలంలో పక్కగా నాలుగో అయిదో శిరీషవృక్షాలు వివృద్ధములైన వివిరుద్ధములైనవి ఉన్నాయి. విరుద్ధములైనవి అని ఎందుకు అంటూవున్నానూ అంటే అంత ముసలి చెట్లూ, వింత వింత మెత్తని పువ్వులు ఏటేటా పూస్తూ, స్కంధంచూపే మోటుదనంకు, ముదిమికి పెళుసుకు డొళకకు కేవలం వ్యతిరేక ప్రతిక్షణ ప్రసవభావాలన్నట్టు గోచరిస్తాయి. వాటినీడను నడుస్తూ వుంటే ప్రతి జరఠునకు, వాలాయం ఏదో కుఱ్ఱదనం, ఏదో క్రొంగ్రొత్త సుకుమార నవనవోన్మేష కిశోర వినోదం అంకురింపక మానవు.

క్రీ. శ. 1946 వ సంవత్సరంలో ఒకనాటి యుదయం పదిగంటలకు ఆ చెట్లయొక్క జాడ జాడ నీడల్లో అడుగులు వేసికొంటూ నేనూ నా రెండవ కుమారుడు చిరంజీవి—నడుస్తూ

వున్నాము గబగబా! వాణ్ణి త్వరగా తీసికొనివెళ్ళి నాలుగవ తరగతిలో ప్రవేశపెట్టాలి, ఆ పెద్ద కళాశాలలో.

భవనం సినిమా దృశ్యంలా ప్రాంగణపు టుద్యానవనపు గొమ్మలసొంపుగుండా దోబూచు లాడ్తూవుంది. అంత గబగబా నడుస్తూ వున్న నడక మాని మా వాడు నన్నూ కూడా ఆపి,—"తన్ను చేర్పించేది ఆ పెద్ద మేడలోనేనా?" అని అడిగాడు. "ఇంకా పరీక్ష ఇవ్వలేదు. మేడా గీడాను నీకు?—నడువు త్వరగా నడువు—మొదటి గంట కొట్టినట్టున్నారు" అన్నాను. వాడు పరీక్ష అన్న మాట వినిపించుకోకుండా. చెట్ల కొమ్మల వంక చూస్తూ "పువ్వులు చూచారా? ఎంత ఎఱ్ఱగా, కుచ్చుల బొగడల్లా వున్నాయో! నా కొకటి కోసి ఇవ్వరూ!" అని అడిగాడు.

"నాకు మాత్రం అందుతాయిరా?" అని ఎగిరాను పైకి చూస్తూ. నేనున్నూ ఆ చూపులో పరీక్ష సంగతి మరచి పోయాను. ఏ పువ్వూ అందలేదు. రెండవ మారు ఎగిరాను. మూడవ మారు ఎగిరాను, మూడవసారి కాబోలు, ఒక పువ్వు ఏ కారణంవల్లనో దానంతట అది, సరికొత్త పూసిందే వూడి పడింది నా దోసిట్లోకి, తొడిమైనా కందనిదీ, పుప్పొడి అయినా రాల్చనిదీ; ఎప్పటి పువ్వైతేం? అప్పటిదిలా కనిపించే టప్పుడు! దాని పుట్టు పూర్వోత్రాలు దాన్ని అడగడానికి నేను పుణికితేగా? అదే పడింది దానంతట నా దోసిట్లో దేవతా వరంలా.

"వారేవ్! ఇదిగోరోయి! నీ అదృష్టముకొద్దీ ఒక పువ్వు అందుకోగల్గాను!" అన్నాను గొప్పగా కుఱ్ఱనితో

దంభంగా. పిల్లవాడు కాస్తో కూస్తో తెలివైనవాడు కావడంచేత "నేను చూచాను! మీరు అందుకోలేదు. మూడుసార్లు ఎగిరినా అందుకోలేకపోయారు" అన్నాడు. "మరెల్లా వచ్చింది?" అన్నాను. వాడున్ను తెల్లబోయాడు.

గట్టిగా "సూర్యనారాయణా!" అని కేకవేశారు పాఠశాల్లో. "హాజరు సార్!" అని మా వాడు నన్ను విడిచిపెట్టి అటు పరుగెత్తాడు. హైరోడ్డుమీద మోటబస్సూ, మోటారు కార్లు వుంటాయి. పిల్లవాడికి ప్రమాదమేమో అని వాణ్ణి ఆ పాఠశాలావరణలో ప్రవేశపెట్టేవరకూ అనుగమించానేగాని, వాని పరీక్ష పత్రము నన్ను వ్రాయనివ్వరుగా. వాడే వ్రాసి, వాడే జవాబులు చెప్పి కృతార్థుడు కావాలి.

ఇటు అటూ చూచాను. వాడప్పుడే పాఠశాలా భవనంలో ఏ మూలనో ఇరుక్కుని కూర్చుని వుండి వుంటాడనుకున్నాను. అంతలో వాడు తిరిగి వచ్చి "నన్ను ఎడ్మిట్ చేసుకున్నారండో నాల్గవ క్లాసులో నాన్నగారూ! మీ పేరెందుకో అడిగారు హెడ్మాస్టారు, అడిగితే నేను చెప్పాను—మీరూ ఈ బడిలోనే చదువుకున్నారటగా! ఎప్పుడూ చెప్పారుకాదేం నాతో?" అని అడిగాడు అంతక్రితం ఎప్పుడో ఆ భవనం తాను చూచినట్టు, తానప్పుడే దాని పాత కాపైనట్టు అతి చనువుగా.

ఇకక్కణ్ణుంచి అచ్చెరువుగా అతిచమత్కారంగా నా మనస్సులో వెళ్ళిపోసాగినాయి వూహాలు: "1906 తో నేనా భవనంలో తొలుత ప్రవేశించింది ఎనిమిదవ తరగతిలో. 1946 లో నీవు నాల్గవ తరగతిలో ఎడ్మిట్ అయినావు" అన్నాను వానితో. "ఏమిటి కారణం? నన్ను నాల్గవ తరగతిలో చేర్చుకోడానికి,

మిమ్మల్ని ఎనిమిదవ తరగతిలో చేర్చుకోడానికి?" అని అడిగాడు వాడు. "అప్పుడున్న నేను ఇప్పుడున్న నీకంటె జేనెడు పొడుగుండేవాణ్ణి! తెలుసుకో!" అని జవాబు చెప్పాను. "జాన?" అంటే అన్ని అడిగాడు. "జేన" అంటే అని చూపించాను అయిదు వ్రేళ్ళను సాచి చిటికెన వేలు వాని బుజ్జ మీద నిలబెట్టి "అవితే నేను—ఒక వేలు నాలుగవ తరగతి, రెండో వేలు అయిదో తరగతి, మూడో వేలు ఆరో తరగతి, నాలుగో వేలు ఏడో తరగతి, అయిదో వేలు ఎనిమిదో తరగతి-ఇప్పటికంటె ఒక జేన ఎదిగితినా ఎనిమిదో తరగతికి నేను ఫిట్" అన్నాడు గెంతుతూ.

"ఓ ఇడియట్! ప్రతీ సంవత్సరం పరీక్షలు ప్యాసు అవ్వాలోయి" అని వాణ్ణి వాత్సల్యంతో "పాట్" చేసిన వాణ్ణయి, అనగా తట్టిన వాణ్ణయి, వాణ్ణి గుర్తుగా నఖశిఖ పర్యంతం చూచాను. కంపెనీ కణుజు షూస్, కాకీనిక్కర్, సైకిల్ బ్లూ బుష్ కోటు, సెలూన్ కట్ క్రాప్ వాడూ ఏలా వున్నాడు—1999 వేషంకు బాబులా వున్నాడు.

వెంటనే నాలో ప్రదర్శింపునకు వచ్చింది, 1906 లో నేను ఆ పాఠశాలా భవనం ప్రవేశించి నప్పటి నా దిరీసు నా పోసు—నా కా రోజుల్లో రెండు కాళ్ళకు రెండు వెండి కడియాలు గుల్లవి వుండేవి. అవి కనబడకుండా మేజోళ్ళు వేసేసి, నాటు గొడారి వాడు కుట్టిన గొడ్డు చర్మపు బూట్లు, అమ్మమ్మ కుట్టిన బొందు లాగు, అయ్యకు చాలని పాత కమీజు, కఫ్సు మీదకు తీసినప్పు డల్లా మెరుస్తూ వచ్చే పలకల బంగారపు కడ్డీ మురుగులు, నెత్తి మీద నోఎగుడు దిగుడు మొఖమల్ టోపీ—ఎగుడు దిగుడు

అని ఎందుకు అనవలసి వస్తూవుంది అంటే, గుప్పిటి కొలది జుత్తు ముడి వెనుకతట్టు ఆటోపీలో డాగేలా కుక్కేశాను—ఇంకా పిల్ల జునపాలు అలా మెడమీద వ్రేలాడే వుండేవి; మరిన్ని రెండు చెవుల్ని రెండు పోగులు, కమ్మచ్చు తీసినవి, కనకపు బిళ్ళలు కలవి, తీగ అతుకున అల్లిబిల్లివి మెలేసుకు పోయినవి! ఇన్ని ఉండేవి!

క్రమ క్రమంగా ఆ పాఠశాలా భవనంలో పాశ్చాత్య విద్య నభ్యసించినకొద్దీ పైని వివరించిన సాంప్రదాయపు ఆభరణాలు నా వొంటిమీదనుండి ఏలా నేను తొలగించి విసర్జించిందీ ఆ కథ పట్టు అంతా జ్ఞాపకం వచ్చింది.

1906 కు పూర్వం "డ్రిల్" ఎఱుగుదును గాని 'స్పోర్టు' ఎఱుగను. 1906 లో కొత్తగా కాలి బంతి ఆట ప్రారంభించాను. కారణం ఏదో ఆట ఆడక తప్పదని నిర్బంధం వుండేది ఆ పాఠశాలలో. కాలి బంతి ఆటకు కడియాలు ఎంత మాత్రం అనుకూలంగా వుండేవి కావు. మైకల్ మాస్ సెలవులకు మా వూరు వెళ్ళినప్పుడు అటో పాలికాపును ఇటో పాలికాపును కూర్చోమని వాళ్ళచేతికో జనప నార పలుపు ఇచ్చి, కడియాల్లోకి దూర్చి సాగదీసెయ్యమన్నాను. గమ్మత్తుగా ఊడి వచ్చేశాయి రెండు కడియాలూను. అంతలో మావా ళ్ళెవళ్లో, పినతండ్రుల్లో వొకరో, తండ్రో, వచ్చి "కడియాలు తీయించేస్తే తీయించేసుకున్నావుగాని మురుగులు తీసేసుకోకురా!" అని ఆజ్ఞాపించారు. నేను వాళ్ళంత పెద్దవాణ్ణి కాకపోయినా వాళ్ళకన్న పెద్ద చదువు చదువుతూన్నాననో ఏమో నేను గావించుకున్న మార్పునకు వాళ్ళు అంగీకరించారు. మా పెద్దవాళ్ళ కాళ్ళకు మగవా ళ్లెవళ్లకూ

కడియాలు లేవు కూడాను. కాని మా పెద్ద పినతండ్రిగారి చేతుల్ని గల్ గల్ బంగారపు కడియపు మురుగు లుండేవి. మరిన్నీ చిన పినతండ్రిగారి చేతుల్ని చనిపోయేవఱకూ కూడా గోడి మలచిన పచ్చని మురుగు లుండేవి. "మాకు ఉన్నాయి చూడు!" అని చూపించారు వాళ్ళ వాళ్ళ ఆభరణాలు ఆ పెద్ద మగవాళ్ళు. "అంతకంటె శిక్షించలేదు" అని సంతోషించి, ఒక పర్యాయం నా మణికట్ల మురుగులు చూచుకొన్న వాణ్ణయి కడియాలు ఆ పెద్దవాళ్ళకు ఒప్పజెప్పేశాను. తరువాత వారు కరిగించి కంచమే చేయించారో, మంచపు తలాపు పెట్టెలో ఉంచే వేశారో—కలిమిలేములు కావటి కుండలు అన్నట్టు అవి ఏమయ్యాయో మఱి నా కడియాలు నా కంట పడలేదు.

ఇఖ మురుగుల చరిత్ర చెప్పమన్నారా! మైకల్‌మాస్ సెలవులయి తిరిగి పాఠశాలకు వచ్చి చదవడంలో రసాయన శాస్త్రపాఠంలో పాదరసాన్ని గురించిన ప్రయోగమొకటి వచ్చి, చేస్తూవుంటే ఉపాధ్యాయుడాలా నా చేతిలో ఒక పాదరసం బిందువుంచి దాని లక్షణాలు గమనించమన్నాడు. అది అరచేత నల్లా ఇల్లా అనడంలో గెంతి అదిజారి నా మణికట్టుకు ఒక మురుక్కుమధ్య నిరుక్కుంది. బంగారాన్ని తినెయ్య మొదలెట్టింది. మురుగు తెలుపెక్కింది. నేను అహాశంగా ఏడుపు ముఖం వేశాను. "వెంటనే మీవాళ్ళతోచెప్పి ఆ మురుగులు తీయించివేసుకు మఱి రేపు క్లాసుకురా!" అని యొజ్జ లాజ్ఞాపించారు. ఈ సంగతి ఊరంతా పొక్కినంత పని అయింది. ఫలితం? నా మణికట్లనుండి మురుగులు లాగివేయబడినాయి. నా మణికట్లు చిన్నబోయినాయి.

ఇక మూడో ఆభరణం చెవిపోగులమాట కూడ చెప్పేసేస్తే మీకూ నాకూ మొండితేలు బాధ వుండబోదు.

పాఠ్యగ్రంథంలో ఇంగ్లీషు సంభాషణ పాఠం "హ్యాబర్ అండ్ ఆర్థర్" అన్నది ఒకటి మాకారోజుల్లో వుండేది. దాన్ని నాటకంగా ఆడాలి. "నీవు ఆర్థరివి" అని నన్నుండ ఎంచారు. మరో అతణ్ణి హ్యాబర్టుగా ఏర్పాటు చేశారు. తొలిరోజున రిహార్సలు. హ్యాబర్టు ఎత్తిగ్గాల్సిన ఇనుప ఊచలు రెండు తెచ్చి నా కళ్ళల్లో గుచ్చెయ్యాలి. నా కప్పు "వికటాంబకముల్ శతపత్ర జైత్రముల్!" గుచ్చేశాకా చెవిపోగులు మూసల్లో మల్లే కరిగిపోగలవు! రిహార్సల్ కాబట్టి గుచ్చెయ్యలేదను కున్నాను. మర్నాడు అసలు నాటకము వేసేటైముకు మావాళ్ళతో చెప్పాను. "చెవిపోగులు తెంపెయ్యవలసి వుంటుం" దని. తెంపెయ్యటోడు నీ పుణ్యమాయిరి! అని కంసాలికి కబురెట్టి కటకట్లాన కత్తిరింపించి, చెవిపోగుతే కరిగిపోయేటప్పుడు జుత్తు జునపాలు తెగ్గాలిపోవా అని పనిలో పని వాటినికూడా తీయింపించేశారు. దానితో అన్నత్తైన దొరల పిల్లవాడిలా తయారై వూరు కున్నాను. మరి నాటకవేషంలో నన్ను వెంకట్రామప్పు అని వొక్కరూ పోల్చలేక పోయినారు ప్రేక్షకుల్లో. అంతా నన్ను ఆ ఆర్థరే అని మెచ్చుకున్నారు. ఏ ఆర్థరు? లిజెండరీ ఆర్థరు కాదు, షేక్స్పియర్ వ్రాసిన షష్ఠమ హెన్రీలోని ఆర్థర్!

మరచిపోకండి! ఆనాటి ఆ కుట్టివాని చెమ్మగిల్లిన కళ్లూ, హ్యాబర్టు కమ్మరి కొలింలోంచి కాల్చితెచ్చిన గరిటి కాడలూను!

# డ్యూయల్ డస్కులా? సింగిల్ డస్కులా?

ఈ వ్యాసముయొక్క మకుటం కేవలం ఇంగ్లీషు పదాలతోనే వ్రాశాను. ఆలా ఆ భాషలో వ్రాయాలనే వ్రాశాను. "తెనుగు" "తెనుగు" అని ఎవరూ గొంతెత్తవద్దు. నేను వ్రాయబోతూ వున్నది 1907 కు సంబంధించిన ఒకానొక విశేషం. మఱిన్నీ మిక్కిలి దేశభక్తి పూరితమైనటువంటిదిన్నీ! అందఱూ తెలుసుకు జ్ఞాపకముంచుకో తగ్గదిన్నీ!—అంచేత ఏమాత్రం అవకాశం వున్నా నేను ఆంగ్లేయ పదాలు వాడేవాణ్ణి కాదు. అయితే ఏం చెయ్యను? తప్పనిసరి వచ్చింది.

ఆ యేడు రాజమహేంద్రవర నగరంలోని ప్రభుత్వ కళాశాలా విద్యార్థులు సమ్మెకట్టారు. బోధనాభ్యాసనాశాలలోనివారు గాని, దానికి సంబంధించిన ఆదర్శ పాఠశాలలోనివారుగాని ఎవ్వరూ సమ్మెకట్టలేదు. దానికి కారణం అనేకమంది అనేక విధాలుగా అప్పట్లో అనుకునేవారు. ఒకటి, ప్రభుత్వ కళాశాలా ధ్యక్షుడు తెల్లదొర కావడంచేత, నల్ల పిల్లల కోరికలు మన్నించి వుండలేదని, బోధనాభ్యాసనాశాలాధ్యక్షుడు నల్లవాడు కావడం చేత మనవాళ్ళపట్ల సానుభూతితో మెలగి యున్నాడని ఒక కొందఱు, రెండు, ప్రభుత్వ కళాశాలా విద్యార్థులు పెద్దవాళ్లు కావడంచేతను ఎక్కువ స్వతంత్రత చూపగలిగారని, బోధనా భ్యాసనాశాలా విద్యార్థులు పసిపిల్లకాయలు, పసిపిల్లకాయలతో వ్యవహరించివలసిన అభ్యసనోపాధ్యాయులు కావడంచేత సమాన స్వతంత్రత చూపించలేకపోయారని మఱికొందఱు అంటూ వచ్చారు. పై రెండు కారణాలూ కాదు: ప్రభుత్వ కళాశాలకు సరియైన ప్రహరీగోడ లేదు, ఎటుచూచిన వెళ్లికంచలే, అంచేత

అందుగల విద్యార్థులు చులాగ్గా, ఇవలకు వచ్చేసెయ్యడానికి వీలుంది : బోధనాభ్యాసనాశాలకో ? చుట్టూ గట్టి గోడ వుంది. మఱిన్నీ జైలు ద్వారాలులాంటి ద్వారాలున్నాయి. లోపలకు వచ్చినవాండ్లు వెలుపలకు వెళ్ళడానికి వీలులేని తాళాలు వేసేస్తారు వేళకాగానే, అని మూడో తెగవారు నిర్వచించారు.

పై కారణాలన్నింటి మాటకేం ? కొందఱనుకున్నారు— మేము, అనగా బోధనాభ్యాసనాశాలా విద్యార్థులం, ఎవళ్ళమూ, నాటిక్రితం సాయంతరం ఇవ్వబడ్డ ఒకానొక సుప్రసిద్ధ దేశ నాయకుని రాజకీయోపన్యాసము వినలేదని — ఆ కారణంగా స్తబ్ధత్వం వహించి మేం సమ్మెకట్టలేదని—అవితే నిజానికి మేమూ మా గురువులూకూడా విన్నాం, ఆ—వాని గంభీరోప న్యాసము ; అందలి ముఖ్య సూత్రములు, బంగాళావిభజన తిరస్కరణము, విదేశవస్త్ర బహిష్కరణము, వందేమాతరం పునశ్చరణము అని—మఱిన్ని బాప్ లాల్ పాల్ ఈ ముప్వురే త్రిమూర్తులు అని — " సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం " అన్నవే మాతృదేశముయొక్క గుణత్రయమని,— ఇంకా ఏమేమో నేర్చాం మేమూను. మేముకూడా దేశభక్తి పతకాలు కొనుక్కొని చొక్కాలకు తగిలించుకున్నాం, బాప్ లాల్ పాల్ పటాలు చేతపట్టాం, గొంతులు బొంగురుపోయేలా " వందేమాతరం " అని అఱిచాం. అయితే క్రియదగ్గఱ కొంచెం పప్పులో అడుగేశాం ! దానిక్కారణం, అట్టే ఆలోచిస్తే మేం కాం అని తుదకు తేల్చేశాం. ఆ మేటియుపన్యాసకుడే మా వెం బాటును కారకుడని ఇటు అటు చూశాం ! కాని అతగాడు ఆ రాత్రే రైలెక్కి వెళ్ళిపోయినాడన్నారు.

ముఖ్య విషయానికి వద్దాం! వక్త చిట్టచివర తన యుపన్యాసంలో ఒక ముక్క చెప్పాడు. "ఈనాటి ఆంగ్లేయ ప్రభుత్వము యొక్క పాలనావిధానము విభజన. బంగాళా విభజననుండి పాఠశాలల్లోని బల్లల విభజనదాకాను అని తెలుసుకోండి విద్యార్థులు!" అన్నాడు. "మఱిన్నీ డ్యూయల్ డస్కులన్నీ తీసేసి రేపటినుంచి సింగిల్ డస్కులు వేసి మిమ్మల్ని మీ మాష్టర్లు కూర్చోపెట్టారా అంటే, మీ మాష్టర్లు ఎవరి నాణెం తింటూవున్నారో వారి ఔన్నత్యంకోసం ఆలా చేశారు అని మీరు తెలుసుకోండి విద్యార్థులు! మీ బాగుకోసం మీ జ్ఞానంకోసం కాదు!" అని హెచ్చరించాడు.

ఫలితం:—మేం, యావన్మందిం, బోధనాభ్యాసనాలయ సచ్ఛాత్రులం, మర్నాడు తెల్లాఱకుండానే పాఠశాలకు వెళ్ళిపోయి మా మా తరగతుల్లోని బల్లలమీద కూర్చున్నాం! అప్పట్లో ఆ బల్లలన్నీ డ్యూయల్ డస్కులే! మేం లేచిపోతిమా, ఎక్కడ వాటిని సింగిల్ డస్కులుగా మార్చి ప్రభుత్వానికి మా గురువులు పరువు ప్రతిష్ఠలు ఇంకా కలిగిస్తారేమో అని భయం! మాబాగా వంచించాం మా గురువుల్ని, మా గురువులకు జీతాలు ఇచ్చే సర్కారువారిని అని మాలో మేం ఉప్పొంగిపోయాం——

నిజానికి మేం కావించిన నాటి చర్య అంతా మా మాష్టర్లు కావాలని కోరిందే! ప్రిన్సిపాల్‌గారు సంతోషించడానికి అవకాశం ఇచ్చిందే! కాని మా అమాయకదృష్టి అంతచేటు అంచనా కట్టలేకపోయింది.

ఆనాడుపాధ్యాయులు వేళకు పాఠశాలకు వచ్చేసరికి, వారికంటే చాలాముందుగా మేము, అనగా విద్యార్థులం వచ్చి,

బర్లో డ్యూయల్ డస్కు ల్నంటిపెట్టుక్కూర్చొని వున్నాం. గ్రహించారనుకుంటాను, మా మనస్తత్వము, మా మైనపు మెత్తనాను! ఏమా అంటే మూడోనాడు విన్నాం ఆ సంగతి; ఏవేళకు మేం ఈ పాఠశాలలో కూర్చుని పాఠాలు నేర్చుకుంటూ బుద్ధిగా వున్నామో ఆవేళ కప్పుడే ప్రభుత్వకళాశాలా విద్యార్థులు పెద్ద విప్లవం తలపెట్టి అంతా ఒక్కపెట్టున "వందేమాతరం" ప్రతిధ్వానంతో ఇవలకు వచ్చేసి సమ్మెకట్టేశారని—

అయితే మా పాఠశాల్లో ఆ ఉదయం ఏం జరిగిందీ అంటే—మా దగ్గఱావుంది "వందేమాతరం" గీతం అచ్చుపడ్డ కరపత్రం! మా దగ్గఱా వున్నాయి బాప్ లాల్ పాల్ పటాలు మూడూ కలిసివున్న చిత్రం, మా దగ్గఱా వున్నాయి. "భరత మాత" పతకాలు కాని మేం మా డ్యూయల్ డస్కులు ఎక్కడ పోతాయో అవి నిలబెట్టుకుంటి మా బంగాళా విభజనమును అడ్డు తగిలినంత గొప్ప మాట అని అట్టే కూర్చుండిపోయాం— డ్యూయల్ డస్కులు అంటే అంత అభిమానం ఎందుకంటా రేమో—అందుమీద ఇద్దఱం ఇద్దఱం కూర్చొని అన్యోన్యం పరిచయం కలిగివుండి, ఐకమత్యమునకు చిహ్నం గాళ్లమై యుండగలము చూడండి. ఆ ఆ కారణంగా అలా కూర్చుండి పోయాం!—

మొట్టమొదటి పాఠంనాడు "ఫిసిక్సు" అనగా పదార్థ విజ్ఞాన శాస్త్రము; ఆ—"రావు" గారు తన సహజ సంగీత ధోరణిలో ఒక "ట్యూనింగ్ ఫోర్కు" తీసికొనివచ్చి, కొంత సేపు దానిగుండా సిద్ధాంతీకరించి, చిన్న చిన్న జంత్రాల్నుంచి వీణదాకా మీటించి ఆ వీణమీద ఒక త్యాగరాజకృతి స్వయంగా

ఆలాపించి "పిల్లల్లారా ! ఇవేకాదు కొత్తపాటలు మీ దగ్గఱ వుంటే అవికూడ ఆలాపించవచ్చు సుమండీ ఈలాగేను" అని పురిగొల్పారు. వెంటనే తరగతి పిల్లకాయలం అందఱం మా జేబుల్లో వున్న "వందేమాతరం" పాటను ఎవళ్ళమట్టుకు వాళ్ళం పైకితీసి ఆయనకు అందిస్తూ ఈ పాట పాడుతుందేమో చూడమన్నాం ! " ఆయన ఆ కీటుకు గ్రహించి, గడుసువాడేమో. అవన్నీ బొత్తెట్టి తన జేబులో పెట్టుకుంటూ, గడియారం చూచి "ఈ రోజుకు వేళయింది" అనేలో గంట మోగింది. "ఇవన్నీ నావద్ద వుంచండి. రేపటికి సాధకం చేసి మీకు బోధిస్తాను" అని వెళ్ళిపోయారు. ఆ—"రావు" గారి వెనకాలే వెళ్ళి ఆ కర పత్రాలు ఊళ్ళాక్కోవడానికి తగినంత చొఱవ మాకు అప్పట్లో లేకపోయింది. అంతలోకే రెండో "పీరియడ్" పాఠం చెప్పే ఇంగ్లీషు మాస్టారు—"శర్మ" గారు వచ్చారు.

వారేమన్నా వస్తూనే నాడు నల్లబల్లమీద "దత్తాత్రేయ" పటం వ్రేలాడకట్టారు. ఆ—"శర్మ" గారు అన్న ఆయన స్వతస్సిద్ధంగా మతం బోధించే తత్వంగల మనిషి. "రోఢరిక్ ఢూ" పాఠం ఎంత ప్రత్యక్ష ప్రదర్శనంగా బోధించగలడో, భగవద్గీతలోని "అర్జున విషాదయోగం" కూడా అంత హృదయాకర్షణీయంగా నేర్పగలడు. ఆయన నాటి పాఠం ప్రారంభిస్తూ చెప్పేది ఇంగ్లీషు పాఠం కాదనుకుంటామేమో అని. హోలీ బైబిల్ పేరు ముందు ఎత్తుకుంటూ అందునుంచి "గాడ్, ది, ఫాదర్" "సన్, ది, క్రైస్టు" మూడో "ద హోలీ ఘోస్టు" అని ప్రతిపాదించి, ఏ కనుమూతలోనో బ్రహ్మ విష్ణు మహేశ్వరత్రయమును నిరూపించి, మాకు తెలియకుండానే

"దత్తాత్రేయ" స్వరూపాన్ని పెద్ద ఇంగ్లీషు వాగ్జాలంలో వర్ణించి, మీవద్ద ఎటువంటి పటాలున్నా వాటన్నింటినీ ఒక్క-మొండెంమీద నిలబడ్డ త్రిముఖంగా చూడాలి గాని వేఱువేఱుగా చూడరాదన్నారు. "వీరి సీసా ? అండీ !" అని మేం పిల్లకాయల మందలం మా వద్దనున్న "బాప్ లాల్ పాల్" పటాలను తీసి ఆయనకు ఇచ్చాం. ఆయన వాటి నన్నింటినీ మానుండి సంగ్రహించుకుంటూ "ఆఁ. వీరిసీని ! వీరివి ఏకం చేయడం ఏలాగో రేపు చెబుతాను. నా దగ్గఱ వుండనియ్యండి ఈ రోజుకు" అన్నారు. మేం ఆయనను నమ్మి ఆయనవద్ద వుంచేశాం. వుంచక ఏం చేయం ? గంట మళ్ళీ వినబడె ! మూడో మాస్టారు అప్పుడే వస్తూవుండె వేఱే పాఠం చెప్పడానికి !

నాటి మూడో గురువులు—"మూర్తి" నామధేయులు. ఆయనకు "ఆల్కెమీ" అంటే అతి నమ్మకం. పాఠశాలలో రసాయనశాస్త్రం మట్టుకే బోధించినా ఇంటివద్ద మట్టిగిన్నెలతో సహా "ఆల్కెమీ" పరిశోధనే హెచ్చు. ప్రతి లోహాన్నీ బంగారం చేసి పారెయ్యవచ్చునని తలపోసేటంత ధనాశా తత్పరుడు. ఆయన అసలు ఆ రోజున మా క్లాసుకు వస్తాడని అనుకోలేదు. కాని ఏలా టైమ్ టేబిల్ మారిపోయిందో, మరే మాస్టరైనా రాలేదో, ఈయన చక్కా వచ్చి వస్తూనే "హైడ్రోక్లో అరిక్ ఆసిడ్" సీసా బల్లమీదపెట్టి "ఇందులో ఏం పడేసినా కరిగిపోతుంది. ఒక్కటితప్ప అంటూ ఒక్కొక్క లోహాన్నే ఇనుమునుండి హిరణ్యందాకా వేస్తూ కాలహరణం గావించి మమ్మల్ని ఉవ్విళ్ళూరించేరు. మేమున్నూ గంట అయిపోతూంది అనే తహతహలో వళ్లుమఱచి, మా దగ్గఱవున్న

"భరతమాత" పత్రకాన్ని ఆయనకు ఇచ్చి "ఇవి అందులో పడేసి కరగించండి! చూస్తాం!" అన్నాం. ఆయన అవి అన్నీ గుదిగ్రుచ్చుతూ "ఈ వేళకు టైమై పోయింది. రేపు ఆ విద్య మీకు చూపిస్తాను" అని అవి తనదగ్గరే వుంచుకుని వున్నాడు.

అంతలో ఏదో తాఖీదు వచ్చింది. "అయిదు నిముషాలు అన్ని క్లాసులు నిలుపుచేయవలసింది. విడిచిపెట్టవద్దు ఇళ్ళకు" అని—ఏమా అని మేం రిచ్చపోతూవుంటే మా వైస్ ప్రిన్సిపాల్ గారు ప్రక్కబొత్తాలు సర్దుకుంటూ, పెద్ద కాలేజీ ప్రిన్సిపాల్‌గారు హేట్ ఊపున ముక్కు రాచుకుంటూ, మా గదిలోకి ప్రవేశించి, మా ఎగుజేబులు, దిగుజేబులు తడిమి నఖశిఖ పర్యంతం పరిశీలించారు.

పెద్ద ప్రిన్సిపాల్‌గారు చిన్న ప్రిన్సిపాల్‌గారితో "మీ పిల్లకాయలు చాలా బుద్ధిమంతులల్లే వున్నారు. విప్లవ సూచనలు వీరివద్ద ఏమీ కానరావడంలేదు." అని మాకేసి చూచి "మీ అందఱికీ ఈ అపరాహ్ణం, రేపూ సెలవు" అని చిరునవ్వు నవ్వారు.

మేమాంపాళంగా పెద్ద నవ్వుతో కేరింతాలు కొడుతూ. ఒకటే పరుగు మా యిళ్ళకు! డ్యూయల్ డస్కులు మాట మఱచిపోయాం. సింగిల్ డస్కులు మాటా మఱచిపోయాం నాడు మానుండి మా గురువులు తీసికున్న విప్లవోపకరణాల్ని మఱచిపోయాం!

మేమే కాదు. మాతోపాటు దేశమంతా కూడా క్రమ క్రమంగా మఱచిపోయింది—ఇప్పు డెక్కడా "వందేమాతరం" కీర్తన జాతీయగీతంగా వినిపించడం లేదుగదా!—"బాప్

లాస్ పాల్ " ముగ్గురూ కూడా అవమానింపబడివున్నారనే ఉద్ఘాటింపవచ్చును. ఎంచేత అంటే మన రాజ్యం " సెక్యులర్ " రాజ్యం అని అంటున్నాం. ఆ కారణంగా హిందూమత సిద్ధాంతాన్ని తిరస్కరించి పారవెయ్యడమే కాకుండా, అవతల పాంచాల రాష్ట్రాన్ని ఇవతల వంగరాష్ట్రాన్ని ముక్కముక్కలుగా చేసి తుడిచిపెట్టాం. ఇక పై ముప్వురు వంచింపబడక, ఎంచబడ్డవారెలా కాగలరు? ఇంకా చెప్పుకుంటే సిగ్గు! సిగ్గు! కైలాసంనుండి బ్రహ్మదేశం దాకా పరిఢవిల్లిన తల్లి దేశపు పయట లాంఛనం, మేలిముసుగు శుభాంచలం, అమానుష కర్మ కాండకు ఆహుతి అయిపోయినాయి!

ఏం జరిగినా చెప్పదగ్గ ఒక అంశం మాత్రం మిగిలివుంది! ఆనాడు మాకు పాఠాలంత చమత్కారంగా చెప్పి పాఠశాలయొక్క పరువు నిల్పిన ఆ ముగ్గురు పంతుళ్లూ నేటికీ కృపాచార్య, కృతవర్మ, అశ్వత్థామల్లాగు పొడగడుతూ వుంటారు నా కళ్ళకు! నిజంగాకూడా బ్రతికి బాగా వున్నారు!

.... .... .... .... ....

## అయితే మెట్రిక్యులేటు - లేకుంటె ఫేటు

ఇంగ్లీషు భాష మాట్లాడకూడదని శాసిస్తే అది పోవాలిగాని, అందాకా ఆనోటా ఆనోటా ఎల్లకాలం ఉద్ఘోషింపబడే ఒక పాత " ఎలొకూ్యషన్ " ఖండిక వుంది. అది ఏమా అంటే–"మెట్రిక్యులేషన్ ఎగ్జామినేషన్ ఈస్ ఎ గ్రేట్ బాదరేషన్, సో, ది స్టూడెంట్ పాపులేషన్ మస్టు గో బాక్ టు కల్టివేషన్, ది చీఫ్ ఆక్యుపేషన్ ఆఫ్ దిస్ నేషన్ " అని.

ఆ పరీక్ష మరి 1908 తరువాతను వుండదని, ఆ యేడు కృతార్థులైతే కృతార్థులైనట్టు, లేకుంటే ఆ జట్టు జట్టు ఉచ్చుత్రాట నురోసుకునో, ఉత్తరాది మినార్ నుండి ఉరికో ప్రాణాలు వదిలేయవలసి వుంటుందని పెద్ద పుకారు లేచిపోయింది.

ఇప్పుడు చూస్తానుగదా అడుగడుక్కీ ప్రయివేటుగా మెట్రిక్యులేషన్ పరీక్షకు వెడుతూ లుడుంగుమని పనసపిక్కల్లా యీవలకు అమ్మలక్కలు సయితం సఫలీకృతలై పడుతూనే వున్నారు. మరి ఎందుకు పుట్టిందో అప్పట్లో ఆ విపరీతపు వాక్కు! వెంటనే మా విద్యార్థి లోకంలో ఒకవిధమైన భీతి బయలుదేరింది. దానితోపాటు పిక్కేత ప్రారంభమైంది. ఒకడికీ నిద్రాహారాలు లేవు. "సబ్జెక్టు"లు చూడొస్తే బోలెడు. ఒక మేథమేటిక్సే వుండేది మూడిందాలుగా "అరిథ్‌మెటిక్" అని, "ఆల్జీబ్రా" అని, "అక్లిడ్" అని. మరి ఇంగ్లీషు అంటే నెస్‌ఫీల్డు నాలుగవ నెంబరు బుక్కు గొంతంట ఎగబీల్చి, ముక్కంట బుసకొట్టడ మన్నమాట. ఇంగ్లీషు హిస్టరీ అనేది వుండేది—రాతియుగం నుండి విక్టోరియారాణి యుగందాకా. తేదీల క్రమంగా తెగతెంపు లేకుండా ఒప్పజెప్పవలసిందే. అందులోనూ ఆ యేడు టెక్స్టు మార్కు హంటర్‌గారి విరచనమేమో. అతడు ఇంగ్లీషు భాషా వేత్త కావడంచేత దాని వాచా, బింకాలు పొంకాలు చరిత్రాంశ పాతాల్లోకి దూర్చి ఏ "నాథన్నో" "మీనన్నో" చెబుతూంటే మేం డిక్షనరీ చూసుకోవలసివచ్చేది. అంత నారికేళపాకంగా కనుపట్టేది అది. ఇక జాగ్రఫీ అనేది నేర్వడంలో ధ్రువతారనుండి పవమానపు గుండాల లోతుదాకా ఆయా సంగతులన్నీ వెళ్ళి పోవలసిందే. రసాయన శాస్త్రం, పదార్థ విజ్ఞానశాస్త్రం—వీటి

మాట చెప్పనక్కరనేలేదు. రెండూ రెండు కళ్ళల్లోను సూదులు గుచ్చుకు మరీ రుబ్బవలసినదే. తెలుగు తీసుకుంటే తెలుగు లోను, సంస్కృతం తీసుకుంటే సంస్కృతంలోను పండితులు మానుండి కోరే పరిజ్ఞానం అపారం. ఇన్నీ అతి "సీరియస్"గా సంధ్యవార్చినట్టు వార్చి, వడపోయవలసిందే. ఊరికే ఆషా మాషీగా ఈ రోజుల్లోలా, వృత్తివిద్యకు బంధుకోటిగా, పౌర శిక్షణకు మేటి సిబ్బందీగా తెలిసికోవలసినవి కావు. మరిన్నీ ఏ వాక్కటీ ఇంగ్లీషులో మాట్లాడాలి. ఇంగ్లీషులో జవాబు చెప్పాలి, తప్పు చెబితే ఛప్! ఇప్పుడేముంది? ఇప్పుడెలా మాట్లాడినా ఒకటే. ఇక పదిహేనేండ్లల్లో పోయే భాషే కాదా అని ఈసడింపు! అప్పుడలా కాదు. ఉపాధ్యాయుడు తిడితే ఇంగ్లీషులో తిట్టాలి; దీవిస్తే ఇంగ్లీషులో దీవించాలి.

పైని వివరించిన అంతటి కట్టుదిట్టపు చదువు చక్రమందు మా మనస్సులు బిగింపబడివున్నా, మేము అదంతా బిగింపు అని అనుకునేవాళ్ళము కాము. ఏదో ముందుకు గుఱ్ఱపు పరుగున పోతూవున్నాం అనే మా వూహ! మా ఎదురుగుండా అటునుండి ఇటు, ఇటునుండి అటు గోడల్ని నల్లబల్లలు జరుపుతూ, చెరుపుతూ ఆ చేష్టల్లో తమరు ధరించిన నల్లగౌనులు ఊపుకుంటూ ఎల్. టి. ప్యాసయిన మేధావంతులు, మేష్టర్లు సాక్షాత్కరించి వుంటే, మా అభిలాష అంతా ఆ యేడు తప్పకుండా ఆ మెట్రిక్యు లేషన్ పరీక్షలో ఎలాగో ఓలాగు జయభేరీ మోగించే దృష్టేగాని మరోదారి తీసిందే లేదు.

మాష్టర్లు అనడంతోనే జ్ఞాపకం వస్తూవున్నారు ఒక రొక్కరే! అందులోను ఆ యేడు పాఠం చెప్పిన ఓ కొందరు.

వారు ఇప్పుడు లేరు కాబట్టి, అనగా కీర్తిశేషులైనారు కాబట్టి పేర్లు చెప్పినా ఎవరూ వారిని "మీరా?" అని పలుకరించే వారుండనేరరు. అందువల్లను చెబుతున్నాను.

ఒకరు శ్రీ వెదురుమూడి రామదాసుగారు, రెండోవారు శ్రీ శిష్టా గోపాలంగారు. మూడోవారు శ్రీ ఎస్. సుబ్రహ్మణ్య అయ్యర్‌గారు. వీరాసమయములో నాకు ముఖ్యంగా ఎందుకు జ్ఞాపకం వస్తూవున్నారు అంటే, మొదటి ఆయన ఇంగ్లీషు పాఠం చెప్పి చెప్పి, ఒకనాడో పద్యం వ్రాయింపించి, దాని తాత్పర్యం వ్రాయమన్నారు. అదే పద్యం తరువాత "పబ్లిక్ ఎగ్జామినేషన్" లో "పారాఫ్రేసు" చేయవలసినదని ప్రశ్న వచ్చింది. ఇక ఆయనను మెచ్చుకున్నాం. ఆ రోజున ఇంతా అంతా కాదు. అయితే మా తుది కృతార్థత దానిమీద ఆధారపడి వుండలేదు లెండి. ఆ యేడు తిరుగ పరీక్ష అంటూ ఒకటి ఏ కారణం చేతనో పెట్టారు. అప్పుడు మళ్ళా అలాంటి వీలైన ప్రశ్న రాలేదు. ఏదో వ్రాసి ఏలాగో ప్యాసయ్యాం అనుకోండి. దానికేం కాని ఆనాటి సందర్భం చూస్తే ఈ రామదాసుగారన్నాయన సామాన్యుడుగాదు. ప్రవక్తలాంటివాడు అని అనిపించింది. రెండో ఆయనను గురించి నే వ్రాసే విశేషం, కేవలం వ్యక్తిగతం అనుకోండి. అయినా ఆయన ఉదార స్వభావం అందరి శిష్యులపట్ల అలాగే వుండేది. ఆల్జీబ్రా పేపరు ప్రిలిమినరీ పరీక్షకు "ఏన్సరు" చేస్తూ (ఎ+బి) (బి+సి) (సి+డి) అనడానికి సరాసరి (ఎ-బి) (బి-సి) (సి-డి) అని ఈక్వేషన్ వర్కుచేసి యిచ్చేశాను. ఆయన పూర్తిగా సున్నచుట్టక పదింటికి ఎనిమిది మార్కులు యిస్తూ "ఏమోయి! ఇక్కడ

పొరబడ్డావా ?" అన్నారు. "కామోసు" అని ఆ పేపరు నా జేబులో కుక్కేసుకున్నాను. ఆయన కెంతో కృతజ్ఞత మనస్సులో చెప్పుకున్నాను. మూడో మేధావి ఎస్. సుబ్రహ్మణ్యఅయ్యర్ అన్న ఆయన అరవఅయినా, భూగోళపాఠం చెప్పడాన్ని బట్టో ఏమో అన్నిదేశాలు, అన్నిజాతులు తనకు సమానమెనన్నట్టు కనబడేవాడు. అప్పటికి ముప్పైయేళ్ళవాడయి వుంటాడు. టిప్—టోగా వుండేవాడు. ఆయన కాపురం మహానగరంలో ఏ కొట్లల్లోనో ఎవరికి తెలియనిచోటే కావచ్చును. కాని పాఠశాలకు రావడంలో మాత్రం ఎన్నో పుస్తకాలతోటి. బారెడు బారెడు మ్యాపులతోటి వచ్చేవాడు. అన్ని పుస్తకాలు గిల్టు అక్షరాల అట్టలవే. అన్ని మ్యాపులు ధగధగమనిపోతూ, చూపుడు బెత్తాన్ని ప్రతిఫలింపజేసేవే. మేము ఆపాఠశాలలో ఆక్రితం రెండేండ్లు ఎన్నడూ అలాంటి పుస్తకాలనుగాని, పటాల్నిగాని చూడలేదనుకోండి. "వీటికోసమైనా మెట్రిక్యులేషన్ చదవాలి" అని అనిపించింది మా కందరికీ !

ఇలావుండగా ఏంచేశాడూ ఆయన ఒకరోజున ? "ఫిలిప్స మాడరన్ స్కూలు ఎట్లాస్" అని ఒక పెద్ద పుస్తకము విప్పి చూపించాడు. పోల్‌స్టాల్, పొలినీషియా, యురేనస్, యురేషియా ఐసో థెర్మల్‌లైన్సు, ఐసో బారిక్‌లైన్సు, ఒరుగ్వే, పెరుగ్వే, ఈక్వినాక్సు, ఈక్వేటర్ మున్నైన యావత్తు ఖగోళ ధర్మాలు, ఖనిజ మర్మాలు, ఇలా అక్కడక్కడ పుటలుత్రిప్పి చూపించాడు. మా రెండుకళ్ళు విప్పార ఆపొత్తంవంక చూస్తూ "ఎంతుంటుందండి ఖరీదు ?" అన్నాను. అంటే రూ 2-0-6 అన్నాడు ఆయన.

పై అర్ధణా తపాల ఖర్చుగావును అని వెంటనే రెండురూపాయల అర్ధణా ఇచ్చివేసి ఆ అట్లాస్ కొనేశాను నేను. మరికొందరూ కొన్నారు మర్నాడు, మఱోనాడు! కొనకుండా ఎట్లా వుండగలరు ? అది కొంటేనేగాని పరీక్ష ప్యాసుకామేమో అని కొందరి వూహ! కొందరి వూహ మేష్టారు సంతోషిస్తారని! కొందరి వూహ అందలి చిత్రాతిచిత్రాలు చూస్తే జగత్తంతా చుట్టేసి వచ్చినట్టే అని!

ఆ అయ్యవారి రూపురేఖలు నశించిపోయినా ఆయన కొనిపించిన—లేక నేను ఆయనమూలంగా కొనుక్కున్న ఎట్లాస్ పుటలు ఇప్పటికీ వున్నాయి నావద్ద. అలా ముట్టుకుంటే ముక్కలుముక్కలుగా విరిగిపోతున్నాయి. పొడి అయి పోతున్నాయి. ఎంతకాలం జాగ్రత్త పెట్టగలనో చెప్పలేకుండా వున్నాను వాటిని. దానిమీద నేను వ్రాసికొన్న నాపేరు, నే తీసికొన్న ఖరీదుకూడా చెరిగిపోతున్నాయి. కాని ఆ అంకెలు, అక్షరాలూ చెరిగిపోతేనేం, ఆ పుటలు, పటాలు చిరిగిపోతేనేం, అట్టకు అట్టకు మధ్య ఖాళీ భూగోళ ఖగోళాలమధ్యను గల అవకాశాన్ని నిరూపించేటప్పుడు!

ఆ ఖాళీగుండా నేడు నేను చూస్తూంటే నాడు మెట్రిక్యులేషన్ పరీక్షకు నాతో కూర్చున్న ఏకలవ్యులు, రాబర్టుబ్రూసులు, కచులు, కుశలవులు, మహమ్మద్ గజినీలు ఎందరెందరో కానవస్తున్నారు.

"ఒరేవ్! నీవు పేపరు వ్రాయగల్గినా, వ్రాయలేకపోయినా ఇచ్చిన టైమ్ అయిపోయేదాకా సీటుమీదే కూర్చుని పదేపదే తిరగేసి దిద్దుకో" అని తండ్రి చెప్పి పరీక్షకు పంపితే

కుఱ్ఱవాడు "కాసబియాంకా" లా ఆలాగే వుండిపోయాడు అయితే వానిలా వినిపని విషాదాంతం కాకుండా తండ్రివచ్చి టైము కాగానే తన కుమారుని తీసికొని వెళ్ళిపోయినాడు రోడ్డు పొడుగుతా, వచ్చిన ప్రశ్నలు, వాటిక్రింద పెట్టిన కొడుకు సిరా గీతలు పరకాయిస్తూ.

రిటైర్డు ఆఫీసరు తన కడగొట్టు మనుమడితో "వారేవ్! నీవు మొదటియేడు యీ పరీక్ష మీ అన్నల్లా ప్యాసుకాకపోతే పరపతి పుట్టదురానీకు అనేలో రోజూ ఆ పిల్లడు పశుపతి దేవాలయము వెళ్ళి తన పరీక్ష ప్యాసు చేయించమని మ్రొక్కేవాడు.

కొందరు పిల్లల తండ్రులుకూడా పరీక్షకు కూర్చున్న వారున్నారు. మరికొందరు ఉద్యోగాలమధ్య సెలవుపెట్టి "యిందులో జయమందితే తరువాత ప్రొమోషన్ అవుతుం"దని దీక్షగా తెల్లవార్లూ కిరోసిన్ తగలవేసిన వాళ్ళున్నారు.

ఇందర్నీ దిగతుడిచి, తానెల్లా అయినా ఆ సంవత్సరం ప్యాసయి తీరతాడని పట్టుపట్టి ప్రతీ రైల్వే ప్లాట్‌ఫారమ్ పాకేజీపెట్టెమీద, ప్రతీ పతవలరేవులోని బస్తా మూటమీద పుస్తకంతో కాయలు కాచిన తన హస్తాన్ని చూపుతూ, విధి విరామం లేకుండా చదివిన పిచ్చివాలకపు వ్యక్తి, తల్లిదండ్రులతో సంబంధం లేనివాడు, సంసారం లేనివాడు మరో అతను వున్నాడు.

వివరించడమంటూ వస్తే బహుసంఖ్యాకులు ఆ సంవత్సరం ఆ పరీక్షకు చదివి కూర్చున్నవాళ్లున్నారు. ఇంతమంది జయంపొందారా అంటే గెజెట్ చూడాలి! మనుష్యుల్ని చూపలేం!

ఆ రోజుల్లో మేం ఫోటోలు తీయించుకోవడం ఎరుగము. ఇప్పుడు తీయించుకుందామా అంటే మా అందరి తలలూ నెరిసి పోయినాయి. కొందరికైనా పళ్ళూడిపోయినాయి. ఎందరో కాలం చేశారు. అమృతహస్తులు! అజాతశత్రులు! ఆజానుబాహులు!

* "Matriculate or no matriculate.
All succumb to the same fate;
Especially to-day in this Madras State.
Alas, no rice, no sugar,
No brinjal, no betelnut;
Don't you drive your chariot.
My lad! along the same rut."

* షరా :—చుక్కగుర్తుగల ఇంగ్లీషు ముక్కలు నావాణి నుండి స్వయంగా వెలువడ్డాయి. తప్పులు లేవని ఏ "బర్కు"కో కట్టబెట్టేరు కనుక!

.... .... .... .... ....

## శూన్యాకాశ విచింతనం

నేను లోగడ వ్రాసిన వ్యాసాల్లో 1899, 1902, 1903 మున్నగు సంవత్సరాలను గురించి పేర్కొని వుంటినా, ఎక్కడైనా ఆ విశేషం నా పూరా జ్ఞాపక శక్తి మీద ఆధారపడి వుండలేద పాఠకులు తెలిసికొందురు గాక; కొంతవరకూ వారూ వీర అనుకొన్న దాన్ని బట్టీ, కొంతవరకూ ఊహాపేశాన్ని బట్టి నా వాక్కుకు ఊతం యిచ్చి రచించివున్నాను.

సరిగ్గా మా వాళ్ళు నాకు అక్షరాభ్యాసం చేసి ఉంటే దుర్ముఖి నామ సంవత్సర మార్గశిర బహుళ అమావాస్యనాడు

జరిగివుండి వుండాలి. ఏమో ? ఆనాటికి నాకు 5 ఏళ్ళ 5 నెలల 5 రోజుల యీడు వచ్చేసి తీరాలి కాబట్టి లెక్కించి చూడండి. నందనకు విజయ, విజయకు జయ, జయకు మన్మథ, మన్మధకు దుర్ముఖి నాలుగు వెళ్ళి అయిదోఏడుగదా. మఱి ఆషాఢమునకు శ్రావణం, శ్రావణమునకు భాద్రపదం, భాద్రపదమునకు ఆశ్వయుజం, ఆశ్వయుజమునకు కార్తీకం, నాలుగు నెలలు వెళ్ళి అయిదోనెల గదా ! కార్తీకమునకు మార్గశిరం అయిదునెలలూ మార్గశిర బహుళ ఏకాదశికి పూర్తి—పైని అయిదురోజులు అమావాస్యకు పూర్తి—ఆనాడా వుత్సవం జరక్కపోయి వుంటే అమావాస్య మూలాన్ని జరక్కపోయి వుండాలి. మఱీన్నీ మాసానాం మార్గశీర్షం శ్రేష్టం !

ఈ విషయమై నే నీ మధ్యను మా గ్రామవాస్తవ్యులైన బ్రహ్మశ్రీ చతుర్వేదుల శీతారామయ్యగారితో ముచ్చటించగా ఆయన వల్ల తెలిసిన సంగతి ఏమిటంటే "నాయనా ! నిన్ను బళ్లో పడేసింది నేను కాదు. అవుధానుల కృష్ణయ్యగారు" అని చెప్పారు. ఏ సంవత్సరం అయి వుంటుందంటే "సంవత్సరం చెప్పలేను. ఆయన ఈ గ్రామంలో 1899 సం॥ వరకు వున్నారు. 1900 లో నాకున్నూ ముత్య రామమూర్తి గారికిన్నీ తమ రిజల్టు స్కూలు వొప్ప జెప్పి ఆయన మరోచోటికి బోర్డు స్కూలుమాస్టరుగా వెళ్ళిపోయినారు.

1899 కి పూర్వం ఈ పూళ్లోదీ బోర్డుస్కూలే. అయితే అప్పట్లో తీసేసారు" అనినారు. ఇంకనూ చెబుతూనే వున్నారు. నేను నామనో వీధిలో అవుధానుల క్రిష్ణయ్యగారిని చిత్రం చేసుకున్నాను !

ఆయన చేతిలో పెద్ద లావుపాటి నల్లని, నున్నని, రూళ్ళకఱ్ఱ వుండేది. పప్పూ బెల్లాల సమేతమైన అక్షరాభ్యాసం యథాశాస్త్రీయంగా గావించి ఆయన నన్ను మా యింటి వద్దనుండి బడిదాకా తక్కిన పిల్లల్తోపాటు నడిపించుకుంటూ, వెంట వెంట ఆ రూళ్ళ కఱ్ఱ చూపిస్తూ వుంటే అంతా భయమే. చదువంటే అంతా భయమే, కామోసు, అని అనుకొన్నాను. కాని బడి అరుగుల మీద, వీధి నిండా ఇసకే! ఇసకమ్మటే గుంటలు, "గుంటలమ్మటే ఓనమాలు దిద్దుకోరా!" అని నన్ను హెచ్చరించారు. ఇదీ ఆ చదువు మచ్చు.

అయితే ఆబర్లో ఏడాదే చదివానో ఏణ్ణర్ధమే చదివానో, ఎవరికి జ్ఞాపకం. ఎవరి క్కావాలి అదంతా. బర్లోకి వెళ్ళానా లేదా, ఇంటికి తిరిగి వచ్చేనా లేదా అనే నాతల్లి దండ్రుల ప్రశ్న లా రెండేళ్ళూను.

మఱి 1899 కి అప్పుడే నా సరస్వతీదేవి యొక్క రంగ స్థలం వేఱుగా మారింది. ఆ యేడే స్థాపింప బడ్డట్టు కాపడుతుంది రాజమహేంద్రంలో హిందూ లోవర్ సెకండరీ స్కూలు. అందరకూ తెలిసే ఆ సంస్థయొక్క నామం "లక్ష్మీ నరసింహం గారి స్కూలు" ఈ లక్ష్మీ నరసింహంగారంటే కీ॥ శే॥ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు. ఆ బర్లో ఆ యేట నేను రెండో తరగతిలో చేరి చదివానట! "అంత ప్రాత విద్యార్థిని కావడం వల్లనే నిన్ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నాం" అని ఓ వత్సరం వీరేశ లింగాస్తికోన్నత పాఠశాలా ప్రాత విద్యార్థి సంఘం వారు నాతో అన్నారు. ఈ సందర్భాలన్నీ ఆ యీ స్థానిక విద్యాలయాల యొక్క నివేదికలు చదివితే బోధపడగలవు.

1899—1900 ఆ ప్రాంతమందు నేను రాజమహేంద్ర వరంలో చదివినప్పుడు, ఉపాధ్యాయుల్లో ఒకాయన మిక్కిలి పొట్టిగా వుండేవారు. ఒకాయన మిక్కిలి పొడుగ్గా ఉండేవారు. మొదటి యొజ్జలు రెండో తరగతిలో పాఠం చెప్పారు. రెండవ యొజ్జలు మూడవ తరగతిలో పాఠం చెప్పారు. వీరిలో మళ్ళీ ఒకర్ని యీ మధ్యను కూడా చూస్తూ వచ్చిన కారణంచేత ఆయన కనబడ్డప్పుడల్లా వెనుకటి వృత్తాంతం నాతో ఏకరు పెడుతూ రావడం వల్ల "కాబోసు కాబోసు" అని అనుకుంటూ కలే నిజమన్న మాదిరిగా కలం సాగించడానికి సాహసిస్తూ వున్నాను.

ఆ ఉపాధ్యాయు లిద్దరూ కూడా నాకు పళ్ళూ ఫలాలూ కొని యిచ్చేవారు. నేను అవి తినేశాక నన్ను యింటికి ముద్దు ముద్దుగా పంపేస్తూ వచ్చేవారు. ఇంటిపట్టా బర్లోనూ బుద్ధిగా వుంటూ వున్నానా లేదా అనే వారి వాకబు. పాఠాలు వచ్చినా రాకపోయినా తగాయిదా వుండేది కాదు నాకు ఆ మాస్టర్లకూ. అయినా పాఠాలు పడవనిదెప్పుడు నేను?

మఱి 1903 సంగతి మొన్న మొన్నటి "బడిగంట— బడిగంట" వ్యాసంవల్ల యావన్మందికీ తేటతెల్లమే! కాని ఆ సంవత్సరం నాకు చదువు చెప్పిన ఉపాధ్యాయు లెవరో కూడా నాకు స్ఫురణకు రావడం లేదు.

1897 కు 1947 ఒక విధంగా లెక్కిస్తే Golden Jubilee Year! నేను తొలుదొల్త దిద్దుకొన్న ఓనమాలకూ మేరువు పబ్బంచేయ వలసిన సంవత్సరం! అయితే 1897 సంవత్సరం ఎలాంటిదో గాని—నా జ్ఞప్తి పథంలో దాని రథనేమి నడచిన

రజాయే కానరాదు. ఆ రథం రథం రంగుమాయకుండా రూపం చెడకుండా రహదారీ నొవ్వకుండా 1903 చివఱ వరకూ ! సాగి పోయింది.

1904 జనవరిలో ఏం జరిగిందీ ! మా మేనమామ నా జేబులో ట్రాన్సుఫర్ సర్టిఫికెట్టు పెట్టి "తిన్నగావెళ్ళి నీవే బళ్లో మున్ను రెండవ తరగతి చదివావో ఆ బళ్లోనే రెండవ ఫారంలో చేరి చదువుకో ! నేను నీకూడా వచ్చానా, నేనేనిన్ను పంపించేశాను అంటారు ఇక్కడి అధికారులు. నీవే నీ అంతట నువ్వు యధేచ్ఛగా వెళ్ళిపోయినట్టు వెళ్ళిపోయి, చేరి బాగా చదువుకో" అని హెచ్చరించాడు.

ఆయనగారి లోపల ఆలోచన, మేనమామ మేష్టరుగా వున్న బళ్లో మేనల్లునికి చదువు రాదని.

మా మేనమామ, రామమూర్తిగారు, అప్పట్లో పురపాలక సంఘంవారి మధ్యమ పాఠశాలలో డ్రాయింగు మాస్టరుగా వుండేవారు. తరువాత తరువాత జాతీయోద్యమంలో తీవ్రంగా పాల్గొని జాతీయ విద్యాలయ సంస్థను తాముజీవించి వున్నంత వరకు నడపిన దేశభక్తుడు.

నన్ను వెళ్ళి చేరమన్నాడే గాని ఆయన, నేను తిన్నగా ఆ బళ్లోకి వెళ్ళి నా అంతట నేను చేరానా అని నా సందేహం ఎంచేతాఅంటే బడి ఎంత పాతదైనా పగబట్టిన త్రాచులా బుస కొడుతూనే వుంటుంది. అందులోను ఆ యేడు ఆ బళ్లో మాస్ట ర్లందరివద్దా, డ్రిల్లు మాస్టరు నుండి డిక్టేషన్ మాస్టరుదాకా కూడా గజం, గజం పేకబెత్తాలుండేవి అని ప్రతీతి. మరిన్ని సారమ్ము మాస్టర్లందరూ సత్యసంధులని, విద్యార్థియొక్క

డొక్క చీరేస్తానూ అంటే ఆ మాస్టరు ఆ విద్యార్థియొక్క డొక్క చీరెయ్యక మానడనే పుకారు. కొందఱు కొందఱు ఉపాధ్యాయులు పిల్లవాండ్రకు సుశిక్షనొసగే నిమిత్తం వేతనాలుకూడా తీసికోకుండా పరోపకారాయ పనిచేస్తూ వున్నారని పేరుగాంచేరుట కూడాను. దీన్నంతనూబట్టి చల్లగా నా జేబులో ట్రాన్సఫర్ సర్టిఫికెట్టుచింపేసి శ్రీరంగపట్నం వెళ్ళిపోదామా అని అనిపించింది. అనిపించిందే కాని చింపెయ్య లేక పోయాను—మా వూరు వెళ్ళలేక పోయాను.

కారణం; సీనారేకు దుకాణాలయొక్క చప్పుళ్లు, మఱిన్నీ చెంతనే బొందిలీ దుకాణదారుడమ్మే పంచదార పాకం పొరలింపు గన్న జీడిపప్పుగుండ్లు, ఇంకాచెప్పొస్తే ఆ ప్రాంతమందే ప్రతిష్ట గన్న చలివేంద్రశుద్ధి దాహం! ఒకటా? ఇవన్నీ చాలాకాలం క్రిందటే, నాయొక్క అజ్ఞానమప్పుడే, అస్థిగతమై అటువైపు మళ్ళీ మళ్ళీ ఆకర్షించుకున్నట్టు కాబడ్డాయి. నాకేడుపు రాకుండా తోడునీడై ఎవరో ఆ బళ్లో చేర్పించినట్టుగావుంది. నేను ఆనాడు ఆ బడిలో "రి ఎడ్మిట్" కావడ మనేది!

అంతాచదువే, అంతాకుదురే ఆ బడియొక్క ఏమూల చూచినా! అల్లరి చేసిన పాపాన్ని పోయిన పిల్లవాడే లేడు, ఆ పాఠశాల్లో ఆ యేడు. అల్లరి చేసాడా వాని వొంటిమీద వొకటిన్నర గజం పొడుగుకేనూ, పెద్ద జేను దేవుడులాంటి హెడ్ మాస్టరు చేతినుండిపడి ముప్పాతిక ముప్పాతికలైంది అన్నమాటే.

ఈ మాట నిజమా అని అనుకొనేవాణ్ణి చాలాకాలంనేను. "ముందుంది ముసళ్ళపండగ! అప్పుడే ఏమయింది?" అనే

వాడు నాతోడిసహాధ్యాయి. వాడి మాటలు విన్నప్పుడల్లా ఎప్పుడో నాకూ తప్పదనిపించేది పెళ్ళి.

ఇలా వుంటూ వుండగా ఆ సహాధ్యాయి నన్ను పరధ్యానిగా జేసి నాపనిపట్టిద్దామనే తలంపుతో ఓనాడు "బరిపోవాలి! ఈ సీనారేకు దుకాణాలుండాలి! బరిపోవాలి, జీడిపప్పు, చీనా గుండ్లు ఇలాగే అమ్మాలి బరిపోవాలి శుద్ధి దాహము ఇంతచిక్క గాను ఎల్లకాలం తాగాలి." అంటూ పాడాడు. "బరిపోతే అవీ వుండవు. అవి పోతే బరీ వుండదు రెండింటికీ అవినాభావ సంబంధం అన్నాను నేను. అప్పట్లోనా అభిమాన భాష సంస్కృతము లెండి, అతడు నా సహాధ్యాయి వట్టి తెనుగు పోతు, "అవన్నీ నాకు తెలియదు, ఈ బరిపోవాలి అని నాతో పాటు నీవు కూడా కోరతావా? లేదా? అని గ్రుడ్లురిమేడు. వాడు గ్రుడ్లురిమితే నేను నా గుండీలు ఒదులు చేసినవాణ్ణై "మావూళ్లో నడువీధిలో చింతచెట్టు మీద వేలకువేలు కొంగలువాలి వుంటాయి. ఎల్లప్పుడూ, వాటికి నివాసం ఆ చింత చెట్టే. చింతకొట్టేస్తే కొంగలుంటాయా?" అని సవాలేసాను. "ముందే కొంగ లెగిరి పోతే?" అని వాడు మొరాయించాడు. నేను మిన్నకుండి "చింత?" అని నాలో నేను ప్రశ్నించుకుంటూ నా గోళ్ళకేసి చూచుకున్నాను. గోళ్ళమీద తెల్లని చిట్టిగిరలు, "కొంగ కొంగ గోళ్ళు" అన్న ఆటగీరలు అతిగోముగా వెలిసిపోని మురిపెంతో వెలసివున్నాయి. "చింతా కొట్టేయ్యా తగ్గదే ఎగిరే కొంగను కనబడకుండా, చేస్తుంది చింత" అన్నాను ఎట్టకేలకు ఎలుగెత్తి.

వెనక పొంచుండి తరగతి గురువు విన్నాడో ఏమో "చింత? కొంగ? చింత కొంగ? అంటే చదువు వొస్తుందిరా

అబ్బీ:" అని వెంటనే చీటీ వ్రాసి బంట్రోతుకిచ్చి, బంట్రోతుతో కూడా నన్ను హెడ్‌మాస్టరుగారి రూమ్‌లోకంపాడు. ఆపాళంగా వ్రాసింది చూడకుండా బంట్రోతు నడక్కుండా ఏమని వేయను విశేషణం? ఏమన్నా "గుడ్డే" అప్పై యొజ్జలు టపటపా నాచెరో అరచేతిలోను చెరోదెబ్బా కొట్టేశారు. బాగా జ్ఞాపకం అరచేతులు రెండూ ఎఱ్ఱగా కందిపోయి రేఖలు నెత్తురు గాళ్ళుగా మారాయి. కళ్ళమ్మట నీటి వాకలు గుమిగూడి కావేరీ జలపాతంలా పడ్డాయి.

కాని నా నెత్తురుగాని నా కన్నీరుగాని రెండోవాని క్కాపలచకుండా, గుప్పిళ్ళు పట్టుకు, తెప్పలు కట్టుకు, గోళ్ళ మీది కొంగ తెక్కల రంగు చెఱిగి పోయేలాగు వుండిపోయాను. గుండె గొణుగు కూడా మఱచి; వెళ్లు అన్నాక వెలువడ్డాను.

నాటి నుండి సీనారేకు దుకాణాల భజన వినబుద్ధి కలిగిందిలేదు. జీడిపప్పుగుండు మీది పంచదార పాకపు మేలి ముసుగువంక చూడ్డమే మానేశాను. చలివేంద్రఠద్ది దాహం చింతగింజ మునగంది అయినావర్జించాను.

నడువీధి చింత అన్నా, ఆ చింతమీది కొంగలన్నా మరీ అసహ్యమై పోయినాయి.

ఇక బడిమాట వేరే చెప్పాలా! సహోధ్యాయి వినకుండా సహోధ్యాయి కంటె గట్టిగా శపించి పారేశాను ఆ సంజ "బరి పోవాలి, బరిపోవాలి!" అని.

పోయింది కూడాను ఆ బడి! ఆ బడి లేదు ఇప్పు డక్కడ. అక్క డిప్పుడో కాఫీహోటల్ ప్రబలి వుంది! యిపోయా ఆ సీనారేకు జిలిబిలి స్వేచ్ఛ గానాలూ. జీడిపప్పు మజాలు.

ఆ అంగళ్ళన్నీ పెద్ద మసీదుకేసి జరిగి పోయినాయి. లేవు లేవిప్పుడు మునుపటి చోటను అవి. చుట్టూ మందుల దుకాణా లున్నాయి యిప్పుడు. ఆ చలివేంద్ర స్థలమన్నది అక్రమ ఆ క్రమణగా తేలి వుంది నేడు. ఎక్కడా కనపడ్డమే లేదు. మా వూళ్లో నేనన్న చింతా కొట్టేశారు. ఈ దరిమిలాను, చింత కొట్టిన వంతను కొంగలూ వ్రాలడం చాలించు కొన్నాయి. ఎక్కడ వ్రాలడం అవి? వేలకు వేలు వ్రాలి ఆహ్లాదం గొలిపేవి అవి మున్ను. ఇప్పుడు వచ్చినీన్నీ ఎక్కడ వ్రాలడం అవి?

అవి నిజంగా ఒక్కొక్కప్పుడు యోజిస్తే నాకు రాణ్మ హేంద్రవరము నడిబజారునుండి, మా యూరి నడివీధి వరకూ సమస్తం శూన్యాకాశంగా కనిపిస్తుంది.

...."తెల్లవారను గడుసరి గొల్లవారు" ఈ రోజున పై దొలగినా! అఖండ భారతవర్షం భిన్నాభిన్నమైనా ఏర్పడే శూన్యాకాశం మాట? "కటా! ఏమిటా?" అని అనిపిస్తుంది.

.... .... .... .... ....

## కిసిమిసి పండగ సరదా

"కిసిమిసి" పండగసరదాలు డిశంబరు 25వ తేదీని ప్రారంభం! కాదు—డిశంబరు 24 సాయంత్రమే కొంచెం కొంచెంగా సంధ్యా రాగంతో ప్రారంభిస్తే ప్రారంభించొచ్చు. మఱి 24 తెల్లవాఱ గట్ల నగర సంకీర్తనం, ఉదయం గుడిలో ప్రార్థన, ప్రతియింటా "కిసిమిసి" వృక్షస్థాపన—వీటితో కిసిమిసి పండగ భూమికి దిగింది పూర్తిగా దిగింది అని అనుకోవాలి. ఏదైనా—25 వ

తేదీ సాయంకాలం జరిగే నృత్యగీత వినోదాల్తో కిసిమిసిపండగ వచ్చేసింది అని అనకతప్పదు. "కారు"లు మీదవెళ్ళే దొరలూ దొరసానులూ కార్లమీద వెళ్ళుతూవుంటారు. కారులమీద వచ్చే దొరలూ దొరసానులా కార్లమీద వస్తూవుంటారు. సైకిళ్ళమీద పోయే ఏంగ్లోఇండియన్ పిల్లకాయలు సైకిళ్ళమీద కనిపిస్తారు. కాలినడకను నడిచే దేశవాళీ క్రిష్టియన్ జనం కాలినడకను వెడుతూవుంటారు.

ఆలా పండగ సర్దాకొద్దీ వస్తూపోతూవుండే జనసమూహాన్ని తిలకిస్తూవుంటే ప్రాముఖ్యంగా ముస్తాబు చూపిస్తూ దృష్టినాకర్షించేవాళ్ళు భాగ్యవంతులకంటె బీదవాళ్ళే ఎక్కువ. ఏజాతి పండగలోవుండే తత్వంకూడా అదే ఏమో. సర్వసాధారణంగా నిత్యకృత్యంలోనయితం భాగ్యవంతులు ముస్తాబుకావడం రివాజు కాబట్టి భాగ్యవంతులయొక్క షోకు పండగ వాళ్ళల్లో పెద్దయిదిగా వన్నెకెక్కదు. కాని బీదవాళ్ళ రూపురేఖలో—గబుక్కున అమావాస్యవెళ్ళిన మర్నాటి రాత్రే పవర్ణమి వచ్చేసినట్టూ, ఒక్కమాటుగా నిండు చందురు డుదయించినట్టూ కనబడతాయి—పండగనాడు. హఠాత్తుగా, నవ్వుతూ కలకల్లాడుతూ, పరాసికాలాడుకుంటూ, పెద్దపెద్ద చీరల్తో, కొత్తకొత్తబొత్తాముల్తో పట్టు వోణీల్తో—చూస్తురా! పండగ అంతా తమరికోసమే అన్నట్టు ఉప్పొంగిపోతూవుంటారు వాళ్ళు. క్రితంరేత్రి పస్తున్నా గాని పబ్బంనాడు పరమాన్నం వండుకొని "ఏజన్మలో పస్తున్నాం? ఏ జన్మలోనూ పస్తుండలేదు" అని అనుకొనేటంత నిశ్చింతగా మసుల్తారు.

ఈనుండి నేను వ్రాయబోయే కథ పూర్వోక్త తత్వానికి గొప్ప తార్కాణం.

"రెబెక్కా" మిక్కిలి నల్లటి పిల్ల! నల్లందనమనే ఛాయ అందాన్ని చూపిస్తుందా అనాకారితనాన్ని చూపిస్తుందా అనే వితర్కింపున కిది చోటుగాదు. ఓ పిల్లనుచూచి ఆలా వితర్కించడం సబబూకాదు. పిల్ల యొక్క కళ్లు తెలికళ్ళయి, చూస్తూవున్నంతలో, పిల్లయొక్క వళ్లు కుదురుక్కుదురై, అదురుకు అదురై, నడుస్తూవున్నంతలో, పిల్ల నల్లటి పిల్లయితేం? ఎఱ్ఱటి పిల్లయితేం? శరీరచ్ఛాయ అనేది ఇంతకూ లోపలి యూహల్నిబట్టి మారుతూవుంటుంది. ఎదర చూచువాడు మగవాడై. మగవాడైయుండడమే కాకుండా చూడబడే సొగసుకత్తెను, ప్రేమించినవాడై, ఎప్పుడు కనబడుతుందా తన ప్రియురాలు, ఎప్పుడు పలుకరిద్దామాఅనే యువ్విళ్ళూటతో వేచియున్న కాముకుడైయుంటే, పిల్లకురులు తుమ్మెదసరులు, పిల్లలవాటం, నెలవంకవాటం, పిల్లముక్కు సంపెంగ చెక్కు పిల్ల పెదవి అమృతపుఁజవి—వాడే ఆ పిల్ల తన కక్కర్లేని వాడై తే— ఆ పిల్లలోచూచేవి అన్నీ వంకరలే—ఒక్కమాటలో చెప్పమంటే "బాగాలేదు. అబ్బెఛా" అంటాడు.

రెబెక్కాను ప్రేమించినవాడు మోసెస్. మోసెస్సును గుఱించి వ్రాయవలసి వచ్చినా అంతే. మగాడికి అట్టూ ఆడదానికి పిట్టూనా? మోసెస్ రెబెక్కా కంటిలో కనుపాపైనా డేనాడో!

డిశంబరు 24 మధ్యాహ్నంనుంచీ రెబెక్కాయొక్క సంకల్పం అతివేగంగా మోసెస్‌ను 25 వ తేదీని కలుసుకుందామని "నీకు మంచి కిసిమిసిపండగ" అని చెబుదామనీ సంకల్పం. కాని మోసెస్ బహూ బీదవాడు. మతం పుచ్చుకున్నా

డన్న మాటేగాని చెప్పులు కుట్టుకునేవృత్తి మానలేకపోయి నాడు. చిన్నప్పుడు మాదిగకులంలో పుట్టినవాడులాగుంది. ఇఖ ఆకులం అంటే హిందూసంఘంలో అట్టడుగుకులం. ఆకులవృత్తి తానుమాని పైకిరావాలంటే చాలా ఆధ్యాత్మికశక్తి చాలా ఆర్థిక శక్తికూడా వుండాలి వాడికి. ఒక్కక్రిష్టియన్ మతం పుచ్చు కున్నమాత్రాన్ని రానేరదు. రెబెక్కా గ్రుడ్డిలో మెల్లఅన్నట్టు కాస్తనయం. ఆమె తల్లి ఓ దొరగారియింట "ఆయా" గా వుండి దొరగారిపిల్లల్ని త్రోపుడు బళ్ళమీద త్రిప్పుతూవుండేది. ఆమెకు ఆరోడుల్లో పుట్టింది రెబెక్కా రెబెక్కా క్రమంగా పెరిగి మిషన్‌బళ్లో చదువుకుంటూవచ్చింది. చదువుకుంటూవున్నా పెద్దచదువు చదువుతూండలే. నాలుగోతరగతిలోకి వచ్చింది పదహారోయేట. ఏం చదువుతూవున్నా మిషన్ బళ్లో చదువు కుంటూవున్న క్రిష్టియన్ అమ్మాయి కాబట్టి తెల్లని మల్లిపూవు లాంటి కోక, అలాంటిదే కబ్బా, వంటిని ధరించి, తప్పకుండా ఓ పువ్వు తల్లో తుఱిమి చూపఱకు పేకువనే ఎదురొచ్చినా మంచి శకునమే అనిపించింది.

ఇక్కడ పాఠకునకు ఒకసందేహం తోచవచ్చును. అసలు రెబెక్కాకు మోసెస్సుకు అటువంటిపరిస్థితిలో ఎలా స్నేహం కలిసిందా అని.

ఆ సందేహం తీరాలీఅంటే ఓ ఇతిహాసం తెలుసుకోవలసి వుంటుంది.

అది ఏమిటీ అంటే పూర్వం ఒక ప్రాయంపు రాజ కుమార్డు పచారుచేస్తూ తన ప్రాసాదో పరితలాన్నుంచి క్రింది వీధికేసి పరికిస్తూవున్నాట్ట. ఆ సమయానికే వీధిలో ముంగిలి

తుడుస్తూవుందట ఒక్కతై—యౌవనంలోవున్న కార్మిక స్త్రీ వెంటనే ఆ కార్మిక స్త్రీని రాజకుమార్తు తన మేడమీదకు పిలిపించాట్ట పిలిపించి "నీవు నా రాణివి" అన్నాట్ట. కార్మిక స్త్రీ కొంచెంజంకి "స్వామీ! మీరు మహారాజులు" అందిట తన తొడలచాయ కనబడకుండా కొంచెం దిగదోసుకుని. "అయితే" అన్నాట్ట యువరాజు మీసం మెలిపెట్టుకుంటూ "మీరు మీసాటి భాగ్యవంతుల్ని వివాహ మాడవలసింది" అందిట, దానికి అత గాడన్నాట్ట. "సమానభాగ్యం ఓ యిద్దర్ని దంపతులుగా చేసే టప్పుడు "సమానవయస్సు ఎందుకు చేయకూడదు? అని అడిగాట్ట. కార్మిక స్త్రీ అడిగిందట అప్పుడు "ఈ ప్రేమ ఇలా వుంటుందా?" అని "ఎందుకువుండదూ?" అన్నాట్ట. కుమార రాజులుంగారు. అయితే తన గుడిసెకు రమ్మందిట కార్మిక స్త్రీ. యువరాజు వెంటనే ఆలోచనలో బడ్డాట్ట. "ఏం? ప్రభువులు ఆలోచిస్తున్నారు?" అందిట ఆమె. యువరాజు "ఈలా మనం నిలుచునియుండగా ఈ సౌధం కూలిపోతే ఎంతబాగుండి పోయీదో—అని యోజిస్తూ వున్నాను, నేను ఈ సౌధందిగి నీ గుడిసెకు చేరేటంత కాలహరణం "ఓర్వగలనా? ఓర్వ గలనా?" అన్నాట్ట. అలా అంటూ యువరాజు మూర్ఛపోయి నాట్ట. కార్మిక స్త్రీ మేడమెట్లు దిగిపోయి తనతోడి కార్మికుల్ని పిల్చి తక్షణం ఆ సౌధాన్ని పడగొట్టి తన గుడిసెతో సరిసమా నంగా చేయవలసింది" అందిట. తోడి కార్మికులంతా "మూర్ఛ పోయిన యువరాజు తాముకూలగొట్టేగోడల్లో కప్పబడిపోతా డేమో" అన్నారట. ఆమె వెంటనే "ఇదిగో నా చేతుల్లోకి అతడు పడేటట్టు చేసుకొంటాను అతనికి దెబ్బతగల్నివ్వను"

అందిట చేత లిలా ఎత్తి—అక్కడికే ఇతిహాసంలో మనక్కా వలసిన భాగం—

కథ క్కాక్కేమిటి అన్న సామెతగా ప్రేమక్కూడా కాళ్ళు ఒక్కొక్కప్పు డగుపించవు? అంతేగా ఇతిహాసంలోని సత్యం? మన కథలోని సత్యం అంతే.

మోసెస్సుకు క్రిష్టమస్ బహుమానాలు ఇచ్చేదొరలుగాని దొరసానులుగాని ఎవరూలేరు. అంచేత 25 వ తేదీ సాయంత్రం ఎక్కడికీ వెళ్ళకుండా "రెబెక్కా అలా వెడుతుంది గదా ఆమె చూపుకే తన కానుక" అన్నట్టు ఓ మలుపులో ఓ జంతికలమ్మే అరుగుమీద వుత్తినే కూర్చున్నట్టు కూర్చున్నాడు.

రెబెక్కాకు ఆ సంగతి తెలియదు. 25 వ తేదీని ఏలాగో ఓలాగు మోసెస్సును చూడాలనేగాని ఎక్కడ? ఎప్పుడు? అనే ఏంతన చేసుకొని సంకేతించుకోడానికి తీటికలేక పోయింది. ప్రొద్దున్న ఛర్చికివెళ్ళింది మధ్యాహ్నం తన బడి దొరసానమ్మ గారు బహుమానాలిస్తారు అంటే దొరసానమ్మగారి యింటికి వెళ్ళింది. ఆ రెండుపనులతోటే కిసిమిసిరోజు ఇరవైనాలుగు గంటలూ నిండిపోయినట్టుగా తోచిపోయింది.

ఏ మలుపు దగ్గఱ మోసెస్సు కాచికొనివున్నాడో ఆమలుపు మళ్ళుతూవుంది రెబెక్కా, తనకు దొరసానమ్మగారిచ్చిన బహుమతిపటం వక్షానికి హత్తుకుంటూ మోసెస్సు చటాల్న అరుగు దిగి ఆమెను వెంటాడిస్తూ "రెబెక్కా" అన్నాడు. రెబెక్కా వెనక్కుతిరిగి చూచిందై "ఇక్కడున్నావా?" అంది. "ఏదీ నీ బహుమానం?" అన్నాడు, దగ్గఱగా వెళ్ళి. ఆమె తన చేతుల్లోనే ఆలాపట్టుకుంది పటం తాను కూడా చూస్తూ— మోసెస్సుకు పటం కావాలా?

పటం చాటుచేసి రెబెక్కాకు ఒక్కముద్దిచ్చాడు. రెబెక్కా "ఇందుక్కాదు పటమిస్తా దొరసానమ్మగారు" అంటూ తన బుగ్గ తుడుచుకుంది. మోసెస్సు అన్నాడు "నీకు మంచి కిసిమిసి" అని. రెబెక్కా "చాల్లే నడీదిలో" అంది.

మోసెస్సు అన్నాడు "రెబెక్కా! నా ప్రియమైన రెబెక్కా! యేసుపటం గోడనువున్నప్పుడు యేసు తాను ప్రజల యెడ చూపించిన ప్రేమను మనకు చాటుతూవుంటాడు. యేసు పటం మనచేతుల్లోవున్నప్పుడు మనల్ని మనయొక్క యేప్రేమ అయితే గలదో ఆయొక్క ప్రేమను లోకానికి చూపమంటాడు" అని. రెబెక్కా అంది "యేసు మనచేతుల్లో పటంగా గాక, గోడమీద పటంగా గాక, మనహృదయంలో భావంగా వుంటే?" అని. మోసెస్సు "మనం మన ప్రేమను లోకానికి తెలియకుండా మనలో మన యిద్దఱికే తెలిసేటట్టు అనుభవించాలి" అన్నాడు.

రెబెక్కా నవ్వింది. నేడు మహా మంచి కిసిమిసి అయిందోయి నీ ప్రసంగంవల్ల" అని. రెబెక్కా సంపుల్ల పుండరీక పుష్పంలా విఱగబడి నవ్వింది!

.... .... .... .... ....

## ఎట్టిటి మట్టిపళ్ళు - ఎట్టి టోపీలు

ఒకానొక దేశనాయకుడు వస్తాడనిచెప్పి, పోలీసుదళాన్ని, 50 గజాల కొక్కొక్కడిగా, నిలబెట్టి, రోడ్డంతా కాపలాకాయమన్నారు. జనం ఎవరూ ఆ మధ్యను నడువకూడదు. ఎవరూ మాట్లాడకూడదు నాయకునకే ఆదారి, ఆ తదంగము అదంతా?

ఇదంతా ఈ మధ్యను జరిగినది సుమండీ! మన నాయకులు సంఖ్యలోను, సమాచారంలోనూ ఎక్కువ అయిన ఈరోజుల్లోనే: ఏనాడో ఇంగ్లీషువాళ్లు పరిపాలనచేసిన ఆ రోజు అయితే, "పరాయిప్రభుత్వం, వాళ్ళకేం ఎంతఖర్చు అవితేం," అని అనుకోవచ్చుకాని, ఈ రోజుల్లో కొన్ని లక్షలు ఈకమానులకని, కమామీషులకని వెచ్చించడముందే అది నిజంగా గర్హించతగ్గదే వారేంకారణం చెప్పినా. అయినా చూచేవానికి కడుపు ఒక మూల మాడుతూ వున్నా, కన్నుల పండవగాచూస్తూ కరతాళ ధ్వనులు చేస్తూండగలడు. అది ఈ యేర్పాటంతలోనూ వున్న మహాకీలకం.

మాట్లాడే వ్యక్తి దేన్నిగురించి మాట్లాడు ? దేశదేశాల మధ్య, ఖండ ఖండాలమధ్య శాంతి కావలసిన వస్తువుఅని, విజ్ఞానమువల్ల విడివడిన మారణాస్త్రములన్నీ వినాశకరములనీ, యుద్ధం మానవునియొక్క ఆలోచనలోనే వుండకూడదని, అంతా ఒక యెత్తునుండి ఉపన్యసిస్తూ ఉన్నాడు. ఉద్యోగస్థులు తలలూపుతూ వున్నారు. ఉన్నవారు లేనివారుకూడా మహ బాగా చెప్పేడు అంటే, చెప్పేడు అని ఊఁ—ఆకాశమందుకున్నారు.

రాత్రి ఇంటికి వచ్చి నేనున్న పడుకున్నాను. పడుకుంటే ఎంతసేపటికి నిద్రపట్టదే? మానవప్రకృతిలో మానసికపు కృతి బహూ విచిత్రమైనది అని అనుకుంటాను. నా మనోవేగము, వెనకముందూ నేడూకూడా గమనించడానికి పూనుకొంది. రష్యా, అమెరికా, బ్రిటన్, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, మున్నైన దూరఖండాల యొక్క ముఖ్యపట్నాలను తిలకిస్తూ, అక్కడక్కడున్నటువంటి ప్రజలెట్టివాళ్లో తిలకించసాగాను. అసలు ఎన్నడూ నేనా దేశాలు చూడలేదనుకోండి! అయితే మనస్సుకేం

లోటు ? ఒకమాటు ఏరోప్లేనుమీద, ఒకమాటు రైలుబండీమీద. ఒకమాటు కోచ్ మీద, ఒకమాటు డోలీమీద ఇలా వెళ్ళిపోయి నాను. ఒక్కొక్కసారి నడచినట్టే నడచి యీదేవాణ్ణి. అంతలోకే నీళ్లైలావచ్చాయో ? జనం సందడిగావుంటే ఆగలేక తప్పించుకు తిరిగేవాణ్ణి ఒంటరిగా ! మఱిన్ని ఒక్కొక్కప్పుడు దేవాసుర యుద్ధం, ఒక్కొక్కప్పుడు రామరావణాసుర యుద్ధం కూడా ప్రత్యక్షమైనాయి. కోతులు కోతులులాగే తోకలతోటి, రాక్షసులు రాక్షసులలాగే పెద్ద కోరలతోటి కనబడ్డారు. ఇవన్నీ పోనీ ఖగోళశాస్త్రంలోను, పురాణాల్లోను చదివాను అని అనుకోండి. దీనిసంగతి ఏం చెబుతారు ? ఎన్నడూ చూడని ఆలోచనలు కూడా కొన్ని గోచరమైనాయి యీ మనోనేత్రానికి. అవి నీడలా అంటే నీడలుకావు. నీడలకు ఒక నియమము, అసలు దానికీ సంబంధించి వుంటుంది. ఈ క్రొత్తగా గోచరించింది ఎవరికీ చెందిందికాదు. తెల్లాటిచూడ్డం తటస్థిస్తుందా, తుడుపుడు కత్తేను చూచినట్టు, పచ్చగడ్డికోసే పడుచుని చూచినట్టు, రిక్షావాణ్ణి కను గొన్నట్టు, అని అంటే లోకంలో నేను కన్నది ఆ లోకం అను కుంటాను. లోకంబులుతెగి, లోకస్థులుతెగి, ఆ వెనుక కానవచ్చే పెంజీకటి కవ్వలనుండే వెలుగుకూడా నిర్వచింప బడిందికాని, నా మనోనేత్ర దృశ్యము నిర్వచింపబడరానిది.

అంతచేటు నిర్వచింపబడరానిదవితే, ఇక కథేం వ్రాస్తావు అని అడుగవచ్చు పాఠకులు. పాఠకులకు ఆలాంటి ప్రశ్నవేయ డానికి హక్కువున్నది. స్వర్ణయుగమంటే అర్థమడిగిన పాఠకులకు ఇదోవ్యర్థప్రశ్నరాబోదు. కొందఱన్నారు—స్వర్ణ యుగమంటే — ప్రతిమనిషి బంగారు పోతలోపుండేవాట్ట

ఆ యుగంలోనని. అయితే నా అర్ధం అదికాదు. స్వర్ణయుగం అంటే సౌఖ్యయుగం అని నా వ్యాఖ్యానం.

దేశదేశాలమధ్య శాంతి సౌఖ్యాలుండాలనే కాదు. దేశంలోకూడ అంతశ్శీలత హెచ్చయి దానంతటదే భద్రత చేకూరాలని పటాలన్ని ఏలాలేకుండా చేయాలని ఎంచుతూ వున్నాయో, పోలీసుల్ని కూడా అలాలేకుండా చేయాలని. అప్పుడది స్వర్ణయుగమని నా తాత్పర్యము. ఈ దృష్టినే ఆ రోజు నాకు తెల్లారింది.

వెంటనే వెళ్ళిచూచాను. గత సాయంత్రం చూచిన రోడ్డంతాఖాళీ! మనుష్యులులేరు. మనుష్యుల నరికట్టే పోలీసు దళంలేదు. పశువులాళ్ళు పశువుల్ని ఆ దారినే తోల్తున్నారు. కూలీలు ఆ దారినే నడుస్తున్నారు. ఒక్క పోలీసూ నాకు కనబడ లేదు. అయితే ఆ పోలీసులు ఒక పదిహేను వందలైనావుంటారు. వీళ్ళంతా ఏమైయుంటారు అని విస్తుపోయాను. ఏర్పాటు తెలియకే అనండి. వెఱ్ఱివానిలా కొంతసేపు తికమకపడ్డాను.

ఒకటుంది చూడండి! పోలీసువానియొక్క ఎత్తు, ఎర్రని టోపీవల్ల, పోకజోడుయొక్క ఒత్తిడివల్ల బోధపడగలవు. ఎర్రనిటోపీలయొక్క ఎత్తు మరికనబడలేదుగాని, జోళ్ళయొక్క ఆనవాలు కనబడింది. దాంతో ఇలా వెళ్ళకూడదా వీళ్ళు అని ఊహించాను. ఆ దారి పుచ్చుకున్నాను.

తిన్నగా వెళ్ళి వెళ్ళి ఒక సమస్థలంలో ఒక మఱ్ఱిచెట్టును చరిసాను. మఱ్ఱిచెట్టుచుట్టూ ఒక సిమెంటు దిమ్మవుంది. చెట్టు చాలా పెద్దది కొమ్మలనిడివి హెచ్చే, ఊడలసంఖ్య హెచ్చే. అంచేత అన్నాళ్ళనుంచి అక్కడ నిలవగలిగింది. ఆ దిమ్మమీద

ఈ పది హేనువందలమంది తమ పది హేనువందల నిడుపాటి ఎఱ్ఱటిటోపీలు పెట్టి దిరీసువేసుకొంటూ, జోళ్ళు తొడిగారు, తిరుగ ఎక్కడకో వెళ్ళడానికి : ఎక్కడో కాపలా కాయడానికి.

ఈ లోపున ఒకగాలి వీచింది. ఆ చెట్టుయొక్క ఎఱ్ఱటి పళ్ళు వాళ్ళతలమీదపడి కాళ్ళముందు నిల్చాయి. వెంటనే వాళ్ళు ఆ ఎఱ్ఱటి మఱ్ఱిపళ్లను తమ నల్లటి జోళ్ళతో నలగ ద్రొక్కి మఱీ ధరించారు తమ ఎఱ్ఱటోపీలను.

"ఏమర్రా! మీ యెఱ్ఱటోపీలను నెత్తిమీద పెట్టుకున్నారు. ఈ యెఱ్ఱటి మఱ్ఱి" పళ్ళను మట్టేశారు. ఇదా మీరు నేర్చిన పాఠం? అని అడిగాను. పది హేనువందల మంది పోలీసులు నా వైపు తమ తమ తుపాకులయొక్క విచ్చుకత్తుల్ని చూపిస్తూ "మిమ్మల్ని అడ్డమడి అసలు ఇలా ఎవరురమ్మన్నారూ?" అని ప్రశ్నించారు.

"ఎఱ్ఱటి పళ్ళను ఏరుకోవడానికి" అని జవాబుచెబుతూ నిష్క్రమించాను.

.... .... .... .... ....

## అగసాతె కుంపటి

అనగనగా ఓ శ్రీకృష్ణపట్నంలో విశ్వకర్మ వీరబ్రహ్మం అనే అతనికి గొప్పకర్మయోగి అని ప్రతీతి. ఆ ప్రతీతి వింటూరాగా రాయిపూళ్లో అగ్రకుల స్తుతైన వేదాంతం పరబ్రహ్మంగారనే ఆయనకు ఓమాటు ఎవరా యీ వీరబ్రహ్మంగారు అని చూడ బుద్ధిపుట్టింది.

వీరబ్రహ్మం అగసాలెకు వేదాంతం పరబ్రహ్మంగారు విచ్చేశారు. వీరబ్రహ్మం లేచి బ్రాహ్మణోత్తములకు నమస్కారంచేసి వచ్చిన కారణం అడిగేడు. అంటే వేదాంతం పరబ్రహ్మంగారన్నారు "మిమ్మల్ని చాలా కర్మ తాపత్రయులుగా భావించి లోకం మిక్కిలి జాలిపొందడం వింటూవచ్చాను. అంచేత మిమ్మల్ని వేదాంతులుగా చేయాలనే సంకల్పం పుట్టింది నాకు" అన్నారు వేదాంతం పరబ్రహ్మంగారు. వీరబ్రహ్మం వెంటనే తలొంచుకొని తనమూనాన తనసుత్తితో తనసానమీద బంగారపురేకు సాగేసుకుంటూ వున్నాడు వీరబ్రహ్మం ముందు వొక కుంపటి వుంది. అది ఊకనే రగుల్తూవున్న బొగ్గులతో తేజరిల్లుతూవుంది. పక్కనే చింతపండు మెలుగిసుర కుంకుడు కాయ ఇత్యాదు లేవేవో కలిపివున్న పెంకువుంది. వేదాంతం పరబ్రహ్మంగారు ఆ కుంపటీ ఆ కుండపెంకూ అమాంతంగా ఎత్తి వీధిలో ఓమూలకు గిరాటేసి వెళ్ళిపోయినారు.

అలా చేయడంలో వేదాంతం పరబ్రహ్మంగారి అభిప్రాయం ఏమిటో వూహించండి పాఠకులు :

ఏమిటంటే—వీరబ్రహ్మానికి "ఆ బంగారప్పని శాశ్వతం గాదని ఆ పనేకాకుండా ఏ శరీరం కూడా శాశ్వతం గాదనీ వేదాంత పరిజ్ఞానం వొక్కటే శాశ్వతమనీ సూచనగా చెప్పాడన్నమాట ఆ సాహసకార్యంచేసి ఆ వేదాంతి.

విశ్వకర్మ వీరబ్రహ్మం తలెత్తి చూచేడు. కోపం తెచ్చుకోలేదు. తన కుంపటప్పటిది పగిలిపోయిందని వగపలేదు. వెంటనే తన దుకాణంమీదికున్న కొట్టుగది తీసి అందులోవున్న మటోపగిలిన కుండయొక్క ముక్కతోను, మటో కుండయొక్క

మట్టుతోను, మట్టికుండయొక్క పెంకుతోను, తనకువలసిన పరికరాలమర్చుకొన్నాడు పనిసాగించుకుంటూవున్నాడు.

మర్నాడు మళ్ళీ వచ్చారు వేదాంతం పరబ్రహ్మంగారు. వస్తే ఎప్పట్లాగే పని చేసుకుంటూ వున్నాడు విశ్వకర్మ వీరబ్రహ్మం వేదాంతం పరబ్రహ్మంగారు వీరబ్రహ్మం యొక్క పనితనం చూస్తూనే మళ్ళీ మర్నాడుకూడా ఆలాగేచేసి వెళ్ళిపోయినాడు. దానికిన్నీ విశ్వకర్మ వీరబ్రహ్మం కించిత్తూ నసక్క బెసక్క తనకొట్టుగది తీసికొని మట్టికుంపటి అమర్చుకున్నాడు.

వేదాంతం పరబ్రహ్మంగారు మూడోనాడు వచ్చారు. వచ్చి అదే పని చేయబోయి.—ముక్కలైన పాతకుంపటా అది, లేకపోతే కొత్తగా కుండపగలగొట్టి అమర్చుకొన్న కుంపటా అని ఎగాదిగాచూచేరు. విశ్వకర్మ వీరబ్రహ్మం వేదాంతం పరబ్రహ్మంగారికేసి చూచి స్వామీ! ఏమిటి పరిశీలిస్తున్నారు?" అన్నాడు. అంటే వేదాంతం పరబ్రహ్మంగారు, "ఓయి! వీరబ్రహ్మం! రోజూ ఒకకొత్తకుండ పగలగొట్టి ఇలాగ్గా కుంపటి చేసేస్తున్నావన్నా నీకు వేదాంతం తోచడం లేదోయి? ఈ ప్రపంచం అశాశ్వతం అని తట్టడం లేదుటోయి?" అన్నారు.

"ఎందుకు తట్టాలి?" అన్నాడు వీరబ్రహ్మం "ఎందుకా? చూడు!" అన్నారు వేదాంతం పరబ్రహ్మంగారు. వెంటనే కుంభకారునింటికి మనిషిని పంపించి ఒకకొత్తకుండ తెప్పించారు, తెప్పించి ఆ కుండనల్లా విశ్వకర్మ వీరబ్రహ్మానికి చూపించేరు. చూపించి అనేరు "వీరబ్రహ్మం! ఈ కుండలో చూడు! ఏముంది? ఏమీలేదు ఘటాకాశం వుంది. ఇది పగల

కొడితే ఏమౌతుంది? ఘటాకాశం మహదాకాశంలో కలిసి పోతుంది? అవునాకాదా?" అని ఆ కుండ పగలగొట్టి "ఇంత మాత్రపుదే మనజన్మ" అన్నారు. వీరబ్రహ్మాం ఆ మాట వినిపించుకోకుండానే తనకొట్టుగది తీసినటువంటివాడై, అది వరకు తనకొట్టునిండా వున్న పగిలిన భాండాల్లోకి యీ వేదాంతం పరబ్రహ్మంగారు పగలగొట్టిన కొత్తకుండయొక్క ముక్క ముక్కల్ని కూడా విసిరేడు.

వేదాంతం పరబ్రహ్మంగారు ఆ వీరబ్రహ్మాం ఆలా విసరడంలో కొట్టుకేసి చూచి ఆ కొట్టునిండావున్న పగిలినకుండల యొక్క అసంఖ్యాకపు ఖండఖండాల్ని కనిపెట్టి ఆశ్చర్యపోయారు.

"అయితే రోజూ నీవొక కొత్తకుండ పగలగొట్టటంలేదు? నేను కుంపటివిసరేసినప్పుడల్లా?" అని అడిగారు పరబ్రహ్మం గారు వీరబ్రహ్మాన్ని. "లేదండీ" అన్నాడు వీరబ్రహ్మం. "ఈ కుండ ముక్కలన్నీ నా సొంతం సుమండీ" అన్నాడు కూడాను.

వేదాంతం పరబ్రహ్మంగారికి నిండాఆశ్చర్యం వేసి పోయింది ఆ పలుకుతో.

అప్పుడిలా చెబుతున్నాడు వీరబ్రహ్మాం తన గాథ.—

నన్ను పుట్టించిన బ్రహ్మదేవుడు దగ్గఱ అసలు మూడు భాండాలు వుండేవి అమృతభాండం, జలభాండం, వాయుభాండ మున్నూ—నన్ను పుట్టించినప్పుడే మిమ్మల్ని పుట్టించేడు బ్రహ్మదేవుడు మీరు మఱచిపోయినారేమో—అప్పుడు బ్రహ్మ దేవుడు మీకూనాకూ కూడా మూడు భాండాలూ చూపించి యీ మూడుభాండాలు ఎలాగ్గా ఉపయోగిస్తారు అని అడిగేడు.

అడిగితే మీరు మూడింటికి వొకే సమాధానంగా ఘటాకాశం మహదాకాశం అని ముందుగా వాయుభాండం పగలగొట్టేరు. బ్రహ్మ "నడవ్వయ్యా! ఇక్కడవుంటే తక్కినవికూడా పగల గొట్టగలవు" అని మిమ్మల్ని ముందు కిందకు తోసేసేడు; ఆ కారణంచేత మీ రగ్రగవర్ణంవారయి వేదాంతం పరబ్రహ్మంగారయి పోయినారు భూమ్మీద; నేను మీరు పగలగొట్టిన ఆ వాయు భాండం యొక్క ముక్కలు జాగ్రత్తచేసేను. అప్పుడే జాగ్రత్త చేసేను. బ్రహ్మ "ఎందుకు ఆ ముక్కలు తీస్తావు?" అన్నాడు. అంటే కుంపటిచేసి అందులో బంగారం కరగేస్తాను అన్నాను. బంగారానికి మెఱగెడతానన్నాను. భేషైన కర్మిష్ఠివి నీవు జల భాండంకూడా పుచ్చుకోమన్నాడు. పుచ్చుకోమంటే జలభాండం పుచ్చుకుచూశాను. నీళ్ళు వంచితే అదీ వాయుభాండం అయిపోయే టట్టు కనబడింది అప్పుడు అది మీకంటబడితే కర్రదెబ్బ తినగల దని కిందరు దాన్ని తెచ్చి కుండల మరలో జతపఱచి ఓ నూతి మీద మా తోటకమర్చాను. అప్పుడా నూతిలోనీళ్ళు ఊరింపు కుంటూ అదే తిరగడం తిరగడం! మఱి బ్రహ్మదేవుడు ఆ నా కుశాగ్రబుద్ధికి మెచ్చుకుని "మొక్కలకు జీవం వచ్చింది వోయి నీ చర్యవల్ల యీ అమృతభాండం పుచ్చుకో" యన్నాడు. వెంటనే ఆ అమృతభాండం స్వీకరించి అది చిన్న చిన్న కుండ ల్లోకి దీసి రసవిష గంధకాదులతోనూ వండి కుప్పెలుకట్టి ఆయుర్వేద వైద్యం ప్రారంభించాను. చూడండీ మీ వేదాంతు లైతే పగలగొట్టిపుందురు ఆ పాళంగా దాన్ని—"

వేదాంతం పరబ్రహ్మంగారు విశ్వకర్మ వీరబ్రహ్మంగా రలా చెబుతూవుంటే వింటూ అడిగేరు. "మఱి కుండలమఱలో

తాడు తెగి కుండలు కిందపడి చితికితే? రసవిష గంధకాదులు వండినప్పుడు ఆ మందులు కుండనంటుకు చిట్లంకట్టుకుపోగా నీవు గోకడంలో కుండలు పగిలిపోతే?"

వీరబ్రహ్మం వెంటనే అన్నాడు. "ఆలా పగిలిన కుండల పెంకులన్నీ, కుండల మూతులన్నీ, కుండల మట్టులన్నీ యీ కొట్లోకి జేరేసుకున్నవాణ్ణై ఏ వేదాంతులు వచ్చినా అగసాలెలో ఓ కుంపటి లాగేస్తే మరో కుంపటి అమారుచేసు కుంటూ వుంటాను" అన్నాడు.

"ఎంతమంది వేదాంతులొచ్చినా అతని కుండ పెంకు లన్నిటినీ, కుండమట్టులన్నిటినీ, కుండముక్కలన్నింటినీ, అవతల పారవేయలేదనీ, పారవేసినకొద్దీ అవి ఊరతాయనీ, ఎక్కడ పారవేస్తే అక్కడే దారి కడ్డుపడతాయనీ ఊహించుకుంటూ "ఈ కుండల ఖండాల్ని కుంపట్లగా ప్రజ్వలింపజేయడమే లోకాని కుపకారము" అనీ తలపోసుకుంటూ వెళ్ళిపోయినారు. వేదాంతం పరబ్రహ్మంగారు, విశ్వకర్మ కృషి కీర్తిస్తూ.

వాయుభాండా లెన్ని చితికిపోయి తొక్కుడు బిళ్ళలుగా మారిపోయి అడుగంటిపోయినా, కుండల మటులు ఎన్నికూలి పోయినా, అమృతభాండాలెన్ని ఆఖరు అయినా, విశ్వకర్మ వీరబ్రహ్మం యొక్క కుంపటిని మరి తీసిపారవేసిన వేదాంతి లేడు. అదే చిరస్థాయిగా లోకంలో నిల్చిపోయింది.

.... .... .... .... ....

# పల్లమ్మ

పల్లమ్మ కనక గ్రీసుదేశంలో స్పార్టాఏథెన్సు మున్నగు పట్నాల యొక్క ఉచ్ఛలోపుట్టి పెరిగి వుంటే ఒక చక్కని శిల్పవుచేత

విగ్రహానికి ఆదర్శప్రాయురాలిగా వుండిపోయేది. అదేకనక భారతదేశంలో పౌరాణికయుగంలో జన్మించి జవ్వనం దాల్చి వుంటే మంచి పాతివ్రత్యానికి ఆదర్శప్రాయురాలిగా వుండి పోయేది. పోనీ అంతపని జరిగి వుండడానికి బ్రహ్మ వొప్పు కొని వుండకపోయినా ఆమెను అథవా ఒక సంపన్నుల యిండ్ల అధునా సృజించియుండవలసింది, అలా సృజించిపెంచివుంటే ఆమె నిజంగా పెద్ద మోటారెక్కి తిరిగివుండేది, అందులో ఒక శంఖాలహారం నిక్కి నురోజాం చాలమీద తులకించుకుంటూ ఒయ్యారంగా కూర్చునివుండేది. చేతులు ముట్టుకుంటేనే కంది పోతాయా అన్నంత మెత్తందనంతో విలసిల్లిపోయి యుండేది. ఇక బుజాలమాట, చెక్కిళ్ళమాట, తలపోస్తే రాజపుత్రి అంటే అలా వుంటుంది కాబోసు అని అనిపించివుండేది.

వల్లమ్మ జాతకరీత్యా పైవానికి పేనికీ నోచుకోలేదు. పుట్టింది వారానొక పూరిమెల్ల. చెట్టాపట్టిం దొకానొక కామాటి బొట్టెణ్ణి. పెట్టుకునేది మెళ్లో ఒకతీగ, కట్టుకునేది వొంటినో తోపుచీర.

మొగుడికి పొద్దున్నే జావకాచి పోసి, వణ్ణంమూట చేతి కిచ్చి, తానోచిన్న వణ్ణంమూట చేతికెత్తుకొని, మొగుణ్ణి పట్నంలో పనిలోకి పంపి తాను దివాన్‌చెరువు ప్రాంతాల్ని వున్న రిజర్వ్ అడివిలో పుల్లలేరుకోవడానికి పోయేది. మొగుణ్ణి మళ్ళీ వల్లమ్మ చూడ్డం అనేది రాత్రి 7, 8 గంటలప్పుడే. తాగివచ్చి వాడు : " ఏమిట్రాకంపు " అని వల్లమ్మ అడిగితే, "నీకెందుకుపోదూ!" అనీ వాడు తెలివిలో. మళ్ళీ తందనాలాడి చిందులుతొక్కీవాడు, తాగుడుమైకం మితిమీరడంలో—వల్లమ్మ వాణ్ని " ఎక్కడరా

నీ తాగడం ?" అని కూడా అడిగేదికాదు. అడిగితే సున్నంలో కెముకలేకుండా చితక్కొడతాదేమో ! వాడు తందనాలాడి చిందులు తొక్కుతూన్నంతసేపూ ఆ ఆడకూతురు తాను అడవిలో నుంచి తెచ్చిన కట్టెపుల్లలు, అమ్మకానికనుకొన్నవికాక, సొంతానికి అట్టేపుంచుకొన్నవి, పొయిలో పెడుతూ నీళ్లుకాచుతూ గంజి కాస్తూ కాలక్షేపంచేసేది. వాళ్ళకంతకన్న ఎక్కువ బాగుపడ్డానికి అవకాశంలేదు. ఆలోచనాలేదు. కొందఱు కొందఱు పుట్టుకతోనే బొడ్డున మాణిక్యంతో పుడతారు ! కొందఱి విషయంలో పచ్చిబొడ్డుమీది నూనిపొత్తికూడా కరువే !

ఈ కథ పల్లమ్మకథ కాబట్టి దానిపేరు పైకొచ్చింది. లేకపోతే పల్లమ్మలాంటివాళ్ళు ఆ వొక్కసాంఘిక శ్రేణిలో పదులు వందలు వేలుపున్నారు, చెల్లాలు, సీతమ్మ, చంద్రమ్మ, ఇత్యాదులాంద్రు—అంతమందిలో పల్లమ్మ వొక్కతె. అంతమందితోనూ నడుస్తూ పల్లమ్మ పోవలసిందే అడివికి కట్టెపుల్లలకు.

ఆ అడివి దండకారణ్యంతో పోలిస్తే అడివికాక పోవచ్చునేమోకాని, సర్వసాధారణంగా నాగరీకులు చూడ్డానికి భీతాంగమైన అడివే ! వర్షాలు ఎగజేపినరోజులవి. ఎండ చిత్తయిదుడుకుతో కుత కుత మసీకార్తి. కాశీ రామేశ్వరంపోయే మహా పంథ జాడెక్కినధూళితో రయిగమ్మిపుంది. ఆ బాటనే నడక ఆ అడివికి రాకపోకలు అంతే.

పల్లమ్మ విశాలనేత్రాలతో క్రొక్కొఱు మెఱుగుతీగెల్లే సాగిపోయింది అంతదూరమున్నా. రోజూ అలవాటుకాబట్టి అలయికపడ్డట్టు కొస్తంతా కనిపించలేదు. మఱిన్ని పాటకపుజాతి ఆడవాళ్ళల్లో ఒకటిపుంది. వాళ్లు తమ అవయవ సౌష్ఠవాన్ని,

ముక్కూ, నక్కూ, తక్కూ, పాడుచేసుకుంటూ నడవరు. మఱ్ఱిచెట్ల క్రిందనుంచి పోతూవుంటే మఱ్ఱిచెట్లందుకుంటూ వున్నట్లుంటుంది వాళ్ళయెత్తు. చెట్టు చెట్టు వెలితి ఆకాశంక్రింద వాళ్ళ సోయగం దిశ లావరించుకొన్నట్టు గనిపిస్తుంది.

యధాప్రకారంగా, అనామయంగా, సునాయాసంగా పల్లమ్మ అడివిలో ప్రవేశించింది, ఒక పక్క పుంతమ్మట—ఎక్కడెక్కడ ఆ అడివిలో చితుకులు విఱిచేదీ, కొమ్మలు వంచేదీ, ఆకులు రాల్చేదీ, రోడ్డుమీదికూరికే పుటుక్కుపుటుక్కుమని, ఖణేల్ ఫెణేల్మని, మాఱుమోతను వినపడ్డమేగాని మనిషియొక్క అలికిడీ కనపడదు, వినబడదు.

జాంపొద్దుంటుందింక. ఇఖంతా రోడ్డుమీదకు వచ్చి కట్టె పుల్లలు ఎవరివి వారు మోపులుగా కట్టుకోబోతారు.

అడివిలో పల్లమ్మగొంతు అన్నట్టయింది "పాంకఱిచిందల్లో! పాణం పోయిందల్లో!" అని. ఏమూల పుల్లలు కొట్టుకుంటూ వున్నవాళ్లు ఆ మూలకు చేరుకున్నారు. నురువు కక్కుకుంటూ వున్న పల్లమ్మను రోడ్డుమీదకు తెచ్చి పడేశారు—పాము?

ఏమిటి చెయ్యడం? పల్లమ్మ చచ్చిపోయేటట్టుంది. మంత్రం వేసేవారన్నా లేరు అక్కడెవ్వరూను—ఒకగంట అయిపోయింది—ఆ సమయానికి బంయిమంటా మోటారులారీ ఒకటి పట్నంకేసి కల్లుపీపాలతో పోతూవుండేది కనిపించింది. కల్లుపీపాలతో మోటారులారీ ఏమిటి అని అనుకోకండి! పూర్వం కావళ్ళమీద కల్లు దివాన్చెరువు ఆ ప్రాంతాంది పట్నంలోకి దిగుమతీ అయ్యేది. ఆ కల్లే యిప్పుడు పీపాలలో కెక్కించబడి మోటారులారీలమీద పాకలకు చేర్చబడుతోంది. కారణం

తాగేవాళ్ళకూ కల్లుకూగల విరహావ్యవధి తగ్గించాలనే పాటదార్ల సంకల్పం అంతే !

పల్లమ్మచుట్టూవున్న జనం లారీకి అడ్డుపడి లారీని ఆపి లారీవాణ్ణి "బాబు ! బాబు ! ఈ మనిషిని తీసుకుపోయి హాస్పటాల్లోపడేద్దూ. బతుకుద్దేమో ! పాముకఱిచింది." అని బ్రతుములాడారు. లారీవాడు "హాస్పటాల్దాకా చెప్పలేనుగాని కల్లుపాకదాకా తీసుకుపోతాను" అని పల్లమ్మ శరీరానికి తాను కూర్చునే ప్రాంతాన్ని తావిచ్చి. లారీ పిడిచిపెట్టాడు.

పాము ? అదెల్లా పల్లమ్మను కఱిచిందో, పల్లమ్మ ఆ కీకారణ్యంలో ఎల్లా కేక వేసిందో ఎల్లా కేకవేస్తే ఆ జనం మూకగా జేరుకున్నారో అదంతా ఎవరికీ అర్థంకాలేకపోయింది మఱి. జనం ఎవళ్ళకళ్ళకు వాళ్ళు పోయారు.—అసలైన నల్లని కోడెతాచు తొక్కివుండాలి పల్లమ్మ ఆ పాశంగా ఆ పాము కస్సు మంటూ పల్లమ్మ పొడుగునీ లేచి పల్లమ్మ బుజంమీద కాటేస్తూ బోరంతేకోరల్తో గిరుతూ జారిపడి జల్లున జెట్టిగొడ్డెంటమాయమై యుండాలి. లేకపోతే అంత అధాత్తు వళ్లుమఱిచి నుచ్చిళ్లో కక్కు-కుంటూ, వాళ్ళా వీళ్ళా అని బొబ్బలెత్తి వుండడం తటస్థించదు. పాము నరుల కళ్ళ పడకపోవడం జరిగివుండదు.

పల్లమ్మను సర్ది మోటారులారీలో కూర్చుండబెట్టి గబగబా లారీ వదలడంలో ఒకటి రెండుచోట్ల కల్లుపీపాలు బలువు పాటివి దొర్లి అమాంతంగా రోడ్డుమీద పడ్డం జఱిగింది. వాట్ని మళ్ళీ పైకి ఎక్కించుకు, మిక్కిలివేగంతో, పోలీసువాడొప్పని వేగంతోకూడా డ్రైవరు సాయంత్రం 5-30—6 గంటలకు చేరుకున్నాడు.

పల్లమ్మ మొగుడు—కామాటీ బొప్పైడు అన్నాం—వాడు, ఎప్పుడువస్తుందా లారీ, ఎప్పుడు చప్పరిద్దామా కల్లు అని ఉత్తదొప్ప, పక్కతోకలా చేతిలో ఆడించుకుంటూవున్నాడు, ఆ సమయానికి. ఆ కామాటీవాడు చూడ్నేలేదు పరమపదించబోతూవున్న పల్లమ్మను. వాడు లారీరాకలో చూచింది—లారీలో వెనకతట్టునుంచి చిల్లడి కాఱుతూవున్న ఒక పీపాలోని కల్లుధార! దానిక్రిందకు వెంటనే తనదొప్ప పెట్టి తాగమోతున్నాడు-అంగడివాడు "పెధవా!" అని వాడివీపున మొత్తి "చూచుకోరా! పెధవా ఆడ నీ పెళ్ళాంసావబోతూంది. చూచుకోరా పెధవా!" అని కూకలేశాడు.

"నా పల్లాలు! నా అమ్మి! ఇక్కడి కెలా వచ్చింది?" అంటూ ఆ మొగాడు లారీ ముందుకు పోయేడు. అప్పటి కప్పుడే లారీ మీదనుంచి పల్లమ్మను కిందకు దించేరు. పల్లమ్మ బతుకు ఎగూపిరి దిగూపిరిగావుంది.

కామాటీ చిన్నవాడు ఏమని అడుగుతాడు; పెళ్ళాన్ని? ఏమి సాయంచేయగలడు పెళ్ళానికి ఆ సమయంలో?—మొగుణ్ణి చూచింది పల్లమ్మకళ్ళు సగంతెఱచి అదే ఆఖరు చూపనుకోండి.

అందిలా—"నాబావా! ఈ యేలప్పుడు నేనింటివద్ద సావడం అంటూవుంటే నిన్ను చూడ్నే లేకపోయిందాన్నేమో? ఇక్కడ చస్తున్నాను గాబట్టి నిన్ను చూడగల్గుతున్నాను, పుణ్యవంతురాల్ని." అంటూ ప్రాణం వదిలేసింది.

ఏమాత్రం ఇంక ఆ తుది పలుకు మీద వ్యాఖ్యానంచేసినా, ఆ యిల్లాలియొక్క ఆత్మశాంతికి భంగకరమేమో?

.... .... .... .... ....

# నైతికకాంతి

రామయ్య తూర్పునుంచి అనగా అనకాపల్లి ఆ ప్రాంతంనుంచి వలస వచ్చి రాజానగరం ఈ ప్రాంతాన్ని కాపురముండిపోయి పని చేసుకునే కమ్మరిపనివాడు. ముసలివాడు అయినా పని పాటల్లో మంచి చాకచక్యంగలవాడు. బండి చక్రాలకు పట్టాలు వేయడం, నాగళ్ళకు కఱుకోలలు దిగెయ్యడం, ఇలాంటిపనులు అవలీలగా చేసేస్తూ వుంటాడు.

వయస్సులో రాత్రింబవళ్ళు కొలిమెప్పుడూ ఆరిపోకుండా తన కృషిలోనే మెలగేవాడు వయస్సుహెచ్చిన యీ మధ్య అతడు రాత్రిళ్ళు పనిమానివేసి " కృష్ణా రామా " అనుకొంటూ ఇంటివద్దనే వుండిపోతూ వచ్చేడు.

రామయ్యయొక్క కమ్మరిమకాంకు సరిపోయినన్ని బొగ్గు బస్తాలు బస్తావెనకాల బస్తా తెచ్చి పగలల్లా పడెయ్యడం పని బూసెమ్మ అనే పనికత్తెది—బూసెమ్మకు వేఱే మఱోచోట పనిలేదు. పొద్దున్నే వచ్చినకాణ్ణుంచి బొగ్గు బస్తాలు మోస్తుం దేమో, మొదటి బస్తా మోతకాణ్ణుంచే శరీరం నల్లబారడం ప్రారంభించి సాయంకాలం అయ్యేసరికి ఎలావుంటుందీ దాని వొళ్లు—కళ్ళక్కాటుకక్కర్లేదనిపిస్తుంది, కొప్పూ వెనుపూసా వొకటేరంగు అనిపిస్తుంది, గుడ్డలవాలకం చూస్తే కాకిఱెక్కల్లా దులుపుకుంటూ వుంటుంది. పొద్దుటి రూపు అంతా మారిపోతుంది, ఆ పనిచేసి మళ్ళీ యింటికిపోయి వెచ్చన్నీళ్లుపోసుకొని బయట పడేదాకా—

ఇలా వుంటూంటే ఓ పొద్దేం జరిగిందంటే—రామయ్యకు ఆ రాత్రితో ఆయువు సరిగామోసు పాపం!—రోజూలాగే

పొద్దు కూకిపోతూంది, రామయ్య పాకాలో కొలిమి చల్లాఱు తుంది కూస్సేపటికో కాస్సేపటికో యింక—బూసెమ్మ ఓబొగ్గుల బస్తా తెచ్చి నేల పడెయ్యబోతూంది అదే ఆఖరిబస్తా ఆనాటికి. ఇంకా పడెయ్యకుండానే రామయ్య తన పక్కనేకూకున్న కుఱ్ఱ కాపుని—"బాబా! దానికా బస్తా కిందకు దించుదూ—ధిమ్మన పడేస్తే బొగ్గు నలి అయిపోతుంది" అన్నాడు. ఆ చెప్పిందే తడవుగా కుఱ్ఱకాపు బూసెమ్మదగ్గఱకెళ్ళి ఆ బస్తా అలా ఓ పక్క రెండుమూలలూ పట్టుకుని మెల్లిగా దింపేడు. ఆ దింపడంలో బూసెమ్మ వొంటియొక్క సందు సందుల పసందులేం కనిపెట్టేడో "బూసెమ్మా! నీ వళ్ళు అసలు సిసలైన గట్టి బంగారమేనేవ్!" అన్నాడు. ఎఱిగుంటే ఎఱిగుండిపుండవచ్చును అంతకుముందు కొంచెందాన్ని అతడు. "అయితే అంది?" బూసెమ్మ కుసంత గొంతు సన్నగించుకుని. "మాపటికి ఈ పాకాలోకి—" అన్నాడు. బూసెమ్మ ఊఁఱుకుంది—మన మప్పుడే బూసెమ్మ చెడ్డమనిషి అనిగాని మంచిమనిషి అనిగాని అనడానికి వల్ల లేదు—బూసెమ్మ ఊఁఱుకుంది. ఊఁఱుకుంది అంటే అదే సమ్మ తించినట్టుగా అని కాపుకుఱ్ఱడనుకున్నాడు.

రామయ్యతాత కనిపెట్టాడు ఆ సంగతి. తాతలాగున్నా రామయ్య ఎక్కువ నీతి వాసన గలవాడు, కొక్కోకశాస్త్రం చదివినవానికి మల్లే ఏజాతి స్త్రీకి ఏజాతి పురుషుడికీ ఎట్టివాక్కు జరిగినా అట్టే కనిపెట్టే రకంగాడు. అనుకున్నాడు తక్షణం "అరి! నా పాక యిలాంటి అవినీతి పనులకు చోటిస్తూంది కామోసు నేను రాత్రిళ్ళు కొలింపనికి నీళ్లాదులుకున్న కొణ్ణుంచి? ఇన్నాళ్ళనుంచి ఎన్నెన్నిపాపాలు జరిగినాయోగద్దా! ఈ పాకలో

ఈ బూసెమ్మ బుద్ధిగలదేనే? వీడు రమ్మన్నంత మాత్రంచేత వచ్చేస్తుందా? పిల్ల చెడిపోయేటట్టుందే? మిడత అగ్నిగుండంలో పడిపోయేటట్టుందే?" అని అట్టే యోచించాడు. "వెల్లడిగా వాళ్ళిద్దర్నీ అడిగేస్తే అది మరీ ప్రమాదం. నిరపరాధులవుతారేమో తుదకు!" అని ఆ రేత్రి పాపం ఆ తనపాకాలో జరక్కుండా వుండే వుపాయంకోసం పంతగంచిపోయేడు. వాళ్ళను అనగా ఆ బూసెమ్మనూ కాపుకుట్టిణ్నీ అలా వెళ్ళనిచ్చాడు. తాను తన కొలిమిలో కొత్తబొగ్గోశాడు. ఉన్నపనీ లేనిపనీ కల్పించుకుని అదేపనిగా కొలిమికి తిత్తి వూస్తూ అగ్ని జ్వలింపజేశాడు.

రామయ్యవూహ ఏమిటీ? వాళ్ళురాక మానరని, వచ్చేసరికి తనపాకాలోని కొలిమి వెలుగు అలా వెలుగుతూన్నట్టయినా ఆ వెలుగులో ఏ పాపప్పనీ జరగబోదనీ—అలా వూహచేశాడు.

అతని వూహలో కొంతపటుకూ భవిష్య దర్శం వుండక పోలేదు—బూసెమ్మను మరెక్కడికెళ్ళినా తప్పట్టుకుంటారు ఆ వూళ్లో. తాత పాకకు వెడితే పనికోసం వెళ్ళింది మరో అందుకు కాదనుకుంటారు, అంచేత బూసెమ్మకు ఏవేళప్పుడైనా సరే రామయ్యతాత పాకకు వెళ్ళడం అంటే రాజాబహద్దర్ బాట. ఇఖకాపుకుట్టిడు మొదటే చెడిపోయిన దృతరాష్ట్ర సంతతిలో వాడవడంచేత ఎక్కడకు ఏవేళప్పుడు వెళ్ళినా వాకటేవాడిక—నదురూలేదు బెదురూలేదు.

సరిగా ఆ మాపు పదిపదకొండు గంటలకు బూసెమ్మ ప్రథల్లే తేర్చి దిద్దుకుంది. జాతిరత్నంలా మెఱుస్తూ "తాత పాకలో వుండ" దనుకుని వెళ్ళింది. వెళ్ళివెళ్ళకుండానే దాని

వస్తువులమీదకు తాతయొక్క అగ్గికొలిమి బగ్గుబగ్గు మండుతూ వెలుగోసింది. వేతేమూల కాపుకుఱ్ఱడు "వచ్చింది నాబూశమ్మ! ఈ తాత చచ్చిపోనైనా చచ్చిపోయినాడుకాడు. ఇంకా కొలిం వూదుకుంటూ చచ్చిందాకా ఇదేపనిగా మండిపోతున్నాడు." అని పళ్లు కొఱికేస్తున్నాడు.

రామయ్యతాత వాళ్ళ యిద్దర్నీకూడా కనిపెట్టేడు. కని పెట్టి "వచ్చారే వాళ్ళు!" అని మఱింత దృఢిమతెచ్చుకుని "నా పాకలో ఈ అవినీతి జరక్కూడదు" అని గట్టి పట్టుపట్టి నట్టు కొలిమింకా ఊత్తూ ఆ మేకూ ఈ మేకూ సాగేస్తూవున్నాడు.

రామయ్యతాత ఓపికతెచ్చుకుని కొలిమింకా జ్వలింప చేస్తూ పాకఅంతా తేజోవంతం గావిస్తూ వుంటే—కాపుకుఱ్ఱ డోపికపట్టలేకుండా వున్నాడు. ఎదూరుగా—మాట్టాడ్డానికి శక్యం గాకుండా—దూరంగా—అల్లంతలో బూసెమ్మ తనయొక్క బంగారు పుట్టుచాయతో, వస్తువులు పెట్టుకుని కళ్ళువిప్పుకొని తన్ను "రా! రా!" అన్నట్టు గోచరిస్తూ వుంది. తాత అక్కడ పనిచేస్తూ వున్నంతసేపూ, తాతయొక్క కొలిం కాంతిల్లుతూ న్నంతసేపూ, కుఱ్ఱడూ బూసెమ్మా ఏకంగావడం కలలోనివార్త!

ఏ కాలానికి ఏ పుఱ్ఱెకు ఏంబుద్ధి పుడుతుందో! హరిహరీ! కాపుకుఱ్ఱడు ఆ పాకలోవున్నటువంటి ఒక పెద్దగునపం అమాంతంగా తాత వెన్నెముకను గ్రుచ్చుకుపోయేటట్టు విసరి "చచ్చాన్రో!" అని తాత అఱిచేసరికి పాఱిపోయినాడు.

బూసెమ్మ నిర్విణ్ణురాలై పోయింది. "తాతా! తాతా! రామయ్యతాతా! ఇక నీతో నా జీవనాధారం సరి. ఇకనీతో నా జీవనాధారం సరి" అని ఏడుస్తూ పెద్దరోదనం చేస్తూ

ఆ ప్రజ్వరిల్లుతూవున్న కొలిమిమీదికి పడిపోయింది. కొలిమి చల్లారి పోయింది. నిజంగా బూసెమ్మయొక్క కన్నీళ్ళుపడి కొలిం చల్లారిపోయింది.

ప్రజలు గబగబావచ్చి బూసెమ్మను ఇవతలకు లాగి బ్రతికించగలిగేరుగాని రామయ్య అన్న ఆ కమ్మరి పనివాణ్ణి. ఆ శతవృద్ధుని, బ్రతికించ లేక పోయినారు.

తరువాత ఆ హత్యనుగురించి "కేసు" అయి "ఆకేసు" "కమిట్టై" విచారణ అయిందో లేదో మనకు తెలియదుగాని మనకు తెలిసిన సంగతిఇది. ఆ హంతకుని మొగం బూసెమ్మ మళ్ళీ చూడలేదుట.

చీకటిపడ్డప్పుడల్లా తాతయొక్క కొలిం కాంతి కళ్ళకట్టి నట్లై కళ్ళు మూసికొని "అదేంకాంతి ?" అనీదట.

.... .... .... .... ....

# నిరుద్యోగంలో గూడా ఇన్ని దారులున్నాయా!

"సిటీబస్" రావడం ఆలస్యం అయింది. ఆలస్యం అయింది. అనేకంటె అసలు నేనక్కడ కూర్చున్నంతసేపూ అని అంటే నిజమేమో ? నేనోగంట దానికోసం కాసుకూర్చున్నాను. కాని రాలేదు. దేనికోసం ? తమరు ఇక్కడకూర్చునివున్నారు "అని ఎవరైనా ప్రశ్నిస్తేమాత్రం తమకోసమేనండీ !" అని కబుర్లు చెబుతూ కాలక్షేపం చేసేసాను ఆ గంటాను——నా నూరేండ్ల జీవితంలోనూ ఒకగంట గడచిపోయినది కదా ఇతరులతో కబుర్లు చెబుతూ నని సంతోషించాను. వేళ అది సాయంకాలం 3-30

ఆదివారం తారీఖు 10-10-53 కాని ఎక్కడా ఏ దినచర్య పుస్తకం లోను వ్రాసియుండలేదు. ఏమీఅంటే' అదో పెద్దపనికాదు. గొప్పసాహసంకాదు. ఇతరులు తెలుసుకోదగ్గ వింతవార్తకాదు.

మరి ఎందుకు ఈ లిఖింపుఅంటే నాలాగేకాలం గడవని వాళ్లు వుంటే చదువుకోడానికి.—అక్కడో బిస్కట్లు షాపు వుంది. బిస్కట్లుషాపు అనేకంటె రొట్టెల దుకాణం అంటే సరిగా నచ్చవచ్చు. ఆదివారమైనా రొట్టెల దుకాణాలు మందుల దుకాణాలు తీర్చివుంటాయి ఏ వూళ్లోనూ, అని అనుకుంటారు. రొట్టె పత్యానికి, మందు రోగానికి తప్పకుండా అమేషా అమ్మబడాలి కనుక వాటికి ముప్పొద్దూపనే. ఎన్నడూ సెలవులేదు. మరి ఎదురుగుండా పాతదిరిసెనచెట్టు, వరదకూ్కడా పడి పోనిది, క్రిందిప్రేశైనా చూపనిది. పైనిపువ్వులన్నా కాపరచింది, అంతలోతూ అంతఎత్తూవున్న చెట్టు అది : పురపాలక సంఘం వారు ఎంచేతో దాన్ని కొట్టించలేదు. పక్కనకొట్టువాళ్లు నీడకుంచి వేయినున్నారో అసలు గొడ్డలికి తెగిందోకాదో ? ఏమైతేం బాగా వృద్ధాప్యంవచ్చి వేడుకలు వింతలు అన్నీ చూచిన వృక్షముఅది. దానిక్రింద కూర్చున్నాను ఒక బల్లవుంటే "—

మార్గాన్నే చూస్తానుగదా—" మేటనీ " లకు వెళ్ళేవాళ్లు, సనాయిమేళగాళ్లు, అలిచేవాళ్ళు, అడుక్కునేవాళ్లు, అటూ ఇటూ ఊరికే నడిచేవాళ్ళే మరీన్ని రిక్షాలు, లారీలు, నాకుపకరించనివి, నేను ఉపయోగించాలని అనుకోనివి, ఎన్నో వస్తూపోతూ వున్నాయి. మరీన్ని పొదిలేకుండా మంగలి, మూటలేకుండా చాకలి, కనబడ్డారు. " వొదినా ! " అంటే " ఏంబావా ! " అనే సంభాషణ వినబడ్డది. అదేమిటి ఇదేమిటి, జగత్తంతా విశ్రాంతిమయంగా తోస్తూ విడుమరలేని కృషిగా దట్టింది.

"ఏమండీ! ఇలా ఇంతమందికి ఏదో ఒకటి పనివుందే! మీకూ నాకూ లేదేం." అన్నట్లు ఒకవ్యక్తివచ్చి, నా పక్కనవచ్చి కూర్చున్నాడు.

"ఏమండీ! తమరూ సిటీబస్సుకోసమేనా?" అన్నాను. దానితో నేనేదో పనిమీద కూర్చున్నానుగాని ఊరికే కూర్చో లేదనుకొని ఆవలివ్యక్తి నన్ను కబుర్లలోకి దింపేడు. నాకు కబుర్లుకూడా చెప్పాలని లేదు ఆగడియప్పుడు అంత సోమారి తనం బలిసిపోయింది.

"ఏమండీ! లోకం అంతా unemployment మయంగా వుందేమండీ?" అని అన్నాడు. ఆ ఇంగ్లీషుమాటకు తెనుగు అర్థం "నిరుద్యోగం" అని అనుకొని "తమకేమీ ఉద్యోగం లేదూ?" అన్నాను. "నామాటకాదు లెండి! లోకం మాట" అన్నాడు. "లోకం ఎప్పుడూ అలాగేవుంటుంది: మీకుందిగదా వుద్యోగం!" అన్నాను. "ఏం? మీకు లేదా?" అన్నాడు. "నా మాటకేంలెండి!" అని లేచాను. "ఏం చేస్తున్నారు?" అన్నాడు ఆవలివ్యక్తి. "ఏమీలేదు! వెళ్ళిపోవడానికి! మరి సిటీబస్సు రాదనుకుంటాను" అన్నాను. "అయితే నేనూ వెళ్ళి పోతాను. నేనూ దానికోసమే యిందాకా చూచింది" అన్నా డతడు. అతని దారిని అతడు నా దారిని నేను విడిపడ్డాం!

"విడుతూ అనుకొన్నాను "నిరుద్యోగంలోకూడ ఇన్ని దారులున్నాయా?" అని.

# పు వ్వు లూ కా య లూ

చూడండీ! చూచిన ఆడవాళ్ళందరూ నా కళ్ళల్లో పువ్వులేశా యంటున్నారు! ఒక్కమాటి నా కళ్ళుచూడండీ!" అంది. రాత్రి పదిగంటలవేళప్పుడు భర్త ఆఫీసర్సు క్లబ్బునుంచి ఇంటికివచ్చి రావడంలో ఇంకా ఆయనగారు కోటుతీసి రాక్‌కు తగల్చకుండానే యశోదమ్మ అదోవాలకంగా చూస్తూ.

యశోదమ్మ భర్తపేరు అరవాలరాయ్డు. వాళ్ళిద్దరకూ పెళ్ళైన తేదీనుంచి నాటికి ఏళ్ళు లెక్కచూస్తే సిల్వర్ జూబిలీ చేసికొనివుండాలి; అయితే పిల్లలు కలిగివుండని కారణంచేతను, ప్రజాయై: గృహమేధినాం అన్నమాటను బట్టి, జూబిలీలేకుండా గీబిలీలేకుండా వారి ఉబలాటంఅంతా అఫీషల్ కాలనీలో ఓ భవనం నిర్మాణం గావించుకోవడంలో వెచ్చించినవారై డే-టు-డే ఆ యింటికి బూజు దులిపించడంలోను, రంగులు వేయించడంలోను, చుట్టూ క్రోటన్లు పాతించడంలోను, పెర్రేసుకు మెట్లు కట్టించడంలోను, ఇంప్రూవుమెంట్లు చూపిస్తూ భార్య కాలం గడుపుతూ వుంటే, భర్త బెడ్ కాఫీ తీసుకున్నది లగాయతు బ్రేక్‌ఫిల్ వేసికొనేదాకా కాలి జోడుకు రంగు వేయించుకోడంలోను, పెన్నిసుబంతుల కొత్తఇంపోర్టు రేడియోలో వినుకోడంలోను, యుద్ధవార్తలు బీచిసైడున అనుకోవడంలోను డమ్మీ ఆటలో "చుమ్మా" కేక వేసుకోవడంలోను కౌమారం వెళ్ళబుచ్చుతున్నాడు.

"ఆఫీసర్సు క్లబ్" అనీ "అఫీషల్ కాలనీ" అని రెండు మాటలు పై పేరాలో వివరించాను. అవి పల్లెటూరి పాఠకులకు పరిచయపదాలు కాకపోవచ్చును. ముఖ్యంగా ఈ రూరల్

రికన్‌స్ట్రక్షన్ రోజుల్లో పల్లెటూరిప్రజల నిమిత్తంగాను వ్రాయక పోతే వ్రాసేవానికి దేశభక్తి లేదంటారు. చదివేవానికి జీవన్ముక్తి రాదంటారు.

"ఆఫీషర్ కాలనీ" అన్నది విశాఖపట్నంలో ఒక భాగం. బురుజుపేట, మహారాణీపేట. ఆలా తిరిగివస్తే బహుశ ఊటగడ్డ ఇవిదానికి మూడువైపులా మూడు సరిహద్దులుగాగా, తూర్పుతట్టు సముద్రపుటంచు దానికి ఎల్ల. ఎల్లేకాదు వెల్ల కూడాను. ఆ కాలనీలో ఏ మెట్రేసూ ఎక్కకుండానే ఊరితే నేల మీదికే సముద్రం గోచరిస్తూవుంటుంది. వీథులు సముద్రంకేసి ఏటవాలు సోయగంగా ప్రాకిపోతూవున్నట్టు పొడగడతాయి. ఇళ్ళన్నవి పోపుల పెట్టెల్లా, ఉత్తరాల సార్టింగు అరల్లా, స్థలం కించిత్తైనా పెరళ్ళకని వీలోకుండా, సరిహద్దు గోడలకని వదలగ పెట్టబడకుండా, ఎక్కడికక్కడ మనిషికోసంగాను పృథివి పుట్టిందన్నట్టు చెట్టున్నది చీమన్నది అక్కడ మనడానికి మసల డానికి వీల్లేదన్నట్టు నిర్మింపబడ్డాయి ఓ వేయిని సుమారుగా. ఈ వేయి యిళ్ళ పుట్టనూ ఆఫీషర్ కాలనీ అన్నారు.... అఫీషల్సు అంటే రిటైర్డు ఆఫీసర్సూ, అఫీషల్సే. ఆఫీసర్సుకావడానికి ఎస్పైర్ చేసేవాళ్ళూ ఆఫీసర్సే. ప్రాక్టికల్‌గా ఆలోచిస్తే అఫీషల్ అన్నది అదో బ్రాండ్. ఓ విధమైన టిపటాప్, ఓరక మయినచమక్, ఓ సుందరమైనవిల్లా, కాస్త హాలీవుడ్ పేస్టున్న ఇల్లాలు, కాస్త ఇంగ్లీషుయ్యాస్ రెగిరే పిల్లకాయలు. ఇల్లా కొన్ని కొన్ని చూపించగలిగే వాళ్ళందరూ అఫీషల్సుగా చెల్లు బడి అయిపోయేరు వీళ్లు. చూస్తూంటే తాటిముట్టను తేనెపట్టట్టినట్టు పట్టేశారు ఆ ప్రాంతాన్ని—చెద్దపట్టేశారుటండి! మరి! ముట్టి

వానికావాకిళ్ళ మెట్లెక్కడమంటే భయం. ఒకడి రొష్టు ఒకడికి సుతరాం వుండదు. ఒకమనిషి రెండో మనిషిని గుర్తిస్తేగా? ఆస్టే గుర్తిస్తే సరిహద్దు తగువు, పైమనుష్యులల్లా అక్కడకు రాగలిగేది, వచ్చేది, దుట్టుపనివాళ్ళు మామిడిపళ్ల తట్టలవాళ్లు, గుమ్మపాలచట్లెలవాళ్లు, మిస్టర్ సో అండ్ సో మిస్ సో అండ్ సో, మిసెస్ సో అండ్ సో అని సైనుబోర్డుల తిలకిస్తూ నడిచిపోతి మా ఫల్యాక్టరీల్లో తిరిగిపోతూన్నట్టే నడాడుతూ వుంటారు. లోపీతీని కాపురాలున్నవారు గ్లాక్సో కిడ్డీస్‌నుంచి క్రికెట్ ఛాంపియన్సుదాకా.

కాబట్టి అరవాలరాయ్డుకూ యశోదమ్మకూ నడుస్తూవున్న సంభాషణ నైట్‌పెర్ఫార్మెన్సుగా తీసుకోవచ్చు పాఠకులు. మేటసీగా తోసెయ్యా నవసరం లేదు.

అరవాలరాయుడు సీలింగున వున్న విద్యుద్దీవనకు స్విచ్ ఆఫ్‌చేసి పేము కుర్చీలో కూలబడి “నీ కళ్ళకు జబ్బు చేస్తే అప్థాల్మిక్ డాక్టర్ చూడాలిగాని నే చూచి ప్రయోజన మేమిటి? యశోద్!” అని నిట్టూర్పు విడిచాడు. “పోనీ అ డాక్టరుగారు మీకు క్లబ్బులో రోజూ దసులవుతారులాగుంది. ఓ తడవిలా తీసుకురాకూడదంటీ వార్ని! నా సంగతంతా వారితో మనవిచేసి!” అరవాలరాయుడు “యు హేవ్ నో ఐడియా ఆఫ్ క్లబ్‌లైఫ్! అసలే తెలిసికోలేవు అఫీసర్సు క్లబ్‌లోని మెంబర్లయొక్క కట్టుదాట్లు” యశోదమ్మ వెంటనే అంది “అసలు మీ జీవితంలో ఒకటినాకు తెలిసి ఏడీసిందాఏమిటి? ఉద్యోగంచేసినన్నాళ్ళూ అదేజాపు బదేజాపుగా, అదే పురుష లక్షణమంటూ, మెతుకులు తిని పోయి తిరిగి ఏ అర్ధరాత్రికో

నీళ్లు కారుతూ ఇల్లుసేరుకోవటమేగా ?” అరవాలరాయుడు “అప్పటికి నీవప్పుడే షైరయిపోయి నిదరోవడమేగా ? నీతో మాత్రం స్వామినాఏది ? స్వామినా అంటూవుంటే కళ్ళా కీవయస్సులో జబ్బేచెయ్యదు ” అన్నాడు. యశోదమ్మ “ అది జబ్బో గిబ్బో డాక్టర్ చెప్పాలి మీరెవరు చెప్పడానికి ?” అరవాలరాయుడు “అయితే చూడు రేపు డాక్టరుగారిపేర ఓ లెటర్ వ్రాసియిస్తాను అది తీసికొని తిన్నగా కళ్ళాసుపత్రికి వెడితివా పరీక్షచేసి కళ్ళకు మందైనా వేస్తారు, సులోచనాల జోడయినా పురమాయిస్తారు. ఏ డ్యూటీపని ఆ డ్యూటిలో వాళ్ళచేత ఆ డ్యూటీగా చేయించుకోవాలి. దొరలపద్ధతి అది. అదే ఆఫీసర్సు క్లబ్ మెంబర్ల పద్ధతీని. ఆ క్లబ్బులోవుందా, మేం, ఆడవాళ్ళట మల్లే మామాయిళ్ళల్లోని కలిమి లేములనుగురించి మామా వాడళ్ళకున్న చిడుం చియ్యలనుగురించి, ఊః వాకళ్ళ కొరళ్ళం వెళ్ళబోసుకుంటూ కూర్చుంటాం అనుకున్నావా ఏమిటి ? అలా వెళ్ళబోసుకోనే రాదు అక్కడ. నీ గురించి ప్రస్తాపనచెయ్యనే రాదు “ ఇన్పెట్ మదాంమీద పొడిపుందే !” అని ఓరచూపున పక్కవాడంటే, “ అదితప్పు అబ్బా ! అల్లాతగదుచూడ్డం !” అని మందలించుకోవచ్చును. ఇతర భోగట్టాలు, అరికట్టటాలు పనికేరావు. ఎవరకీ చెందని లోకాభిరామాయణం ఎంతైనా చెరిగెయ్య వచ్చును. గంటలకొద్దీ అలా విరగబడీ వింటారు. కాబట్టి క్లబ్బులో నిన్ను గురించి కలిపించుకు నేను కళ్ళడాక్టరుతో చెప్పడమనేది జాంతానై. కావలిస్తే ఒక కవరింగులెటర్ ఆయనపేర నిన్నుగురించి వ్రాసియిస్తాను. తీసికొని వెళ్ళు. రేపు ఉదయం ఏడు గంటలకే తీసికొని వెళ్ళు ”—“ అయితే

ఈ వెళ్ళే రోగులందఱూ కవరింగులెటర్సు తీసుకొనే వెడుతున్నారా ? నాకూ ప్రపంచజ్ఞానం అంతో యింతో వుంది. నాకు నేనే వెళ్ళి నాకళ్లు నేనే చూపించుకోగలం, నేనే బాగుచేయించుకోగలం. ఈ యిల్లు కట్టించింది నేనుగాను ? " అంది ఎక్కడికెక్కడికో కొక్కెం తగిలించి, యశోదమ్మ అరవాలరాయుడు "ఆ మాత్రం ధీమా నీకువుంటే నేను రేప్రొద్దున్న టేన్నిస్ సెట్టు నిశ్చింతగా ఆడుకున్నానన్నమాటే !" యశోదమ్మ "కొత్తబంతులా ?" అరవాలరాయుడు "పాతవే లాండ్రీకేశాం!" యశోదమ్మ "బంతులుతకడంలో కూడా పడుతున్నారూ ఈ లాండ్రీ ముండాకొడుకులు ? ఇఖ చీరకు అరణాలు జాకెట్టుకు మూడణాలు అడిగేశారన్నమాటే" అంటూ మర్నాడు ఆసుపత్రికి తాను ధరించుకుపోతగ్గ చీర రైక ఇత్యాదుల్ని అప్పట్నుంచీ ఎంచుకోసాగింది. అరవాలరాయుడు "సెంటెడ్ స్నప్" ఒకపట్టుపీల్చి యశోదమ్మతో "ఇప్పుడేవస్తాను. ఐ కమ్ ఇన్ ఎ మినిట్ ! చూడు నీవు భోంచేసెయ్యి ! నా కోసం కనిపెట్టుకుండ నక్కర్లే. అంటూ వేషం మార్చుకు లాల్చీమాత్రుండై తిరోహితుండై నాడు. "ఎక్కణ్ణో డిన్నర్ లాగుంది" అని అనుకొంటూ యశోదమ్మ తనపని చక్కబెట్టుకు రాత్రి ఎల్లాగో తెల్లార్చింది.

* * * * *

ప్రొద్దున్నే మగనితో చెప్పకుండానే, చెప్పడానికాసమయానికి మొగుడింట్లో వుంటేగా—ప్రయాణమైంది. వాళ్ళ యింటికి కళ్ళాసుపత్రి ఆలా కనిపిస్తూనే వుంటుంది. అయితే రోడ్డెక్కుతుంటూ పోవాలి. ఎప్పుడూ నడవని మనిషికి

ఆయాసమే అనిపిస్తుంది. అయినా తల్లో పువ్వులెట్టుకున్న కారణంచేత, నిగారింపుగా చీరకట్టుకున్న కారణంచేత రోడ్డుమీద ఎక్కేతలోదిక్కడ్డ చందంగాకుండా ఏదోవాహనమెక్కి రహిస్తూ వున్న అందంగా కనిపించింది ఆమె.

హాస్పటలు తంతు అందరికీ తెలిసిందే. అందులోనూ పబ్లికు హాస్పటాలు. కళ్ళాసుపత్రి. అక్కడ దాపరికమేముం టుంది? ఎవరికి వారేవెళ్ళి "డాక్టరుగారూ!" అని తమతమ కళ్ళు అప్పటికప్పుడే చాలామంది చూపించేసుకుంటున్నారు. అరకునట్లు పడించుకుంటున్నారు. ఎలా జనసమ్మర్థంగావుండాలో అలా వుంది. కాదుమరీ! సమస్త అంగములలోకి ప్రధానంగము కన్ను!

యశోదమ్మ డాక్టరుగార్ని ఎప్రోచ్ అయ్యే వంతు వచ్చింది.

"మీపేరు"—"యశోదమ్మ"

"మీ జీవనాధారం?"—"కన్ను"

మరిమాట్లాడిస్తే పనిగాదని డాక్టరు ఆమెనుచూస్తూ ఎఫ్-25-హెచ్. అని గబగబా ఫారము పూరించుకొని కళ్ళల్లో నాలుగు అరకుచుక్కలు వేసి "అలా ఆ రూములో కాసేపుకూచోండి. వచ్చిచూస్తాను" అన్నాడు. యశోదమ్మ చుక్కలు వేయించుకోకుండా అయితే గదిలోకి వెళ్ళనని గునిసి యుండేదేమో కాని, కళ్ళల్లో అరకుచుక్కలు పడ్డంతోనే మరెక్కడో ఒక్కచోట చతికిలపాటు తప్పనిసరి అయి— "గది అట—ఎక్కడ? ఎక్కడ?" అంటూవెళ్ళి పక్కగదిలో ఓ కుర్చీలో ఆసీనురాలైంది. ఆమెను కూర్చోనిచ్చి జవాను

గదితలుపులు మూసేశాడు. ఆ తరువాత ఆమెకు జరిగిన విధానము అంతా ఆంగ్లవైద్య పరిభాషలో "డార్కురూము ప్రోసెస్సు" అంటారనుకుంటాను. ఏదైతేం కనుపాపలు రెండూ ఉరవై పోయినాయి.. "ఎరక్కవచ్చానురా దేవుడా" అని అనుకుంది.

రెండు గంటలు పోనిచ్చి అనగా మధ్యాహ్నము పద కొండు గంటలకు డాక్టర్ వచ్చి జిగాల్‌మని లైట్‌ఫోకస్ చేస్తూ ఆమె రెండు కళ్ళూ పరీక్షించి "అమ్మా! చూడండి! మేడ మీదకు వెళ్ళండి" అన్నాడు.

మేడమీదకు వెళ్ళింది. అక్కడింకో డాక్టరుగారగపించేరు. ఆయన ఆమెను తిన్నగాపిలిచి "గోడకేసి తిరిగికూర్చోండి" అన్నాడు. ఆమె తన సిగముడీ, ముడిలోని పువ్వులూ, గోడకేసి పెట్టుకూర్చుంది—డాక్టరుగారు నవ్వుతూ "గోడమీదక్షరాలు చూడాలి మీరు! చూసి చదవాలి" అన్నారు. "అక్షరాలు చదవడం ఎందుకండీ?" అంది. "మీరు గ్లాసెస్‌కోసం రాలే?" "నేను గ్లాసెస్‌కోసం రాలేదండీ! పువ్వులు చూపించడానికి వచ్చాను" అంది.

గోడగడియారం పంన్రెండుకొట్టింది. డాక్టరుగారు "చూడండి! అమ్మా! ఈ వేళకు తెమలదు మీకళ్ళుపరీక్షించడం రేపురాండి!" అన్నారు........

* * * * *

ఆ సాయంకాలం ఆఫీసర్సు క్లబ్బులో లోకాభిరామా యణం—డాక్టరుగారు మేజిక్‌చేసేవానిలా పేకకలుపుతూ అర వాలరాయుడితో చెబుతున్నారు—యశోదమ్మ అరవాలరాయుడి భార్య అని తాను ఎరక్కే అనుకోండి—"ఈ రోజున ఓ మిస్

మా హాస్పటాలుకు కళ్ళల్లో పువ్వులు చూపించడానికి ప్రత్యామ్నాగా తల్లో పువ్వులు చూపించింది" అరవాలరాయుడు తన గొడవ కానట్టుగావింటూ పేకబొత్తివంక చూడనైనా చూడకుండా కీతకోత కోస్తూ అడిగేడు "మటి ఆపరేషన్ చేశారా?" అప్పుడే బోయ్ చేత గోల్డుప్లేక్ తెప్పించి చిల్లరుచ్చుకు ఎక్కణ్ణో పడేసుకుంటూన్న మూడోవ్యక్తి అనేడు "డాక్టర్లింకా అంత గుడ్డివాళ్ళు కాలేదనుకుంటాను" నాలుగో వ్యక్తిలావేటరీలో నుంచి "మిస్‌ను చూచిన్నీ?"

అరవాలరాయుడు కూర్చున్నవా డట్టేలేచి పిడికిటితో ముక్కుమీదగుద్దే ఫక్కీగా రోషోద్దీపితుడై "షట్ అప్! ఫూల్! యు రాస్కేల్ ఇన్ ది లావెటరీ! నోయు? నోయు?" అంటూ కుళాయిగది తలుపుమీద వొక్క తన్ను తన్నేడు. డాక్టరున్ను మూడోవ్యక్తిన్ని తారు నిర్జీవప్రతిమల్లా అయిపోయారు—అయిపోకుండా వెళ్ళి అరవాలరాయుణ్ని పట్టుకు వెనక్కుతీసికొనివచ్చి అతణ్ని వొక ఈజీచైర్లో కూర్చోబెట్టి "మా కెవరకీ తెలీకఅన్నాంహోయ్ నీకో మిస్‌పుం" దని అంటూ సముదాయించనూ సముదాయించారు. అరవాలరాయుడు "నాన్సెన్సు! డోంట్యు నో దట్ యశోద్ ఈస్ మై వైఫ్!" డాక్టర్ "షి నెవర్ సెడ్ సో!" అరవాలరాయుడు "నెవర్ సెడ్ సో! బ్లాక్ హెడ్! మై గాడ్" అంటూ లేచిపోయినాడు. తక్కిన మెంబర్లందఱూ "ఇట్ ఈస్ ఎపిటీ! ఎ నైస్ మాన్ అరవాలరాయుడు! బట్ అన్‌ఫార్చునేట్! అనవసరంగా ఏంగర్ తెచ్చుకున్నాడు" అని చప్పరించేశారు.

నాడువచ్చిన గెస్టు ఓ ఆయన మాత్రం "ఏమైనా మీరు హు ఈస్ హు అని మీలోమిమ్మల్ని గురించి అయినా తెలుసు

కోవాలిఅని అనుకుంటాను " అని అంటూ వెంటనే " గుడ్‌నైట్ టు యు ఆల్ జంటిల్‌మెన్ " అని చెప్పి వెళ్ళిపోయాడు.

* * * * *

ఇంటికి అరవాలరాయుడు చేరుకుంటూ యశోదమ్మకు వేసిన మొదటి ప్రశ్న ఇది ఇంతకూ " నీ కళ్ళల్లో పువ్వులు చూపించడానికి వెళ్ళావా ? " అప్పటలుకు తల్లో పువ్వులు చూపించడానికి వెళ్ళేవా ? " యశోదమ్మ " ఏ పువ్వులు చూపించడానికీ ఎక్కడకూ వెళ్ళలేదు. ఈ ముండకోపువ్వో ఓ కాయకూడాను " అంటూ దీర్ఘరోదనం కావించింది.

" మిస్ " అని క్లబ్బులో నిన్ను వేనోళ్ళచాటుతూవుంటే " ముండ " నని అనుకుంటావేం నీవు ?—యశోదమ్మ " వాళ్ళ ఖర్మం ! నా ఖర్మం ! మీ ఖర్మం ! మనకోకాయ కాసివుంటే వాణ్ని వెంటేసుకు పోయివుంటే ఇన్నిపాట్లు లేకపోయావి నాకు అయ్యో ! అయ్యో ! కళ్ళల్లో అరుకు పోశాడేగాని కళ్ళుచూశాడా? ఆ డాక్టరు ? చూడండి ఎలా వుబ్బిపోయాయో వుడికిన వులవ గుగ్గిళ్ళల్లా కళ్ళు-మిడిగ్రుడ్లు అయిపోయాయి. మేడమీదకు వెడితే అక్కడ డాక్టరు ముఖంవంకన్నా చూడలేదు ఎంతసేపూ సిగవంకే చూశాడు ! నా ప్రారబ్ధం ! నా ప్రారబ్ధం ! " అంది.

" ప్రారబ్ధం " అని ఎప్పుడైతే యశోదమ్మ అందో ఆ ముక్క రేడియోన్యూసులా కాలనీ అంతటా వ్యాపించి పోయింది. ఆడవాళ్ళ సంపతీ హెచ్చైపోయింది. " ఈ రోజుల్లో యశోదమ్మ బ్రతుకు ప్రారబ్ధపు బ్రతుకనే చెప్పుకోవాలి ! ఆడపిల్ల కావలిస్తే ఆడపిల్ల కలుగుతూవుండె. మగపిల్లవాడు కావలిస్తే మగపిల్లవాడు కలుగుతూవుండె—డాక్టర్లు తలుచు

కుంటే అసలు మగవాని అవసరంలేకుండానే ఉత్తిపుణ్యానకే సంతానం ఇంజక్టవుతూవుండె. వాడూ ఆపె కూడా అక్కర్లేదంటు న్నారు సైంటిస్టులు కొందఱు—ఊరికే ఇద్దరూ ఓ టెస్టుట్యూబును కావులించుకుంటే, ద్రోణంలోంచి ద్రోణుడుట్టుకొచ్చినట్టు ట్యూబ్ గాళ్ళు పుట్టుకొస్తున్నారట! అల్లాంటి ఎడ్వాన్సు విజ్ఞానపు ఏజిలో యశోదమ్మకు పిల్లలు లేరంటే ప్రారబ్ధమే" అని వాకటే సానుభూతి ప్రసంగము!

అదివిని యశోదమ్మ ఊనోరునొక్కుకోవడం "పోనీ కడుపు కాయకపోతే కన్ను కాయకూడదా? కన్ను కాయకపోతే నోరుకాయకూడదా? ఇంతకూ లోకమంతా నా కళ్ళల్లో! అవేవో పువ్వుల్లా వున్నాయంటే నా మొగుణ్ణొక్కసారి నా కళ్ళకేసి చూడమన్నాను. దాని మీద ఎంతగొడవ పెరిగింది! అవ్వ! అవ్వ!"

.... .... .... .... ....

# ప్రణయమా? ప్రళయమా?

ఒక మోటార్కారు రోడ్డుమీద వడిగా ఎడంతట్టు పోతూవుంది. ఆ సమయానికి కాలినడకను వడిగా నడుస్తూవున్న "నవనీత మ్మాళ్" అనే వ్యవహార నామంగల నవలారత్నం మెఱపులా ఆ కారుకు "కుడికుడి" గా ఎదురైంది. "రివాల్వింగు షెల్ఫు" ఒకించుక తిరిగినట్టు, మోటారు నడుపుతూవున్న డాక్టర్ శివరావు ముఖం ఈమెకేసి తిరిగింది. "లోకో ఇంజన్" గనుక "టర్నింగ్ పోయింట్" ఇరుసుమీద, ఓ తట్టు ముఖమున్నది,

మరోతట్టు ముఖం రావడానికి పరిభ్రమిస్తుందే, "అందమాదిరి" సునాయాసంగా ఈమెయిన్ను తన శారీరోర్ధ్వభాగాన్ని సన్నని నడుంకిటుకునే వెనుకతట్టుకు మళ్ళించినదై, కంటిరెప్పల కొస లంట కొసరు చూపులు సన్న సన్నగా విసిరింది—గమన తీవ్రత హెచ్చా, కటాక్ష నైశిత్యము హెచ్చా అన్నట్టు—

కాని ఎంతలో ఎంతదుమ్ము కమ్మేసింది, ఆమె కను దమ్మలను, ఆమె సంపెంగ ముక్కుని, ఆమె తుమ్మెదముంగు రుల్ని ?—తక్షణం చెంగు ముఖంమీదకు తీసికొన్నదై "ఈపుర పాలక సంఘమంత దరిద్రపు సంఘ మిదేకాని మరొకటి కానం ! రోడ్లువేసిన ముండాకొడుకులు అమేషా రోడ్లు తడిపిస్తూ వుండ కూడదూ ? ప్రతీవ్యక్తికీ మోటారుకారు ఎక్కణ్ణుంచి వస్తుంది ? ఛెస్ ! నోటిలోనికి పోయిందే ధూళి ! ఈనా ఊపిరి తిత్తులు ఇసక బస్తాల్లా బరువెక్కి పోయినాయే అబ్బా !" అని అను కుంటూ ఉక్కిరిబిక్కిరై పోయినంత విధివిరామంలేని దగ్గుదగ్గి ఒకింత తాళి, మళ్ళీ ఆ "కారు" పోయినవంకకు చూచింది.

కారెక్కడుంది అక్కడ ? అదప్పుడే ఆమడ దూరం ధుమధుమా ఎగిరిపోయినట్టెగసిపోయింది. జ్ఞాపకం చేసుకోవ డంలో వనితమ్మాళ్‌కు ఆ "కార్" విషయమై ఆ "కార్" నడుపుతూవున్న వాని విషయమై మనస్థగితములై పోయినవి, ఆమె మఱెవ్వరికీ మరణపర్యంతం చెప్పిందిలేదు.

డాక్టర్ శివరావు సర్వసాధారణంగా అందరూ తీసికొనే దేశవాళీ ఎమ్. బి. బి. యస్. మాత్రమేకాకుండా విదేశాలకు వెళ్ళి అక్కడ డిగ్రీలుకూడా సంపాదించుకొని తన దేశానకు తిరిగి వచ్చిన మేధావి. రూపసి. అతని చేతివ్రేళ్ళ చాకచక్యం

నాడు "మోటారు గియర్" మీద అలా విజృంభించిపోయిందీ అంటే ఆ ప్రభావం అంతా అతనికి శస్త్రవైద్యములో అలవడ్డ చాకచక్యాన్ని బట్టే అనుకోండి. తన "ఆపరేషన్ థియేటర్"లో ఏలా "దుష్టాంగంబులను" తెగ్గోసిపారేస్తున్నాడో అలాగ్గానే ఇటు అటు ఎటుపడితే అటు తన మోటారుకారును అంతలో కొయ్యగలడు. "పారిస్" నుంచి తిరిగివచ్చిన ఆరునెలల్లో అతడు డి. యమ్. వో. గా "కోహినూర్ నగరమునకు "పోష్టు" అయినాడు.

"కోహినూర్" నగరంఅంటే భారతవర్షంలో అపర "పారిస్" పురవరం ఎందుకు ? నవనాగరిక చేష్టలకు, వేషా లకు, భాషలకు, శుచిశుభ్రతకు పరాహకల్పంనాటిది. అయి నప్పటికిన్నీ ఆలాగ్గానే ఆయుర్దాయాలు తగ్గిపోతున్నా ఆదా యాలు ఔషధాల వెంబడి వ్యయమైపోతున్నా, ఏతత్పురజనులు ఆ పటపట్టు విడిచిపెట్టకుండా వుంటూవున్నారు, కొత్తరుగ్మతలకు గావలసిన కొత్త ఆసుపత్రులు స్థాపించుకుంటూ, వాటికోసం ద్రవ్యం సముపార్జించుకుంటూ, మగ నర్సుల్ని, ఆడనర్సుల్ని సంఖ్యయందు సరిసమానంగా తక్కువచేసుకుంటూ, పరుపులు మంచాలు రోగులకు చాలవనుకుంటూ త్రిమతస్థుల—అనగా హైందవ, మహమ్మదీయ. క్రైస్తవ మతస్థులయొక్క గురూ జీలకు, ఆ పట్నంనుంచి లేచిపోయే జీవాత్మలయొక్క తరింపు ఎట్లా అనే యోజనమేకాని ఆ జీవాత్మలు శరీరాన్ని అంటిపెట్టుకు ఊళ్లో ఉన్నంతలో అవి ఆరోగ్యసుఖం, అనామయసుఖం కలిగి వుండడం అనేది ఎట్లా అనే విచింతనం ఇసుమంతాసున్న.

* * * * *

మటీ పైని నేను వ్రాయబోయే సంఘటనము పూర్వో క్తపు "మోటార్ ఇన్సిడెంటు" అనంతరం మూడేండ్లమాట.

డాక్టర్ శివరావు ఎస్సైక్వైర్, క్షయవ్యాధి నివారణ శాఖకు ప్రత్యేక భిషగ్వరేణ్యునిగా గవర్నమెంటువారు నియమించారు. ఆ వైద్యవిశారదుని ప్రస్తుత దైనందినచర్య, మోటారుకారుమీద వెళ్ళి జరపవలసినదే కాకుండా, జిల్లానుండి జిల్లాకు డబుల్ ఫస్టుక్లాసు టి. ఎ. డ్రాచేస్తూ, మెయిల్ ట్రెయిను మీదా, అవసరంవెంబడ్డి వాయువిమానంమీదా పయనించి స్వయంగా హాజరయి జరపవలసినదిగా ఒక మెట్టు పైకెక్కింది. ఈ సందర్భంలో అతని దృష్టిని విశేషంగా మిషనుఆసుపత్రులు ఆకర్షించినాయి.

పాఠకునకు కాలహరణం అని తోచకపోతే, ఆ మిషన్ ఆసుపత్రుల్లో ఓదాన్ని గురించి వర్ణిస్తున్నాను. ఒకదాన్ని గురించి తెలిసికొనివుంటే తక్కిన వాటిని గురించి విభజనగా విననవసరం లేదు. అన్నీ ఒకటే నమోనా, ఆ కట్టడంలోనూ, ఆ కంజాయింపులోనూ, ఆ కనుక్కోవడంలోను.

అమెరికానుంచీ, ఇంగ్లాండునుంచీ, తదితర పాశ్చాత్య దేశాలనుంచీ, దయాస్వభావులు, దేవునియందు దేవునికుమారుని యందు విశ్వాసముగలవారు, భారతవర్షముయొక్క అధోగతిని గురించి దానియందలి ప్రజలయొక్క పతనాన్ని గురించి విని చలించినవారై మతము, వైద్యము రెండింటినీ మేళవించుకుని, పెద్దపెద్ద పొగయోడ లెక్కివచ్చి యీ దేశమందు దిగి "అయ్యో! క్షయ! ఇసీ! చలిజ్వరము! అకటకటా! సన్నిపాతం! కటకటా కష్టకానుపు!" గలదేశమని అనుకుంటూ

"ఫండ్" ప్రోగుచేసి ఒక్క నిమేషంలో ఇంద్రభవనంలాంటి మాడువును 10, 12 యకరాల మేరలో విశాల మైదానమ్మీద నిర్మించి, అందులో ఆ విదేశీయులు నివాసముకుగాను ఎంచక్కటి బంగాళాలు ఏర్పాటుగావించుకుని మానవసేవా పరాయణులై యుంటారు.

కాంపౌండు గోడకు జాబులపెట్టె, ప్రవేశద్వారంకడ ద్వారపాలకునిగూడు దారి పొడుగుతా యిరుపార్శ్వాలా పరిమళించే పూలమొక్కలు, మెరసిపోయే ఆకుల జొంపాలు, చిట్టితాళ్లు, పొట్టిఖర్జూరాలు, నందనవన రూపంగా విలసిల్లి వుంటుంది. వరండాల్లోనూ, వార్డుల్లోను మందస్మిత వదనాల్తో కనవచ్చే నర్సునారీమణులు తెల్లటోపీలు ధరించి, తెల్లగౌనులు తొడిగికొని దేవదూతలాగు గోచరిస్తూవుంటారు. గదుల్లో రోగుల పక్కలమీద ఈగలు దోమలు వాలకుండా చిలకబడిన ఫినైల్, లైసాల్ ఇత్యాదుల సంస్కృతి! అన్నింటికంటె భవన శిఖరోపరి క్రీస్తు శిలువ!

నవనీతమ్మాళ్ అప్పటికప్పుడే యేడాదిఅయి "బ్రాంకైటిస్" వ్యాధి తగిలి మిస్‌లాంట్ దొరసానమ్మగారి ఆసుపత్రిలో "ఇన్పేషంటుగా చేర్చుకోబడింది, కాని వ్యాధి నివారణకాలేదు, వ్యాధి నివారణ కాకపోయినప్పటికి ఆ దొరసాని అమెతో "ప్రిల్లు"గా ఇంగ్లీషున మాట్లాడుతూ బైబిల్ గ్రంథంలోని సూక్తులు వివరించి చెబుతూవుంటే అదోవిధమైన గానాదరణ, జ్ఞానస్ఫురణ కలిగింది అవుతూ, "వెళ్ళమ్మా! నీకిక్కడ ఈ వ్యాధి కుదరదు" అని వాళ్లు అంటూవున్నాగానీ ఆసుపత్రి విడిచి పోదాయె. తనకుమరెక్కడనూ సుఖం అంతకంటే చేకూర

బోధన్నట్టు అదోతృప్తివంతపు అధ్యాత్మక చూపు చూస్తూ వుండేది నవనీతమ్మాళ్.

*  *  *  *  *

1940 క్రిష్టమస్ సెలవులు "ఎవెయిల్" చేసుకొన్నట్టూ వుంటుంది, తన పాతస్నేహితుల్ని కోహినూర్ నగరవాసుల్ని కలుసుకొన్నట్టూ వుంటుంది, అనే మహత్తరాలోచనగా శ్రీ డాక్టర్ శివరావు ఎం. డి. ఎం. ఎస్. ఎఫ్. ఆర్. సి. ఎస్. లండ్....ఎడిన్....చిక్....కోహినూర్ నగరం బయటవున్న ట్రావలర్సు బంగాళాలో విడిసినాడు. మిస్ లాంబ్ బంగాళాకు 25–12–1940 వ తేదీ సాయంకాలము మూడుగంటలకు వెళ్ళి ఆమెకు "సుఖవంతమైన కిసిమిసి" చెప్పినాడు. ఆ చెప్పే సందర్భంలో ఆమెకు చక్కంటి పూలగుత్తి బహుమానంగా ఇచ్చినాడు. ఆమె ఆ పూలగుత్తి అలా సుతారంగా తన నాసికాగ్రాన్ని తాకించుకుంటూ "లవ్లీ! థాంక్సు!" మిష్టర్ శివరావు! నా ఆసుపత్రిలో ఇప్పుడు ఓ చిత్రమైన పేషెంట్ వుంది!" అంది. శివరావు "ఆడా? మగా? మనిషా? జంతువా?" అని అడిగాడు దొరసాని మాట పూర్తిగా వినకుండానే. మిస్ లాంబ్ "ఆడ! ఆమె జుత్తు ఊఎదిగిపోతూవుంది. ఆమె శరీరం చిక్కిపోతూవుంది" శివరావు "సహజం! సుందరం" మిస్ లాంబ్ "క్షయయేమో అని నాకనుమానం" "క్షయ అని అనడంతోనే శివరావు డాక్టరు ఓ విధమైన పరవశభావం ఎత్తినట్టూగిపోయినాడు. ఎంచేతా అంటే తన్నివారణలో అతడు ప్రత్యేకానుభవసిద్ధి పొందిన వాడవడంచేత "ఇప్పుడే పోయి ఆమెను మనంచూదాం ఆలస్యమెందుకు?" అన్నాడు

వెంటనే కుర్చీమీదనుండి లేస్తూ. మిస్ లాంబు "వస్తున్నాను. రోగికోసం క్రిస్‌మస్ బహుమానం తయారుచేసి వుంచాను ఒకటి" అనిఅంటూ "విశ్వపదార్థ సంపుటీకరణము"గా సూచింపబడే ఉల్లిపొరకాగితపు నిండుసంచీయొకదాన్ని చేత నూచుకుంటూ బయలుదేరింది.

మిస్ లాంబు, మిష్టర్ శివరావు ఇద్దరూ ఆమె "హైసోల్సు" మీద ఈతడు "లోసోల్సు" మీద ఒకపే ఎత్తున టకటకా ఆసుపత్రి మేడమెట్లెక్కుతుంటూ వస్తూవున్నారు. ఆ గంటకు పేషెంట్ నవనీతమ్మాళ్ యొక్క దివ్యసందర్శనం ఏలావుండింది ఆ మిషను ఆసుపత్రిలో ?——

మిడతలదండు గుట్టపుదళం లాగు పొదివికొని సింహాలల్లే తన్ను తమనోట కరచుకొని అడుగులేని గోతిలోనికి లాక్కు పోతూవున్నట్టు చూచింది. ద్రాక్షరసం నెత్తురురూపంగా అగు పించింది. తనచుట్టూ కొచ సంబంధమైన మహాసముద్రము కళపెళా క్రాగిపోతూవున్నట్టు కనిపెట్టింది. నదుల్లోని బాల పులినాలు తూరీగరెక్కల్లాగు, అడవుల్లోని ముదిపేకులు గొల్లభామ పరువుల్లాగు ఎగిరిపోతూవున్నట్టు అరసింది. ఏదో మహానగరం, అందున్నటువంటి బంగారంతోటి, వెండితోటి, నవరత్నాలతోటి. చీనిచీనాంబరాల్తోటి. సుగంధద్రవ్యాలతోటి, మంచిగంధంతోటి, గోధుంపిండితోటి, గోవులతోటి, రథాలతోటి, రథ్యాలతోటి, మానవులతోటి మానవులయొక్క ఆత్మలతోటి, తగులడిపోతూ, దుమ్మకు ప్రత్యేమ్నాగా ఎఱ్ఱనిమంటలు పైకి ప్రజ్వలింపచేస్తూ వున్నట్టుగా పరికించింది.

నవనీతమ్మాళ్ పెదవులు కంపించి పోతున్నాయి. ఎందుకో తెలియదు. ఏమి వాక్రువ్వాలనో గోచరించదు.

మిస్ లాంబు ఆడడాక్టరు, మిస్టర్ శివరావు మగడాక్టరు ఇద్దరూ పేషెంటుకు చెరోప్రక్కనా మంచం ఇనుపఅంచులమీద కూర్చున్నారు. ఆడడాక్టరు చేతిలో కిసిమిసిపండుగ రాసుక నంచీవుంది. చిరునవ్వు నవ్వుతూంది. మగడాక్టరు జేబులోనుంచి గుండెరొద కొలగొట్టం పైకితీస్తూవున్నాడు. నయనాలు అశాంతరంగితములుగా చేతిరుమాలుతో తుడుచుకుంటూవున్నాడు. పేషెంటుకు తలపైవున ఓ మగనర్సు ఓ ఆడనర్సు నిలబడివున్నారు. మగనర్సు చేతిలో మందుసీసావుంది. ఆడనర్సు చేతిలో ఔన్సుగ్లాసు వుంది. పేషెంటు కాళ్ళవద్ద ఆయా పోలమ్మ వెచ్చవెచ్చని పాలగిన్నె పుచ్చుకు నిలుచుంది వాకిట్లు. రెంగోటిట్టు సాహెబు ఇబ్రహీము బ్రెడ్ తునుకలు వెయి చేసుకు "ప్రై" చేసుకు వేచియున్నాడు.

పేషెంటు మిన్నకున్నమనిషి. మిన్న మిన్నకున్నట్టుగా ఉండి వుండి హఠాత్ కీచుగొంతుకతో శ్వేతాంగనా సంగీతస్థాయిని ఈ క్రింది ఇంగ్లీషు ముక్కలు "క్రిష్టమస్ కెరోల్" గా పాడ దొడగింది. పాడుతూన్నంతసేపూ ఆమె డాక్టరు శివరావును చూస్తూనేవుంది సుమండీ! నమ్మండి పాఠకులు!

"He drove his car abreast
I saw his face through dust
I do not now well remember
Six six six the number"

డాక్టరిస్ లాంబ్ వెంటనే డాక్టరు శివరావుతో

"That's the number of the beast in our Holy Bible" అంది సీరియస్‌గా. అంటూవుంటే డాక్టరు శివరావు ఆ దొరసాని వాక్యం వినిపించుకోకుండా ఏదో స్మరణరు తనకుదాను చెప్పుకుంటూ వున్నాడు. పేషెంటు ఇంకా పాడుతూవుంది.

'He, cannot be a beast
bove, 'low South North West East
If you're aware madame!
Fix Fix Fix 'm by name"

నీకెవ్వరైనా తట్టుతున్నారా? శివరావుగారూ ఈమెకు తెలియజెప్పడానికి ఆమనిషిపేరు. నాకెవ్వరూ మనస్సులో పుట్టడంలేదు "King of Kings and Lord of Lords." తప్ప అంది మిస్ లాంబ్.

డాక్టర్ శివరావు తనలో "నేను మూడేండ్ల క్రితం ఈ నగరంలో డి. ఎం. వో. గా ఉన్నప్పుడు నా కార్ నెంబరు 666" అని వితర్కించుకొని కొంచెం చిన్న మోము చేసుకొని ప్రకాశంగా మిస్ లాంబుతో అంటున్నాడు. "దుమ్మూ ధూళి ఎగబీల్చడం వల్ల ఈమెకు క్షయవ్యాధి వచ్చింది. కొత్తగా నెలకొల్పబడిన "అశ్విన్ పురమునందలి ఒకటవ నెంబరు టి. బి. హాస్పటల్‌కు ఈమెను పంపించండి" అన్నాడు. ఈమె ఈ మా ఆసుపత్రి విడచిపెట్టనంటుందే?" అంది మిస్ లాంబు. "ఇప్పుడు నాతో పంపించండి నేను తీసుకు వెడతాను. ఏమమ్మా?" అని పేషంటు దిక్కు మొగంబై అడిగాడు శివరావు.

పేషెంటు :

"Death and hell were cast into the lake of fire. He is Alpha and Omega, the beginning and the end, the first and the last!"
అంటూ కళ్ళుమూసుకు తన జీవితానికి స్వస్తి చెప్పింది. నాడు మఱి రాత్రి పడలేదు.

సంపూర్ణము.

# ఇందులో కథలు

43

# శరత్ నవలలు

( శరత్ సాహిత్యం అసలైన అనువాదాలు పెద్ద సైపులో నిర్దుష్టమయిన ముద్రణ, చక్కని గెటప్ )

| | | |
|---|---|---|
| శ్రీకాంత | నీలకంఠం | 7–50 |
| చరిత్రహీనులు | ,, | 6–00 |
| భారతి | ,, | 6–00 |
| సవిత | ,, | 6–00 |
| శేషప్రశ్న | ,, | 6–00 |
| భైరవి | ,, | 4–00 |
| గృహదహనం | ,, | 5–00 |
| అరక్షణీయ | ,, | 1–25 |
| వాగ్దానం | లక్ష్మణస్వామి | 3–00 |
| పల్లెజీవనం | ,, | 2–00 |
| విప్రదాస్ | ,, | 4–00 |
| చంద్రనాథ్ | ,, | 1–50 |
| స్వామి | ,, | 1–00 |
| పరిణీత | ,, | 1–00 |
| బడీబహన్ | ,, | 0–75 |
| నళిని | ,, | 0–75 |
| సుమతి | కాపాలి | 0–75 |
| బిందుగారబ్బాయి | ,, | 1–00 |
| దేవదాసు | తీర్థులు ఎం. ఏ. | 1–50 |
| అనుపమాదేవి | ,, | 1–00 |

మిగతా రకాలు అతి త్వరలోనే వెలువడును.

దొరకుచోటు

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

సంస్కృతాంధ్ర బుక్‌డిపో [స్థా. 1882] రాజమండ్రి.